ఇది పదియేండ్ల క్రిందటి రచన. ఇందులో 1935 నాటికి ఉండిన సంగతి సందర్భములు మాత్రమే వివరింపబడినవి. ఆ తరువాతి విశేషములను, వీలుచూచుకొని, మరొక్కప్పుడు ఈ గ్రంథకర్తచేతనే వ్రాయించి, ప్రకటింపగలము.

ప్ర కా శ కు లు.

## సూ చి క

# మహమ్మదీయ రాజ్యాలలో జాతీయ వికాసము

రచన:

కాళీపట్నం కొండయ్య, ఎం. ఎస్‌సి.,

సంస్కృతి ప్రచురణ
(26)

# ఈ జి ప్టు

ప్రపంచంలోని అతిప్రాచీనమైన దేశాలలో ఈజిప్టుదేశం ఒకటి. ఇది ఎడారులమధ్య నున్న సన్నని భూభాగం. దీనికి జీవం నైలునది. ఈజిప్టు ముఖ్యంగా వ్యవసాయకదేశం. పత్తిపంట ప్రాముఖ్యమైనది. దేశంలోని 1,30,00,000 ప్రజలకు సరిపడిన ఆహారాదికము లన్నీ సామాన్యంగా దేశంలో పండుతాయి. ప్రపంచంలోని అనేక చిన్నచిన్న ఇతరదేశాలకువలెనే. ఈజిప్టుకూడా స్వతంత్రంగా జీవితం గడుపుకోగలిగి ఉండేదే భారతదేశానికీ, ఇంగ్లండుదేశానికీ మార్గంలో ఉండే దురదృష్టం గనుక పట్టకపోయిఉన్నట్టయితే. భారతదేశం బానిసగా ఉండడంవల్ల స్వయంగా పడే కష్టంమాట ఏలా ఉన్నా, అనేకఇతరదేశాల పారతంత్ర్యానికి కారణభూతమైంది. భారతదేశపు దాస్యం స్థిరపడినకొద్దీ ఈజిప్టుకూడా సామ్రాజ్యపాలకుల ఉచ్చులలో చిక్కి చివరకు బ్రిటిషు సామ్రాజ్యఅంతర్భాగంగా 'సంరక్షణ'పొందే స్థితిలోకి వచ్చింది.

ప్రాచీనంకావడంచేతనో ఏమోకాని సామాన్యంగా ప్రాచ్యదేశాలలో ఒకవిధమైన మాంద్యం, అలసత్వం ప్రబలమైంది. ఈ దేశాలు ఉజ్జీవితం కావడానికి అనేక హేతువులు కలుగుతూఉంటాయి. ఈలాంటి కారణాలలో ఇటీవల ప్రధానమైనది ఆధునిక పాశ్చాత్యసభ్యతతోడి సంఘర్షణ. ఆధునికపాశ్చాత్యదేశాలతో ప్రథమంలో సంబంధం కలిగిన దేశం ఈజిప్టు. మానవసంఘపరిణామంలో నూతనఆదర్శాలకు మార్గదర్శకమైన ఫ్రెంచి విప్లవకారుల స్వతంత్రభావాలు నెపోలియనుచక్రవర్తిదండయాత్రలవల్ల కలిగిన సంచలనంమూలంగా సర్వత్రా వ్యాపించాయి. అనేకదేశాలలో స్వాతంత్ర్యేచ్ఛ అంకురించింది. 1798 సం.రంలో నెపోలియను ఈజిప్టు దేశంలో దిగాడు. భారతదేశంవిషయంలో ఫ్రెంచివారికీ, బ్రిటిషువారికీ

కలిగిన స్పర్ధలు అప్పటి కింకా సమసిపోలేదు ఈజిప్టుదేశం ఆధారంగా చేసుకొని భారతదేశంలోని బ్రిటిషుఆధిపత్యం అణచివేయడానికి నెపోలియను యోచించాడు. పాశ్చాత్యులు భారతదేశం పరిపాలించాలంటే ఈజిప్టు వారి స్వాధీనంలో ఉండడం ముఖ్యమని గ్రహించాడు. అప్పటికి ఇంకా సూయజు కాలవ లేదు. అది తవ్వించడం ముఖ్యమని నిశ్చయించాడు.

అంతక్రితం వందలసంవత్సరాలనుంచీ ఈజిప్టుదేశం తుర్కీ సుల్తానుల పాలనలో ఉండేది. ఈజిప్టు తుర్కీలో లయమైపోయింది. తన ప్రాచీననాగరకతను పిరమిడ్ల కింద భద్రంగా పూడ్చిపెట్టింది. తన వ్యక్తిత్వం తలపుకు రాకుండా చేసుకుంది. ఈజిప్టుదేశం అనే మాటకు అర్థం అప్పట్లో ఎడారులమధ్య నున్న భూభాగమేకాని ఈజిప్టుజాతి కాదు. 1770 సంవత్సరప్రాంతాన్ని మేమలూకులు అనే తెగవారు సుల్తానుమీద తిరుగుబాటు చేశారు. వారి నాయకుడు, ఆలీ బే, తుర్కీవారిని దేశంలోంచి వెడలగొట్టాడు, సుల్తానురాజ్యంలోని సిరియానుకూడా జయించాడు.

తాను ఈజిప్టులో ప్రవేశించడం తుర్కీవారి వారసత్వపు హక్కులను తిరిగి వారికి జరుగుబాటుచేయడానికని నెపోలియను వంకజెప్పాడు. కాని అతని నిజఉద్దేశం కొద్దిలోనే బయల్పడింది. ఈజిప్టుదేశం ఫ్రెంచిపాలనలో స్థిరపడడమే తుర్కీసుల్తానుల వారసత్వం స్థిరపడడం అని తేటపడింది. నెపోలియనుమీద సుల్తాను కత్తికట్టాడు. ఆ అదునుకోసమే కనిపెట్టుకొనిఉన్న బ్రిటిషువారు అతనికి మద్దత్తయారు. నెపోలియను వేసిన ఎత్తులు వారికి అవగాహనఅయాయి. అన్నివిధాలా అడ్డంపడ్డారు. నెపోలియనుఆశలన్నీ అడుగంటేటట్టు చేశారు. అతను ఎలాగో తన దేశానికి చేరగలిగాడు. భారతదేశంలో బ్రిటిషువారి యాజమాన్యానికి ముప్పు తప్పింది. ఈజిప్టుదేశంలో మరి ఏ పాశ్చాత్యదేశానికి నీడదొరికినా, తాము భారతదేశానికి నీళ్ళు వదలుకోవలసిందే అని బ్రిటిషువారు గ్రహించారు. ఈజిప్టుదేశంలో తాము పాదంపెట్టడం అవశ్యమని నిశ్చయించుకొన్నారు. అప్పట్లోనే ఈజిప్టు బ్రిటిషువారి చల్లనిపాలనలో చేరిపోవలసింది. కాని

బ్రిటిషువారి పరువు అప్పుడు బాగుండలేదు. పాశ్చాత్యప్రపంచంలో ఉండే పరస్పరవైమనస్యాలవల్ల మరికొంతకాలం ఈజిప్టుదేశం తెల్లవారి చేతులలో పడకుండా దాటింది.

ఫ్రెంచివారిని ఈజిప్టునుంచి వెడలగొట్టిన తరువాత, బ్రిటిషువారు దేశంలో స్థావరంకుదుర్చుకునే యత్నం చేశారు. ఫ్రెంచివారి పద్ధతినే అనుసరించి, తాము పడే పాటులన్నీ సుల్తానువారసత్వం స్థిరపరచడానికే అని ప్రకటించారు. ఆ కార్యంకోసం 1807 సం.వరకూ బ్రిటిషుసైన్యం దేశంలోనే నిలిచిపోయింది; ఆతరువాతఅయినా ఈజిప్టుదేశం వదలి పోవలసిరావడం బ్రిటిషువారికి హితవైకాదు; గత్యంతరం లేకపోబట్టికాని. ఈజిప్టుదేశస్థుడైన మహమ్మదాలీ అనే శూరుడు బ్రిటిషువారిని దేశంలో నుంచి తరుమగొట్టాడు. నాలుగువందల యాభైమంది బ్రిటిషుసైనికుల బుర్రలు కెయిరోకోటమీద వేళ్ళాడగట్టాడు అతడు.

మహమ్మదాలీపరిపాలనతో ఈజిప్టుచరిత్రలో నవయుగం ఆరంభమైంది. మహమ్మదాలీ, విద్యాగంధం ఏమీ లేకపోయినప్పటికీ, సహజంగా బుద్ధిశాలి. మొదట్లో మామూలుసైనికుడుగా ఉండి, కేవలం ప్రజ్ఞావిశేషంవల్ల రాజపదవి పొంది, దేశహితం లక్ష్యంగా పరిపాలనజేసిన ప్రతిభాశాలి. ఈజిప్టుదేశములోంచి పరదేశీయులను పారదోలిన ధైర్యశాలి. ఈజిప్టుకు సైనికనావికదళాలు ఏర్పరిచాడు. దేశంలో వ్యవసాయసౌకర్యాలు వృద్ధిజేశాడు. పత్తిపంట వ్యాపింపజేశాడు. రైతుల ఆర్థికస్థితి అభివృద్ధిజేశాడు. అలెగ్జాండ్రియారేవుపట్నంలో నౌకాశ్రయం కట్టించాడు. స్వయంగా తాను విద్యనేర్చినవాడు కాకపోయినా, విద్యమూలంగాగాని దేశం బాగుపడదని గ్రహించి, సర్వవిధాలా విద్యావ్యాపన ప్రోత్సహించాడు. దేశంలోని యువకులను ఉన్నతవిద్యాభ్యాసంనిమిత్తం పరదేశాలకు పంపించాడు. దేశంలో అనేకప్రాథమికపాఠశాలలూ, ఒక వైద్యకళాశాలా నెలకొలిపాడు. బీదవిద్యార్థులను తాను స్వయంగా పోషించేవాడు.

మహమ్మదాలీ ప్రతిభాశాలి అయిన పరిపాలకుడుమాత్రమే కాదు, యోధుడుకూడాను. ఈజిప్టుప్రాంతంలోని సిరియా హెజాజురాష్ట్రాలను జయించాడు. కుమారుడైన ఇబ్రహీముతో కలిసి, మక్కా-మదీనాలు జయించి అరేబియాను స్వాధీనంచేసుకొన్నాడు. అప్పట్లో జీర్ణమై కొన ఊపిరితో ఉన్న తుర్కీ-రాజ్యం జయించి దానిని ఉజ్జీవితంచేయాలని ఉత్సాహపడ్డాడు. కాని పాశ్చాత్యప్రభుత్వాల ఈర్ష్యవల్ల కార్యం కొన సాగలేదు. ప్రాచ్యదేశాలు ఏవి ఎప్పుడు తమ ఇళ్ళు చక్క-బెట్టుకొని నవయుగజీవితం చేయదలచినా పాశ్చాత్యప్రభువులకు కంటకంగా ఉంటుంది. ఆ దేశాలు అభివృద్ధికాకుండా అడ్డుపెట్టడానికి ఏదో సాకు దొరకకపోదు.

మహమ్మదాలీవంశీయుల పాలనలో మొదట కొంతకాలం ఈజిప్టు ప్రజలు సౌఖ్యసంపదలు అనుభవించారు. రైతులు సుఖజీవనం చేశారు. దేశానికి ఎర్రని ఏగాని అయినా అప్పులేదు. సకాలంలో నమ్మకంగా వచ్చే దేశాదాయం పరిపాలనఖర్చులకుమాత్రమే కాకుండా రైళ్ళూ కాలవలూ మొదలైన సౌకర్యాలు కలుగజేయడానికికూడా సరిపోయేది. కాని రెండుతరాలు గడిచినతరువాత ఇస్మయిలు అనే అతని ప్రభుత్వంలో దేశస్థితి మారడం ఆరంభమైంది. ఇస్మయిలుకు దర్బారుఖర్చులు మితి మీరాయి. ప్రజలిచ్చే పన్నులన్నీ అందుకే సరిపోయేవి కావు. క్రమంగా అప్పులలో దిగాడు ప్రభువు. ఆ అప్పులైనా కంఠానికి ఉరిపోసుకొనేవి కాని సామాన్యమైనవి కావు; పాశ్చాత్యరాజ్యాలదగ్గర అప్పులు. ఏదేశాని కైనా పాశ్చాత్యుల దృష్టి తగిలితే, ఋణాలరూపంగా మొదట దానికి కనకవర్షం కురుస్తుంది. ప్రథమంలో ఋణరూపకమైన ఆర్థికదాస్యం ఆర్థికరక్షణలు, వ్యాపారపుహక్కులు మొదలైన వింత వింత రూపా లుగా పరిణమించి, అచిరకాలంలోనే పరిపూర్ణమైన రాజకీయదాస్యంగా పరివర్తన చెందుతుంది. నాగరకపాశ్చాత్యదేశాలలో తాను కోరినప్పుడల్లా అప్పు పుడుతోంది అనే ఇస్మయిలు సంతోషించాడు కాని అది ఏవిధంగా

పరిణమిస్తుందో ఊహించలేకపోయాడు. కొద్దికాలంలోనే అప్పుల తీర్మానానికి ఆస్తులు అమ్మవలసివచ్చింది. అంతకుక్రితమే సూయజుకాలవ తవ్వడం పూర్తిఅయింది. సూయజుకాలవకంపెనీలో చాలావాటాలు ఇస్మయిలువీ, ఫ్రెంచివారివీని. మొదట బ్రిటిషువారికి అందులో భాగం కుదరలేదు. కాని ఇస్మయిలుపుణ్యమా అంటూ వారికి మంచి అవకాశం లభించింది. సూయజుకంపెనీలోని తన వాటాలన్నీ బ్రిటిషుప్రభుత్వానికి అమ్మివేసి అతడు తల తడుపుకొన్నాడు. ఈ కార్యంకోసం కుశాగ్రబుద్ధి అయిన బ్రిటిషుప్రధానమంత్రి డిస్రాలీగారు తలకిందుగా తపస్సుచేసి కృతార్థుడయాడు. దీనితో ఈజిప్టుదేశం బ్రిటిషుసామ్రాజ్యపాలకుల ఉచ్చులలో చిక్కిందని చెప్పవచ్చు. పోనీ, ఆవిధంగా పాశ్చాత్యఋణ దాతల పాశాలనుంచి దేశం బయటబడగలిగిందా? అదీ లేదు. ఇస్మయిలు చేతికి వచ్చిన డబ్బు మొత్తం అంతా నలభయిలక్షల పౌనులకు మించ లేదు. పనికిమాలిన పద్ధతులలో అది కాస్తా మరునాడే ఖర్చయిపోయింది. దేశపు అప్పులు యథాప్రకారంగానే ఉన్నాయి. అంతకంతకు ఆర్థిక బంధాలు బిగువయాయి. ఇంగ్లండుదేశంనుంచి, ఈజిప్టుదేశపు ఆర్థికస్థితిని విచారించడానికని సంఘం ఒకటి తయారైంది. ఒకటితరువాత ఒకటి, వరుసగా విచారణసంఘాలు ఆరంభంఅయాయి. ఈజిప్టుదేశం పాశ్చాత్య ఋణదాతల పాశాలలో మరింత తగులుకోవడమే విచారణల ఫలితం. ఆర్థికంగా ఆరంభమయిన ఈదాస్యం కొద్దిలోనే రాజకీయంగా పరివర్తన జెందింది. బ్రిటిషు రాజనీతి కోవిదుల చిరకాలపు తపస్సు ఫలించింది. బ్రిటిషువారికి దేశంలో స్థిరవాసం కుదిరింది. కాని, పరదేశీయుల స్థిర నివాసంతో దేశంలో జాతీయత ప్రభవించింది.

ఈజిప్టుకు అప్పులుపెట్టినది ముఖ్యంగా బ్రిటను ఫ్రాన్సుదేశాలు; అంటే బ్రిటిషు, ఫ్రెంచి సాహుకారులు. అప్పులజాగ్రతకోసం ఆర్థిక రక్షణలూ, ఆర్థికరక్షణల జాగ్రతకోసం ఆర్థికమంత్రులూ, సైనికదళా లూను! కొద్దికాలంలోనే ఇస్మయిలు పదభ్రష్టుడయాడు. అతని కొడుకు

టూఫికుబేసు పీఠంమీద కూర్చోబెట్టారు. ఆర్థికవిషయాలలో ఆలోచన చెప్పడానికి మేజరు ఎవెలినుబేరింగు అనే ఆంగ్లేయుడు ఇంగ్లీషువారి 'ఫైనాన్సుకమిషనరు'గా ప్రత్యక్షమయాడు. మంచి సుముహూర్తంలో పాదంపెట్టాడు ఆ మహనీయుడు; ఇరవై ఆరుసంవత్సరాలవరకూ స్థానచలనం కలగలేదు. ఈయనే తరువాత లార్డుక్రోమరుగా మారాడు.

చాటుమాటులు లేకుండా, బహిరంగంగా ఈజిప్టురాజ్యరంగంలో ఫైనాన్సుకమిషనరురూపంతో ప్రత్యక్షమైన పారతంత్ర్యచిహ్నం ఈజిప్టీయుల కండ్లు విప్పింది. జాతీయాభిమానం విజృంభించింది. దేశంలో తీవ్రమైన సంచలనం కలిగింది. బుద్ధిహీనపు పరిపాలనవల్ల దేశాన్ని పారతంత్ర్యసముద్రంలో ముంచిన తురుష్కపరిపాలకులమీదా, ఆర్థికవేషాలతో దేశంలో స్థిరవాసం ఏర్పరుచుకోదలచిన పాశ్చాత్యుల మీదాకూడా తిరుగుబాటు ఆరంభమైంది. చిరకాలంనుంచి నిరంకుశపరిపాలనవల్ల నిస్సారమైపోయిన ప్రజాహృదయంలో స్వాతంత్ర్యరసం ఉద్భవించింది. దాస్యజీవితానికి అలవాటుపడి మానుషత్వమే నశింపనున్న మానవునిలో ఆత్మోత్తేజం కలిగింది. అరాబీపాషా అనే ఈజిప్టీయుని నాయకత్వంకింద ఈజిప్టుస్వాతంత్ర్యసమరం ఆరంభమైంది.

దేశంలో ఉద్భవించిన జాతీయోద్యమం పాశ్చాత్యప్రభువులకూ, పత్రికలకూకూడా వెగటుగా తోచింది. ఇది ఒక్క ఈజిప్టువిషయంలోనే కాదు; ప్రతిదేశంవిషయంలోనూను. చిరపీడితమైన మానవహృదయంలో అదృష్టవశాత్తూ అంకురించి అభివృద్ధిజెందే ఆత్మగౌరవం జాతీయోద్యమరూపంతో వ్యక్తమవుతుంది. ఇది ఆశీర్వదించవలసిన విషయంకాని శాపనార్థాలు పెట్టవలసినది కాదు. కాని స్వార్థచింతాపరులై అహంకారపూరితులైనవారిని అంధకారం ఆవరిస్తుంది. సత్యదృష్టి నష్టమవుతుంది. జాతీయతరూపంగా సకలహృదయాలనూ కలవరపెట్టే ఉన్నతభావోద్రేకం సంకుచితమైన జాతిద్వేషంగానో, తుంటరులు రగుల్కొలిపిన మతద్వేషంగానో వారికి కనపడుతుంది.

అరాబీపాషా అసలైన ఈజిప్టీయుడు; రైతుబిడ్డ. మామూలుసైనికుడుగా జీవితం ఆరంభించి క్రమంగా సేనానాయకుడయాడు. అరాబీ యోధుడూ, శాసనకర్తా కాడు; కాని వక్త. ఈజిప్టులోని సుప్రసిద్ధమైన ఎల్ అజారు విశ్వవిద్యాలయంలో ఉన్నతవిద్య నభ్యసించాడు. అప్పట్లో ఈజిప్టుసైన్యంలో పెద్ద ఉద్యోగాలన్నీ పాలకులైన తురుష్కులకేకాని దేశీయులైన ఈజిప్టీయులకు తక్కువ. అది అక్రమమని అరాబీ మొదట తిరుగుబాటుచేశాడు.

సరిగా ఆసమయంలోనే పురాతనకాలంనుంచీ జీర్ణమై, జీవరహితమైపోయిన ఎల్ అజారువిద్యాలయం ఉజ్జీవితం కాదొడగింది. మహమ్మదీయసంస్కృతికి అది ఆటపట్టు. అది ఉజ్జీవితం కావడంతో చిరకాలానుగతమైన దాస్యభావాలవల్ల శుష్కించిపోయిన మహమ్మదీయమతంలో కూడా స్వాతంత్ర్యభావోదయం కలిగింది. దీనికి ముఖ్యకారకుడు సుప్రసిద్ధుడైన జమాలుద్దీను ఎల్ అఫ్గానీ. అతనిమూలంగా నిర్జీవమైన ఎల్ అజారు విద్యావిధానంలో చైతన్యం కలిగింది. శల్యప్రాయమైన ఇస్లామిక సంస్కృతికి ఆయన ఆయువుపోశాడు. అతని భావాలు ముఖ్యంగా ఈజిప్టుపర్షియాదేశాలలో గొప్పసంచలనం కలుగజేశాయి. ఉన్నతాశయాలుగల నవయౌవనులు అతని శిష్యబృందమయారు. వారివల్ల ఈజిప్టుసిరియాదేశాలలో స్వాతంత్ర్యభావవికాసం కలిగింది.

జమాలుద్దీను 1838 సం.రంలో ఆఫ్గనుస్థానంలో పుట్టి, బొఖారాలో విద్యాభ్యాసం చేశాడు. అక్కడనుంచి భారతదేశానికీ, మక్కాకూ వెళ్ళి 1857 లో తిరిగి ఆఫ్గనుస్థానం చేరాడు. 1869 లో తిరిగి భారతదేశం మీదుగా మక్కాకు వెళ్ళి, అక్కడనుంచి ఈజిప్టులోని కెయిరోపట్నం చూచి, తుర్కీరాజ్యపు ముఖ్యనగరమైన కాన్స్టాంటినోపులు చేరాడు. ఆ రాజధానిలో ఆయన చెప్పిన ఉపన్యాసాలవల్ల గొప్ప సంచలనం బయలుదేరింది. జమాలుద్దీను మహమ్మదీయసాహితీసంస్కృతులను ఆమూలాగ్రంగా అవగాహనచేసుకొనిన పండితుడు. అందుచేత ప్రతివిషయం

నిర్భయంగా విమర్శించగలిగాడు. మహమ్మదీయభావప్రపంచంలో కల్లోలం కలిగించాడు. అంధకారావృతమైన ఇస్లామికమతప్రపంచంలో జ్ఞానతేజస్సు ప్రసరింపజేశాడు. దాస్యబంధురమైన తుర్కీరాజధానిలో అతనికి అట్టేకాలం స్థావరం కుదరలేదు. తుర్కీపాలకులకు అతని తేజః ప్రపంచం సహించరానిదయింది. అతడు కొద్దిలోనే తుర్కీ వదలిపోవలసి వచ్చింది. అక్కడనుంచి 1871 సం.రంలో కెయిరోపట్నం చేరి ఎల్ అజారువిద్యాలయంలో ప్రవేశించాడు. ఎనిమిదిసంవత్సరాలపాటు అక్కడ నివసించాడు. ఆ ఎనిమిదేళ్ళల్లోనూ అద్భుతమైన భావవికాసం కలిగించాడు. అభినవఈజిప్టును సృష్టించాడు. యువకులలో స్వాతంత్ర్య భావోన్మాదం కలిగించాడు. ఈజిప్టుప్రజాహృదయంలో నిర్భయత్వం పాదుకొలిపాడు. జీర్ణమైపోయి నశింపనున్న ఈజిప్టుజాతికి జీవంపోశాడు. ఒక్క ఈజిప్టునే కాదు, జమాలుద్దీను ఉత్తేజమొనరించినది. ఇస్లామిక ప్రపంచమందంతటా నూతనజవసత్త్వలు కలిగించాడు.అతని ఈజిప్టుసంవా వల్ల ఈజిప్టుజాతీయత ప్రజ్వరిల్లింది. అది పాశ్చాత్యులకు అసహ్యమైంది. 1879 సం.రంలో ఆర్థికరూపంగా అధికారం సంపాదించిన పాశ్చాత్య రాజనీతికోవిదులకు జమాలుద్దీనుపొడ గిట్టలేదు. అతను ఆ దేశంలో కాపురంచేయడం క్షేమం కాదన్నారు. పాలకుడైన టూఫికుచే వారి చేతులలో బొమ్మ. జమాలుద్దీనును దేశంలోంచి వెడలగొట్టించారు. ఆమూలంగా ఈజిప్టుజాతీయత అణిగిపోతుందని ఆశించారు.

ఈజిప్టుజాతీయత వికసించడానికి ఒకవిధంగా కారకులు పాశ్చాత్యులే. దేశంలో ప్రజాహితమైన కార్యాలు ఏవి తలపెట్టినా వారు అడ్డంపడి ప్రజలను రెచ్చకొట్టడం జాతీయతను ప్రోత్సహించింది. టూఫికుచే పరిపాలన ఆరంభించిన కొత్తలో ప్రజాస్వామికపద్ధతులు కొన్ని అవలంబించాలని చూచాడు. ప్రజాప్రతినిధుల సభ ఒకటి స్థాపించడానికి ప్రయత్నించాడు. కాని పాశ్చాత్యప్రభుత్వప్రతినిధులు అడ్డంపడ్డారు. శాసనసభే పనికిరాదన్నారు మొదట. చివరకు అది తప్పకపోయేసరికి దేశపు

ఆయవ్యయాలనుగురించి యోచించే హక్కు మాత్రం మినహాయించా లన్నారు. అదివరకే వారి అప్పుల తీరుమానంకోసం దేశాదాయంలో సగంవంతు వారికే తనఖాఉంది. ఆ మిగతాసగమూ మాచేతులలో ఉండడానికి మీకు అభ్యంతరం ఎందుకని ప్రజాప్రతినిధులు అన్నారు. మీకు తెలియదు; పనికిరాదు అన్నారు పాశ్చాత్యప్రతినిధులు. మా ఆజ్ఞ శిరసావహించకపోతారా మా ఆయుధబలం చూడగలరని అహంకార పూరితమైన ప్రకటన ఒకటి చేశారు. దానితో జాతీయభావం మరింత ప్రజ్వరిల్లింది. ప్రజాప్రతినిధులంతా ఏకమయారు. పాలకవంశంలోని తురుష్కులుకూడా జాతీయోద్యమాన్ని సమర్థించారు. అదివరలో ప్రధాన మంత్రిగా ఉన్న షరీపుబే తన కాఉద్యోగం అక్కరలేదని వదలుకొన్నాడు. జాతీయవాదులు మంత్రిపదవుల నాక్రమించారు. మహమ్మదుపాషాసామీ అనే ఆయన ప్రధానమంత్రి అయాడు. అరాబీపాషా యుద్ధమంత్రి. అరాబీ పేరు దేశమందంతటా మారుమోగింది. కాని ఇంగ్లీషువారి దృష్టిలో అతను పలుకుబడి ఏమాత్రమూలేని వట్టి ఆందోళకుడుగా కనపడ్డాడు. ఇంగ్లీషుపత్రికలూ, ప్రముఖులూ అతనిని ఆడిపోశారు. అతగానిని మంత్రివర్గంలోంచి వెడలగొట్టా లన్నారు. అవసరమైతే బలప్రయోగం చేయడానికి సందేహించకూడ దన్నారు. 1882 సం. మేనెలలో ఇంగ్లీషు ఫ్రెంచినౌకాదళాలు అలెగ్జాండ్రియారేవుదగ్గర ప్రత్యక్షమయాయి. మంత్రి వర్గాన్ని తొలగించవలసిందనీ, అరాబీపాషాను దేశంలోంచి వెడలగొట్ట వలసిందనీ ఖెడీవును (ఈజిప్టుపాలకుని) ఆజ్ఞాపించారు. మంత్రులు రాజీనామా ఇచ్చారు. కెయిరోపట్నంలో ప్రజలు తిరగబడ్డారు. అరాబీ పాషా యుద్ధమంత్రిగా ఉండితీరా లన్నారు. ఖెడీవుకు అలా చేయక తప్పిందికాదు. బలహీనుడైన ఖెడీవు తన నిస్సహాయతను గుర్తించి పూర్తిగా ఇంగ్లీషువారిలో చేరిపోయాడు. ఇంగ్లీషునౌకాదళాధికారి అలెగ్జాండ్రాపట్టణవాసులను ఆయుధాలు ముట్టరాదని ఆజ్ఞాపించాడు. తన ఆజ్ఞ తిరస్కరించారని జూలై 11-వ తేదీని పట్నంమీద ఫిరంగులు

పేల్చాడు. ఆలోగా దేశంలో ప్రజానాయకులు ప్రజాస్వామికపద్ధతులు కొన్ని ప్రవేశపెట్టారు. విద్యావ్యాపనకు విధానం ఒకటి ఆలోచించారు. ఇంగ్లీషువారి క్రూరచర్యలమూలంగా దేశమంతా అరాబీపాషానాయకత్వం క్రింద ఏకమైంది. జాతీయసైనికదళాలు ఏర్పడ్డాయి. ఎల్‌అజారు విద్యాలయంలోని మతాచార్యులు ఖెడీవు దేశద్రోహం చేయడంచేత పదభ్రష్టత పొందినట్టు ప్రకటించారు. దేశంలోని పదునాలుగుమంది గవర్నర్లలోనూ పదకొండుగురు అరాబీపాషానాయకత్వం అంగీకరించారు. కెయిరో పట్నంలో దేశరక్షణసంఘం ఒకటి ఏర్పడి, అరాబీని సర్వసేనాధిపతిగా నియమించింది.

అరాబీ రణనీతివిశారదుడు కాడు. యుద్ధసమయంలో సర్వసేనాధిపత్యం వహించడానికి సాహసం, చాకచక్యం మొదలైన గుణాలు అత్యావశ్యం. అరాబీలో లోపించిన గుణాలే అవి. సామాన్యంగా, చిరకాలం దాస్యబంధంలో కట్టుబడిన దేశాలలో ఎప్పుడు విప్లవం కలిగినా, చాకచక్యంతో సర్వాధిపత్యం వహించి నడిపించే నాయకుల లోపమే ఎక్కువ కనపడుతుంది. ఆరితేరిన ప్రభుత్వసేనలతో తలపడి జయించడానికి, విప్లవసైన్యాలలో, ఉత్సాహం తక్కువకాకపోయినా, నాయకత్వం లోపమవుతుంది. సకాలంలో సరియైన నాయకత్వం లభిస్తే, విప్లవం ఫలోన్ముఖమవుతుంది. లేకపోతే అణిచివేయబడడం తప్పదు. ఇంతేకాక చిరకాలదాస్యకారణంచేతనే, దేశంలో విభేదాలరూపంగా మరొక ప్రబలమైన ఆటంకంకూడా ఎప్పుడూ సిద్ధమవుతుంది. పారతంత్ర్య దేశాలలో, పరప్రభుత్వాన్ని ఆశ్రయించి అందలమెక్కగోరే పక్షం ఒకటి అవశ్యం వెలుస్తుంది. ధనరూపంగానూ, శుష్కవాగ్దానరూపంగానూ, అనేకవిధాలుగా ఆశలుచూపి, పరప్రభుత్వం ఈరకపు మనుష్యులను తన అండకుజేర్చుకొంటుంది. ఈ భేదోపాయనిపుణత బ్రిటిషు సామ్రాజ్యపాలకులకు ఉగ్గుపాలతో పెట్టినది.

అరాబీపాషా, తన దేశంలో నూతనంగా ప్రవేశించిన పాశ్చాత్య నిరంకుశపాలకులమీద కత్తికట్టాడేకాని, ఇస్లాము మతంమీదకాని, తుర్కీ

సుల్తానుమీదకాని కాదు. అయినా, అరాబీపాషాచర్యలను ఖండించవలసి వదిగా బ్రిటిషురాజకార్య ధురంధరులు తుర్కీసుల్తానును పురికొలిపారు. తనకూ, ఇస్లాముమతానికీ కూడా అరాబీపాషా విద్రోహం తలపెట్టాడని సుల్తాను ప్రకటించాడు. దానితో అరాబీసైన్యంలోని పెక్కుమంది తురుష్క సైనికుల ఉత్సాహం చల్లారింది. చివరకు 1882 సం. సెప్టెంబరు 13 వ తేదీని అరాబీపాషాసైన్యం టెలెల్‌కబీరు అనేచోట యుద్ధంలో పూర్తిగా ఓడిపోయింది. అరాబీపాషా శత్రువులచేత జిక్కాడు. అతను విద్రోహి అని సుల్తాను ప్రకటించాడు. ఉరితీయడానికి ఉత్సాహపడ్డాడు. కాని దూర దృష్టి గల బ్రిటిషువారు అతనిని తాము స్వాధీనంచేసుకొని సింహళ ద్వీపానికి ప్రవాసం పంపారు. 1911 సం॥లో ఆయన కాలంచేశాడు.

అరాబీ ఈజిప్టుదేశానికి జీవంపోశాడు. ఈజిప్టుజాతిని సృష్టి జేశాడు. అరాబీక్రితం ఈజిప్టు స్వతంత్రరాజ్యమైతే అయిఉండవచ్చుగాని, స్వతంత్రజాతి కాదు. తాను ఈజిప్టీయుడనని కనుగొనగల్గడమే అరాబీ యొక్క గొప్పతనమని అతని స్నేహితుడైన ఒక ఆంగ్లేయుడు వ్రాశాడు. అతడు లేవదీసిన విప్లవం అప్పట్లో విఫల మయితేమాత్ర మేమి? శుష్కించి పోయిన ఈజిప్టుదేశానికి అభినవజాతీయతతో జీవంపోశాడు. జాతీయ ఆదర్శాలు సఫలంకావాలంటే, దేశజీవితంలో తరతరాలనుంచీ కూడిన మాలిన్యం నశించాలి. విప్లవరూపకమైన త్యాగాగ్నిహోత్రంలో దేశ దౌర్బల్యానికి హేతువైన మాలిన్యం అంతా భస్మమైపోతుంది. త్యాగం వల్ల దేశానికి అంతకంతకు ఉత్తేజం కలుగుతుంది. అందుచేతనే, ఏ దేశంలోనైనాసరే, స్వాతంత్ర్యభావం ఒక్కసారి ఉదయించిన తరువాత, దానికి అడ్డంకులూ, అపజయాలూ కలిగినకొద్దీ, వృద్ధిపొందుతుంది. పర ప్రభుత్వం అణచడానికి ప్రయత్నించినకొద్దీ జాతీయత వర్ధిల్లుతుంది. నిజంగా, జాతీయత వృద్ధిపొందడానికి పరప్రభుత్వపు క్రూరనిర్బంధ చర్యలు ముఖ్యావసరమని చెప్పవచ్చు. ఆమూలంగాగాని జాతీయహృద యంలో స్వాతంత్ర్యదీక్ష ప్రబలంకాదు.

# 2

ఈజిప్టు స్వాతంత్ర్యసమరంలో మొదటి అంకం పైవిధంగా ముగిసింది. దేశం విప్లవకారుల స్వాధీనంలో ఉన్న కొద్దికాలంలోనూ దేశంలో నూతనతేజస్సు బయలువెడలింది. శాంతికి భంగం రాలేదు. ప్రజోపయోగకార్యాలు ప్రారంభమయాయి. అరాబీవల్ల దేశంలో అరాజకం ప్రబలిందనీ, శాంతిసౌఖ్యాలు మాయమయాయనీ ఆంగ్లేయులు యాగీచేశారు. అది కేవలం ఈజిప్టువ్యవహారంలో తాము జోక్యం కలుగజేసుకోడానికి సాకుకాని మరొకటి కాదు. నిజంగా, వారు జోక్యం కలుగజేసుకొన్న తరువాతనే అశాంతి బయలుదేరింది. ఇంతకూ అశాంతి ప్రబలితేమాత్ర మేమి? స్మశానవాటికలో శాశ్వతమైన శాంతే ఉంటుంది. కాని వాంఛనీయం కాదుగా అది! జీవరహితమైన ఆశాంతికంటె జీవ సృష్టికి మూలమైన అశాంతి నిశ్చయంగా అభిలషనీయమేను.

అరాబీపాషా అపాయం తొలగడంతోనే బ్రిటిషువారికి దేశంలో స్థావరం కుదిరిందని చెప్పవచ్చు. ఖెడీవుయొక్క క్షేమంకోసం ఈజిప్టు వ్యవహారంలో తాము జోక్యం కలుగజేసుకోవలసి వచ్చిందన్న బ్రిటిషువారు, అరాబీని దేశంనుంచి వెడలగొట్టినతరువాత, తమ పని పూర్తి అయిందని అట్టే నిష్క్రమించలేదు. వారికి ఆ ఉద్దేశం ఎప్పుడూ లేదు. వారు పడ్డ పాటులు ఖెడీవుక్షేమంకోసంకాదు, స్వీయక్షేమంకోసంకాని. వారి క్షేమానికి భంగకరమైన జాతీయోద్యమాన్ని అణిచివేయడంతోనే ముందుఎత్తులు వేయడం ఆరంభించారు. వాగ్రూపకంగా, ప్రకటనలలో ఆదర్శభావాలు వెల్లడించడం, ఆచరణలో అతిగర్హ్యమైన పద్ధతులు అవలంబించడం సామ్రాజ్యపాలకులకందరికీ సామాన్యగుణం. ఈజిప్టు ప్రజల క్షేమమూ, సౌఖ్యమూమాత్రమే తమ లక్ష్యమనీ, ఈజిప్టీయులు ప్రశాంతంగా వారి దేశంలో వారు రాజ్యంచేసుకోవడమే తమ అభిలాష అనీ బ్రిటిషువారు ప్రకటించారు. తమకు ఇబ్బందిలేనంతలో సంస్కారణలు కొన్ని ప్రసాదించారు. నామమాత్రమైన శాసనసభ ఒకటి సృష్టిం

చారు. అదివరలో, 1882 సం॥రంలో ఈజిప్టు జాతీయవాదులు తయారు చేసిన స్వరాజ్యవిధానం రద్దుచేసి, దానిస్థానే, తాము సృష్టించిన శాసన సభలో, హద్దులేకుండా మాట్లాడే హక్కుమాత్రం సభ్యులకు ప్రసాదించారు. ఖెడీవును తమ పిడికిట్లో పెట్టుకొన్నారు. నిరంకుశంగా పరిపాలన సాగించారు.

పైవిధంగా ఈజిప్టుదేశం తమ స్వాధీనం అయినవెంటనే బ్రిటిషు వారు సర్ ఎవెలినుబేరింగుగారిని తమ ప్రతినిధిగా నియమించారు. 1907 సం॥రం వరకూ ఈప్రభువు (లార్డు క్రోమరు) ఈజిప్టుదేశాన్ని పాలించాడు. యథావిధిగా ఈజిప్టీయ మంత్రివర్గం ఒకటి ప్రదర్శితమైంది. మంత్రులు చేయగలకార్యం ఒకటీ లేదు. ఒక్కొక్క మంత్రికి అంకుశంగా ఒక్కొక్క బ్రిటిషు ఉద్యోగిని సలహాదారను పేరుతో నియమించారు. నిజంగా మంత్రులు ఈ తెల్లఉద్యోగులేకాని ఈజిప్టీయులు కాదు. దేశంలో ప్రధానమైన ఉద్యోగాలన్నింటికీ బ్రిటిషువారిని నియమించారు. బ్రిటిషు ఉద్యోగులకూ, ఈజిప్టీయ ఉద్యోగులకూ గల పరస్పర సంబంధం ఎట్లాంటిదో, 1884 సం॥రంలో లార్డుగ్రెన్‌విలు అనే ఆయన వ్రాసిన కిందివాక్యాలవల్ల విశదమవుతుంది: "ఈజిప్టీయ మంత్రులకూ, రాష్ట్రాధికారులకూ ముఖ్యవిషయం ఒకటి నచ్చజెప్పాలి. ఈజిప్టుదేశపు బాధ్యత యావత్తూ బ్రిటిషువారు వహించవలసివచ్చిన కారణంచేత, ప్రస్తుతంలో బ్రిటిషుప్రభుత్వంవారు ఏవిధంగా చెపితే, ఆవిధంగా ఈజిప్టు ప్రభుత్వం చేయవలసిందేకాని, ఎదురుచెప్పడానికి వీలులేదు. అలా ఎదురు చెప్పే మంత్రులనూ, రాష్ట్రాధికారులనూ ఉద్యోగాలనుంచి తీసివేయవలసివస్తుంది."

బ్రిటిషువారి పరిపాలనలో దేశశాంతికి లోపంలేదు. వారి మాటకు ఎదురులేనంతవరకు శాంతికి భంగంరాదు. వారి క్షేమానికి భంగంలేనంత వరకు ప్రజాహితకార్యాలకు లోటులేదు. ఆరంభంలో ఆందోళన కొంత తగ్గడానికి హేతువు అది. పదిసంవత్సరాల కాలంపాటు ఈజిప్టులో జాతీయోద్యమం అడుగంటినట్టే కనపడింది.

టూఫికుపే చనిపోయిన తరువాత 1892 సం॥రంలో అతని కొడుకు రెండవ అబ్బాసు ఖెడీవు అయాడు. అతను బ్రిటిషువారి పట్టులోంచి వదిలించుకోడానికి కొంత ప్రయత్నంచేశాడు. కాని తేలికగా వదిలే పట్టు కాదు అది. ఆ ప్రయత్నంచేత ప్రజల గౌరవానికి పాత్రుడయాడు. జాతీయ వాదులు అతనికి అండగా నిలిచారు. ఆరోజులలో జాతీయవాదులకు ముస్తాఫా కెమాలు అనే యువకుడు నాయకు డయాడు.

ముస్తాఫా కెమాలు చిన్నతనంనుంచీ ఫ్రాన్సుదేశంలో విద్యాభ్యాసం చేసి పాశ్చాత్యజాతీయతత్వం గ్రహించాడు. ఈజిప్టు దేశస్వాతంత్ర్యమే జీవితలక్ష్యంగా చేసుకున్నాడు. అతని 19వ ఏట విద్యాభ్యాసకాలంలో, "ఉపన్యాసాలవల్ల, పాఠశాలలద్వారా, పత్రికలూ పుస్తకాలూ మూలంగా నా దేశస్థులలో గాఢమైన జాతీయభావం కలుగజేస్తాను" అన్నాడు. 1896 సం॥రంలో స్వదేశానికి తిరిగివచ్చాడు. ఆ సమయంలోనే బ్రిటిషు వారు ఈజిప్టురాజ్యంలోంచి విడిపోయిన సూడానురాష్ట్రాన్ని జయించాలని ప్రయత్నంచేస్తున్నారు. అదివరలో బ్రిటిషువారి బలవంతం మూలంగానే ఈజిప్టుపాలకులు సూడానును వదిలిపెట్టారు. కాని ఇప్పుడు సూడాను ప్రాముఖ్యతను బ్రిటిషు రాజనీతిజ్ఞులు గ్రహించారు. ఏదో సామెత చెప్పి నట్టు, తమకు కానీఖర్చులేకుండా, ఈజిప్టుదేశపు ఖర్చున, ఈజిప్టుదేశపు సైన్యసహాయంతో సూడానును జయించి, తమ హస్తగతం చేసుకోవాలని ఎత్తువేశారు. సూడాను జయించడానికిగాని, తరువాత సూడానువల్ల తాము లాభంపొందడం మరగినపిమ్మటగాని, బ్రిటిషువారు స్వయంగా కానీఖర్చు చేసిన పాపాన పోలేదు. ఈజిప్టుదేశపు ఆదాయం ఉందిగా, వారి అదు పాజ్ఞలలో! ఇతరుల డబ్బువిషయంలో విశేషవితరణం బ్రిటిషువారికి కొత్తకాదు. సూడానుకోసం ఖర్చయినది ఈజిప్టుడబ్బు, ప్రవహించినది ఈజిప్టురక్తం, స్వాధీనమయినది బ్రిటిషువారికి. సూడాను బ్రిటిషువారి హస్తగతమైతే, ఈజిప్టుకు ఒలికేది ఏమీ లేకపోగా, ఆయువుపట్టు బ్రిటిషు వారి గుప్పెట్లో పెట్టినట్టే. ఈజిప్టుకు జీవప్రదమైన నైలునదీజలం

సూడానులోంచి రావాలి. సూడానులో ప్రత్తి పుష్కలంగా పండుతుందని బ్రిటిషువారు గ్రహించారు. తమ బట్టలమరలకు సూడానుభూములు ప్రత్తి సాగు చేయాలని వారి అభిలాష. ఈజిప్టు దేశ క్షేమంతో ప్రమేయం వారి కేమిటి? సూడానులో వారి అవసరాలన్నీ తీరినతరువాత నైలులో నీరు ఏమైనా మిగిలితే అదీ ఈజిప్టుకి. ఈఎత్తు గ్రహించలేకపోలేదు ఈజిప్టు జాతీయవాదులు. 1896 సం॥రం ఏప్రిలు 13వ తేదీని అలెగ్జాండ్రాపట్నంలో తెల్లవారి సభలో మాటాడుతూ, ముస్తఫా కెమాలు ఈవిధంగా చెప్పాడు: "సూడాను జయించడం ముఖ్యమే మాకు. ఈజిప్టుకు అది ఆయువుపట్టు. ఈ రెండు దేశాలూ భిన్నప్రభుత్వాలకింద ఉండడం ఈజిప్టుకు ప్రాణాంతకం. ఈజిప్టుతో తాగడానికి నీళ్ళుకూడా దొరకవు సూడాను ఈజిప్టులు కలిసిఉండకపోతేను. సూడాను ఇదివరలో చిరకాలంనుంచీ ఈజిప్టుతోపాటే ఏకరాజ్యంలో ఉండేది. విధివశాత్తూ విడిపోయిన ఈ రాష్ట్రాన్ని మాలో కలుపుకోవడం మాకు ముఖ్యం. కాని ఈ కార్యం బ్రిటిషు ఆయుధ బలసహాయంచేత సాధించడం మే మెంతమాత్రమూ అభిలషించము. బ్రిటిషువారి దర్శనమయితే మాకూ, సూడాను ప్రజలకూ పొత్తుకుదరడం అసాధ్యం."

ముస్తఫా కెమాలు చిన్నవయసులోనే కాలంచేశాడు. కాని అతను దేశంలో జీవించిన పది పండ్రెండు సంవత్సరాల కాలంలోనూ దేశహితార్థం విరామం లేకుండా కృషిచేశాడు. ఈజిప్టీయ నవయౌవనులకు నాయకు డయాడు. ఈజిప్టుజాతీయతకు మార్గదర్శి అయాడు. విదేశాలలో ఈజిప్టుజాతీయ ఆదర్శాలనుగురించి ప్రచారం చేశాడు. నిరంతరంగా స్వాతంత్ర్య మంత్రం జపంచేశాడు. "స్వాతంత్ర్యం లేనప్పుడు సౌఖ్యాలూ, సౌకర్యాలూ ఎన్నిఉంటే ఏమిటి దేశంలో! టెలిగ్రాఫూ, టెలిఫోనూ, రైళ్ళూ, మోటార్లూ దేశంలో వ్యాపించాయన్న సంతోషమేమిటి? అడుగడుగునకూ పారతంత్ర్యపీడన తప్పనప్పుడు! ఈ సౌకర్యాలవలననే దాస్యబంధాలు బిగువవుతోన్నప్పుడు! దారీ తెన్నూ లేని మండుఎడారిలో

నైనా స్వాతంత్ర్యవాయువులను పీలుస్తూ, జీవితాంతంవరకూ కేవలం పాదచారిగా తిరుగులాడడమైనా ఉత్తమమే, బ్రిటిషుపాలితమైన దేశంలో దాస్యచిహ్నాలు ధరించి దర్పంగా రైళ్ళూ, మోటారులూ ఎక్కి తిరగడం కంటె" అని ఆక్రందించాడు. "మా జాతీయవిధానంలో ప్రథమవిషయం సర్వజనులకూ విద్య. మా ప్రజల విద్యావిహీనతే మా దేశదుస్థితికి హేతువు. బ్రిటిషువారి ఆటంకం ఎంత ఉన్నా లెక్కచేయకుండా దేశ సేవకులు జాతీయపాఠశాలలు పెట్టి ప్రజలలో విద్య వ్యాపింపజేస్తున్నారు. ఈసంవత్సరం పండ్రెండు విద్యాలయాలు పెట్టాము. కొద్దికాలంలోనే దేశమంతా విద్యాలయాలతో నింపివేస్తాము. బాలికల విద్య మేము మరచి పోలేదు. పురుషులతోపాటే మా స్త్రీలుకూడా జాతీయవాదులు. అనేకమంది స్త్రీలు పత్రికలు చదివి దేశవిషయాలు చర్చిస్తారు" అని సంతసించాడు. ముస్తఫాకెమాలు 1894 సం॥రంలో మొదటి జాతీయపాఠశాల స్థాపించాడు. జాతీయభావవ్యాపనకు పత్రిక ముఖ్యావసరమని గ్రహించి 1900 సం॥రంలో 'ఎల్ లేవా' అనే పత్రిక స్థాపించాడు. ఈపత్రిక ఈజిప్టుదేశమం దంతటా వ్యాపించింది.

బ్రిటిషుదాస్యం పోవాలంటే మహమ్మదీయరాజ్యాల సానుభూతి అవసరమని గ్రహించి ముస్తఫాకెమాలు అందుకు కృషిచేశాడు. చనిపోయే ముందు తన యావచ్ఛక్తీ విద్యావ్యాపనకు వినియోగించాడు. పాఠశాలలూ, ఉపన్యాసాలూ, పనిచేసుకొనేవారినిమిత్తం వారి తీరికకాలంలో సాయంతనపుబడులూ, బీదలకు అప్పుయివ్వడానికి నిధులూ-ఈ మొదలైన కార్యాలతో ముగిసింది అతని జీవితం. 1905 సం॥రంలో మహమ్మదాలీ పేర జాతీయవిశ్వవిద్యాలయం ఒకటి స్థాపించాలని ఉద్దేశించాడు. కాని బ్రిటిషువారి నిరోధంవల్ల సాగలేదు.

ముస్తఫాకెమాలు 1908 సం॥రం ఫిబ్రవరి 10వ తేదీని కాలం చేశాడు. యావత్తు ఈజిప్టుదేశం దుఃఖసముద్రంలో మునిగిపోయింది. ఈ దేశభక్తుని అంత్యక్రియల సందర్భంలో సమకూడినంతమంది జనం

కెయిరోపట్నంలో ఎన్నడూ సమకూడలేదని వ్రాశాడు కండ్లారా చూచిన ఒక ఆంగ్లేయుడు.

ఈసమయంలో ఈజిప్టులో ప్రబలిన జాతీయోద్యమం, అరాబీపాషా కాలంలోవలె కేవలం గ్రామవాసులలోంచి పుట్టినది కాదు. విద్యాధికులలో జనించినది. ప్రథమఉద్యమకాలంలో ఇతర దేశాలలోని జాతీయతతో సంపర్కం కలుగలేదు. అప్పట్లో ఈజిప్టుజాతీయత ప్రపంచదృష్టిని ఆకర్షించలేదు. కాని తరువాతి ఉద్యమంలో ప్రపంచంలోని ఇతర దేశాలతో సంబంధం కలిగింది. పాశ్చాత్య జాతీయభావాలు దేశమంతటా వ్యాపించాయి. ముఖ్యంగా పరాసువిప్లవాశయాలు అభివృద్ధిఅయే ఈజిప్టు జాతీయతకు ప్రోత్సాహకర మయాయి. విద్యావ్యాపనమూలంగా జాతీయోద్యమం దేశమంతటా వ్యాపించింది. కాని ఇంకా విప్లవరూపం తాల్చలేదు. బ్రిటిషువారు మరికొంతకాలం ఈజిపుజాతీయతను ఆయుధబలంతో అణిచిపెట్టగలిగారు. కాని ఒక్కసారి ప్రజ్వరిల్లిన జాతీయతాగ్నికి పరప్రభుత్వక్రూరనిర్బంధం ప్రచండవాయుతుల్యమై మరింత ప్రజ్వరిల్లడానికి హేతువవుతుంది. పరప్రభుత్వపీడనవల్ల వర్ధిల్లని జాతీయోద్యమం ఇంతవరకూ ప్రపంచచరిత్రలో ఎక్కడా కనపడదు. నిర్బంధతీవ్రతచేత కొంతకాలం అణిగినట్టు కనబడినప్పటికీ, తిరిగి పదింతల పటుత్వంతో ప్రత్యక్షమవుతుంది. ఈ ఉద్యమం విద్యాధిక, జనసామాన్య భేదంలేకుండా సర్వత్రా వ్యాపించింది. దేశస్వాతంత్ర్యం ఎప్పుడైనా స్వయంకృషి మీద ఆధారపడి ఉంటుంది కాని దయాధర్మబిచ్చంగా ప్రసాదింపబడదు. ఏదేశం పరపరిపాలనా విధానంలోంచి విడివడినా, పరప్రభుత్వానికి దేశంలో నిలవనీడలేకుండా పోవడంవల్లనే కాని దాని ఔదార్య సహకారాలవల్ల కాదు. స్వాతంత్ర్యసిద్ధికి దేశంలో త్యాగాగ్ని ప్రజ్వలించాలి. ఈజిప్టు స్వాతంత్ర్యసమరం ఆవిధంగా పరిణమించింది ఈదశలో. సమరంలో దేశమంతా పాల్గొంది.కాని పరప్రభుత్వంతోడి సహకారంతో స్వాతంత్ర్యం సంపాదించవచ్చుననే సక్రమాందోళనపక్షం ఒకటి దేశంలో లేకపోలేదు. ప్రతిదేశంలోనూ ఉంటుంది ఈ పక్షం.

ఈపక్షంవారు వారికి చేతనైన కృషి అంతా చేశారు స్వాతంత్ర్యం కోసం. ఎన్నిసార్లు విఫలులైనా వీరు నిరాశచెందరు. 1906 సం॥రలో బ్రిటిషుయువరాజు ఈజిప్టుదేశానికి వేంచేశాడు. దేశానికి స్వాతంత్ర్య ప్రదానం చేయవలసిందని సక్రమాందోళకులు అతన్ని వేడుకొన్నారు. ఏలినవారి ఘనతను కొనియాడారు. వారి ఔదార్యాన్ని ప్రశంసించారు. ఈజిప్టుదేశాన్ని పారతంత్ర్యంలో బంధించిఉంచడం బ్రిటిషువారి స్వాతంత్ర్య సంప్రదాయానికి విరుద్ధమన్నారు. తిరుగబడి యుద్ధంచేసిన దక్షిణాఫ్రికాకు స్వరాజ్యం ప్రసాదించడం బ్రిటిషు ఔదార్యానికి ప్రమాణమని పలికారు. తిరుగబడిన దక్షిణాఫ్రికాకే ఇచ్చినప్పుడు చేతులుకట్టుకొని జోహారుచేసిన ఈజిప్టుకు ఇవ్వకతప్పదని నొక్కిచెప్పారు. ఇంగ్లాండు దేశంలో కన్సర్వేటివు ప్రభుత్వము పోయి, లిబరలు పక్షంవారి ప్రభుత్వం వచ్చిందని సంతోషించారు. తప్పకుండా ఈజిప్టు దేశానికి స్వాతంత్ర్యం లభిస్తుందని ఆశపడ్డారు. కాని ఈ ఆశలకు తావులేదని బ్రిటిషుచరిత్ర తెలిసినవారికందరికీ స్పష్టమవుతుంది. 'ఎన్సైక్లోపీడియా బ్రిటానికా' అనే ఆంగ్ల విజ్ఞాన సర్వస్వ గ్రంథంలో ఈలా వ్రాశారు ఈ విషయాన్ని గురించి: "బాధ్యతగల రాజనీతిజ్ఞులకు సంబంధించినంతవరకు, బ్రిటను దేశంలో ఏప్రభుత్వం ఏలా మారినా, ఈజిప్టు దేశవ్యవహారంలో మట్టుకు ఏవిధమైన మారుపూ కలుగదు." ఇది లిబరలు పక్షం విషయంలోనే కాదు, లేబరుపక్షం విషయంలోకూడా అంతే జరిగింది. ఇది ఈజిప్టు దేశ సందర్భంలోనే కాదు, ఇండియా సందర్భంలోనూను.

సామాన్యంగా స్వాతంత్ర్య సమరకాలంలో ఉన్నతాశయమైన నిష్కలంక జాతీయతే ప్రజలకు మతం అవుతుంది. శుష్కనియమావృతమై, జీవరహితమైన మామూలుమతంకూడా, జాతీయ వికాసంవల్ల సజీవ మవుతుంది. అప్పుడు మతంకూడా జాతీయతాభివృద్ధికి తోడ్పడుతుంది. ఈజిప్టులో ఈవిధంగా మతసంస్కరణానికికూడా ప్రయత్నం జరిగింది. దీనికి మూలపురుషుడు జమాలుద్దీను ఆఫ్గానీ శిష్యుడైన మహ

మ్మదు అబ్దూ. అతడు లార్డుక్రోమరువంటి ప్రత్యర్థులచేతకూడా వినుతి గన్న పురుషుడు. మహమ్మదు అబ్దూ రష్యాదేశస్థుడైన టాల్‌స్టాయి మహాశయునికి సమకాలికుడు. ఆతని ఆదర్శాలే తనకూ ఆదర్శాలని వివరించాడు.

కొద్దిమంది విదేశీయులు కేవలం ఆయుధబలంవల్ల దేశప్రజలలో భయం కల్పించి నిరంకుశంగా పరిపాలించే సందర్భంలో, ప్రజలలో జాతీయభావం ప్రబలం కానంతవరకే ఆలా అధికారం చలాయించ గలరు కాని, ప్రజలు నిర్భయులై, స్వల్పసంఖ్యాకులైన పరదేశీయుల బలప్రతిష్ఠలు యథార్థంగా తమ భయంమీదనే ఆధారపడి ఉన్నాయని గ్రహించిన తరు వాత, ఒక్క ఘడియైనా అధికారం చలాయించలేరు. పారతంత్ర్యం అనుభవించే ప్రజలలో ఈవిధమైన మానసిక పరివర్తన కలగడమే స్వరాజ్యసిద్ధికి మూలసూత్రం. ఈ పరివర్తనకు అనేక కారణాలు సహాయ భూత మవుతాయి. జాతీయోద్యమం ప్రబలమైనకొద్దీ పరప్రభుత్వపు నిజ రూపం బయల్పడుతుంది. ప్రభుత్వమంటే ప్రజల కుండే వ్యామోహం నశిస్తుంది. ప్రజలలో ప్రభుత్వానికి పరువులేకుండా పోతుంది.

## 3

ఈజిప్టుదేశంలో జాతీయభావోద్రేకం ప్రబలంకావడానికి 1906 స॥రంలో బ్రిటిషువారి అహంకారపూరితమైన చర్య ఒకటి కారణభూత మయింది. జూన్ 13 వ తేదీని డెల్టాభూములలోని 'దిన్షావీ' అనే గ్రామందగ్గర కొందరు బ్రిటిషు అధికారులు పావురాలను వేటాడడానికి దయచేశారు. పావురాలను చంపడం గ్రామస్థులకు అసహ్యాకరమైంది. చంపవద్దని అధికారులతో మనవిచేశారు. కాని వారికి భయమేమిటి? విన లేదు. పావురాలను చంపడం ఆత్రతలో వా రొక స్త్రీని గాయపరచి, ఒక రైతు ఇంటికి చిచ్చుపెట్టారు. దానితో ప్రజలలో ఉద్రేకం కలిగింది. మాటా మాటా పెరిగి చెయ్యీ చెయ్యీవరకు వచ్చింది. ముగ్గురు అధి

కారులకు దెబ్బలు తగిలాయి. దెబ్బతిన్న ఉద్యోగులలో ఒకడు సైనిక సహాయంకోసం సమీపంలో ఉన్న స్టేషనుదగ్గరకు పరుగుతీశాడు. మండు టెండలో, ఎండదెబ్బ తగిలి సగందారిలో మరణించాడు. అతని చావు దెబ్బలవల్లనే అని చెప్పడానికి సావకాశంలేదు. కాని బ్రిటిషువారికి అదను దొరికింది. జాతీయభావం దేశంలో విజృంభించడం వారికి కంటకంగాఉంది. అది పల్లెటూళ్ళలోకి కూడా వ్యాపించడం చూచి క్రోధోద్దీపితు లయారు. ఈజిప్టుదేశస్థులు - అందులో పల్లెటూరి ప్రజలు తెల్లఉద్యోగుల ఎదురుగా నిలబడి, జంకులేకుండా ప్రసంగించడమూ, సాహసంగా అధికారులన్న అదుపు ఏమీ లేకుండా చేయీచేయీ కలపడమూ ఈవరుస అంతా వారికి విప్లవ చిహ్నంగా కనపడింది. బ్రిటిషువారి బలమంటే ఏమిటో దేశస్థులకు బోధపడితేనేగాని వారిలో అదరిపాటు అంతంకాదని నిశ్చయించారు. ప్రజలకు బుద్ధిచెప్పాలని ఆత్రతపడ్డారు. యథావిధిగా చేయవలసిన కార్యక్రమం అంతా కొనసాగించారు. న్యాయబద్ధులుగా మరి వారు! వెంటనే విచారణ సంఘం ఒకటి వెలిసింది. గంటలమీద విచారణ జరిగింది. విచారణ సంఘంలో ముగ్గురు ఇంగ్లీషువారూ, వారికితోడు జోహారుచేసే ఇద్దరు ఈజిప్టీయులూను. సంఘంవారు న్యాయమంతా ఆలోచించి తీర్పు చెప్పారు. అంతకుముందే తీర్పు ఆమోదించి ఉంటాడు బ్రిటిషు ప్రతినిధి లార్డుక్రోమరు. చేయబోయే తీరుపు ముందుగానే ఆమోదించి ఆ ప్రభువు ఇంగ్లాండుకు ప్రయాణమయాడు. జూ॥ 19 వ తేదీని విచారణ సంఘం 15 మందిని శిక్షించారు. నలుగురికి ఉరిశిక్ష; ఇద్దరికి ఆజన్మాంత కఠిన నరకం; ముగ్గురికి ఒక్కొక్క సంవత్సరం ఖయిదూ, ఏభయ్యేసి కొరడా దెబ్బలూ, మరినలుగురికి ఏభయ్యేసి కొరడాదెబ్బలూను. కొరడాదెబ్బలూ, ఉరిదీయడం గ్రామంలోనే, ఉద్యోగస్థులతో కలహం జరిగినచోట, బహిరంగంగా, ప్రజలందరినీ చూడడానికి పిలిపించి, సైనిక బలప్రదర్శనంతో అట్టహాసంగా జరిగించారు. తమ అసామాన్య బలం చూపించి ప్రజలను గడగడలాడించాలని అంత యత్నం చేశారు. కాని ఈ దుండగంవల్ల ప్రజలలో మరింత ఉద్రేకం ప్రబలింది.

ఆ మరుసంవత్సరమే, చిరకాలంనుంచీ ఈజిప్టులో అధికారం చలాయించిన క్రోమరుప్రభువుఉద్యోగం అంతమైంది. నిరంకుశ పరిపాలనకు అలవాటుపడిన ఆ ప్రభువుకు ఈజిప్టు జాతీయత అర్థంకాలేదు. జాతీయవాదు లనేవాళ్లు కేవలం తుంటరులనీ, వారికి దేశంలో నిజంగా పలుకుబడి లేదనీ, బ్రిటిషు పరిపాలన అంటే ప్రజలకు పట్టరాని ప్రేమ అనీ తలిచేవాడు. ఆవిధంగానే ఇంగ్లండులోని అధికారులకు నచ్చ జెప్పాడు. కాని పాలుతాగే పిల్లిసామెత అయింది అతని పని. అధికారాంధతచేత నిరంకుశపాలకులకు దేశహృదయంలో ప్రజ్వలించే స్వాతంత్ర్య జ్వాల గోచరించదు. జాతీయోద్యమం వట్టి బూటకమని క్రోమరు వ్యాఖ్యానంచేసిన సమయంలోనే బ్రిటిషువారిచే సృష్టింపబడిన ఈజిప్టు శాసన సభలో, స్వరాజ్యం స్థాపించాలనీ, దాస్యచిహ్నాలైన శాసనాలన్నీ రద్దుచేయాలనీ, ఉరికొయ్యమీద చావకుండా మిగిలిన దిన్షావీ ఖయిదీలను విడుదలచేయాలనీ, ఉన్నతోద్యోగాలన్నీ ఈజిప్టీయులవశం చేయాలనీ ఈ మొదలైన తీర్మానాలు చేశారు.

1907 సం॥రం జనాభాలో ఈజిప్టుదేశంలోని 56, 16, 640 మహమ్మదీయ పురుషులలోనూ చదువనూ వ్రాయనూ నేర్చినవారు 402, 090 మంది. 55, 73, 333 స్త్రీలలోనూ చదువనేర్చినవారు 10,579 మంది. క్రైస్తవులయిన కోప్టులలో ఇంతకంటే కొంచెం నయం. 3,56,797 మంది పురుషులలోనూ 67,256 మందీ, 3,49,525 మంది స్త్రీలలోనూ 5,765 మందీ చదువనేర్చినవారు.

క్రోమరుప్రభువు పరిపాలన ప్రారంభంలో ముఖ్యమయిన పెద్ద పెద్ద ఉద్యోగాలుమాత్రమే తెల్లవారి వశమయి ఉండేవి. కాని ఇతని పరిపాలన సాగినకొద్దీ అట్టఅడుగు ఉద్యోగాలు తప్ప మిగిలిన ఉద్యోగాలన్నింటికీ తెల్లవారిని నియమించాడు.

క్రోమరుప్రభువు తరువాత, బ్రిటిషు ప్రతినిధిగా సర్ ఎల్డను గోర్స్టు వేంచేశాడు. అతను అడుగుపెట్టడంతోనే సంక్రమాందోళన పెద్ద

లంతా వారి కష్టనిష్ఠురాలు మనవిచేసుకొన్నారు. యోచిస్తా నన్నాడు, బ్రిటిష ప్రతినిధి. కండ్లనీళ్ళు తుడవడంకోసం ఏవేవో సంస్కరణాలు ప్రసాదించాడు. ఏ పక్షంవారికీ అవి అంగీకారం కాలేదు. దానితో నూతన బ్రిటిషప్రతినిధి క్రోమరు పద్ధతులనే అమలులోనికి తెచ్చాడు. తనకు జోహారు చేసే ప్రధాన మంత్రికోసం వెతికాడు. అదివరలో దిన్షావీ విచారణ సంఘంలో బ్రిటిషవారిచే నియమితుడైన ఈజిప్టీయుడు దొరి కాడు. అతని పేరు బుట్రాసుపాషా. కోప్టుజాతి క్రైస్తవుడు. బ్రిటిష వారికి జోహారుచేయడం మూలంగానూ, దిన్షావీ విచారణ మూలంగానూ దేశంలో ఇతని పేరు అసహ్యకరమైంది. 1909 సం॥రంలో తీవ్రనిర్బంధ విధానం అమలులోనికి వచ్చింది. పత్రికాస్వాతంత్ర్యం అంతరింపజేశారు. జాతీయ పత్రికలన్నీ నిలిపివేశారు. జాతీయవాదులను అపాయకరమయిన మనుష్యులుగా లెక్కకట్టి పోలీసు జాగ్రతలో ఉంచారు. కొందరిని దేశాం తరం వెడలగొట్టారు. తదనంతరం 1910 సం॥రం ఫిబ్రవరి 20 తేదీని ఇబ్రహీం బర్దానీ అనే విద్యార్థి ప్రధానమంత్రి అయిన బుట్రాసుపాషాను హత్యచేశాడు.

1911 సం॥రంలో లార్డు కిచనరు బ్రిటిష ప్రతినిధిగా దయచేశాడు. అనేక యుద్ధాలలో ఆరితేరిన యోధు ఆయన. ఈజిప్టుజాతీయతను అణచి వేశాననే సంతసించాడు. దేశమందంతటా శాంతి సమకూరినట్టే తోచింది. ఇంగ్లీషుపత్రికల వ్యాఖ్యలలోనూ, ఇంగ్లిష ప్రముఖుల సంభాషణలలోనూ ఈజిప్టుకు ప్రాధాన్యత తగ్గింది. ఈజిప్టులో సర్వం భద్రంగా ఉందనే భావం వ్యాపింపజేశారు. ఆసమయంలో మహమ్మదు సయ్యదు పాషా అనే అతను ప్రధానమంత్రిగా ఉన్నాడు. అతనితోపాటు 1912 సం॥రం వరకూ సాద్ జగ్లూలు పాషా అనే సుప్రసిద్ధ జాతీయవాది న్యాయశాఖ మంత్రిగా పనిచేశాడు. 1913 సం॥రంలో ప్రభుత్వవిధానంలో కొంత మార్పు చేశారు. కేంద్రశాసనసభ ఒకటి సృష్టించారు. యథాప్రకారం ప్రజాప్రతినిధులకు ఉపన్యాసపు హక్కులు సర్వమూ ప్రసాదించారు. సభా

ధ్యక్షుణ్ణి ప్రభుత్వంవారే నియమించడం. ఉపాధ్యక్షునిమాత్రం ఎన్నుకో వచ్చు నన్నారు. ఈపదవికి ఏకగ్రీవంగా జగ్లూలుపాషాను ఎన్ను కొన్నారు. 1914 లో యూరపుయుద్ధం ఆరంభమయేవరకూ ఈ శాసన సభ జీవించింది. ఉన్న పదినాళ్ళలోనూ బ్రిటిషుప్రభుత్వానికి సంతత ప్రతి ఘటనమే. ఖెడీవుకూడా అసెంబ్లీ పక్షమే వహించాడు.

ఈకాలంలో ఈజిప్టు జాతీయవాదులకు యూరపులోని స్వతంత్ర దేశాలు మార్గదర్శకమయాయి. జాతీయవాదులలో స్వాతంత్ర్యేచ్ఛ ప్రబల మయింది. 1896 లోనే ముస్తఫాకెమాలు ఈవిధంగా వ్రాశాడు: "స్వాతంత్ర్య మనేది మానవునికి పరమ పవిత్రమైన జన్మస్వత్వమనీ, ఏ విధమైనదైనాసరే దాస్యము పరమనీచమనీ, దేశప్రేమకంటే ఉత్కృష్ట మైన ప్రేమ లేదనీ స్వతంత్రరహితమైన దేశం అంతరించిపోవడం అత్యుత్తమమనీ ప్రతి ఈజిప్టీయుని హృదయంలోనూ గాఢంగా నాటుకో వాలి. అప్పుడుకాని ఈజిప్టుసభ్యత సుస్థిరం కాజాలదు. దేశానికి ఔన్న త్యం, ప్రతిష్ఠా, గౌరవం కలుగజేసే దివ్యౌషధం దేశభక్తి. నాగరక ప్రజల రక్తనాళాల్లో ప్రవహించేది దేశభక్తి. సకలజీవులకూ జీవపోషకం దేశభక్తి." ఈజిప్టుజాతీయ కాంగ్రెసు కార్యదర్శి అయిన హమీదుఎల్అలైలీ బ్రిసెల్సులో జరిగిన సమావేశంలోమాటాడుతూ ఈవిధంగా చెప్పాడు:"మా దేశస్వాతంత్ర్య విషయం కేవలం రాజకీయంకాదు. ఆధ్యాత్మిక నైతిక విషయం. పారతంత్ర్యంవల్ల జాతి నైతికంగా, ఆధ్యాత్మికంగా నిస్సారమై పోవడం దుర్భరవిషయం. పత్తి పంటలూ, వడ్డీ పెట్టుబడులూ కాదు నష్ట మవుతాయని లెక్కపెట్ట వలసినది, దైవాంశసంభూతులైన మానవులు, పవిత్రమూర్తులైన శిశువులు—వీరి నాశనం, లెక్కకట్టవలసింది. దేశానికి కలిగిన ఆర్థికనష్టాలమాట నేను అంతగా చెప్పను.పారతంత్ర్యంవల్ల కలిగిన నైతిక పతనం అతివిషాదకరమైన విషయం.మానవునిలోని దివ్యత్వం అంతా నశింపజేసింది. ఆత్మోన్నతికి ప్రతిబంధక మయింది. పారతంత్ర్యంలో జాతి జీవితం సహజంగా పరిణామంచెందదు. కృత్రిమజీవితం అలవాటై కొద్ది

లోనే జాతి అంతరించిపోతుంది." ఈవిధమైన భావోద్రేకంతో ప్రభవించిన ఈజిప్టుజాతీయత సర్వవ్యాపకం కాకుండా ఉండదు. యూరపు సంగ్రామంవల్ల కలిగిన సంచలనంలో ఈజిప్టులో జాతీయసంచలనం సర్వవ్యాపక మైంది. ఆ యుద్ధం ఆరంభమైనవెంటనే బ్రిటిషు అధికారులు లెజిస్లేటీవు అసెంబ్లీని రద్దుచేశారు. దేశంలో సభలూ, ఉపన్యాసాలూ నిషేధించారు. దేశమందంతటా సైనికశాసనం ప్రవేశపెట్టారు. ఈజిప్టు దేశం బ్రిటిషు అధికారానికి లోబడిన 'రక్షితదేశం' అని ప్రకటించారు. ఆ సమయంలో తుర్కీ రాజధానిలో ఉన్న అప్పటి ఖెడీవును పదభ్రష్టుని చేసి అతని పినతండ్రి అయిన హుసేనును 'సుల్తాను' అని నూతన నామకరణం చేసి పీఠంమీద కూర్చుండబెట్టారు. ఆస్ట్రేలియానుంచీ, ఇండియానుంచీ సైన్యాలను తెచ్చి దేశంలో కాపలావేశారు. జనసామాన్యాన్ని బలవంతపెట్టి యుద్ధరంగంలో కీడ్చారు. పేరూ, ఊరూ లేని పారతంత్ర్య ప్రజలను యుద్ధభూమిలో మట్టుకు గౌరవంగా చూచేవా రెవరు? తదను సారంగానే పరిగణించారు ఈజిప్టీయులను. యుద్ధం నిమిత్తం అనేక విధాలుగా డబ్బువసూలుకు బయలుదేరి ప్రజలను పీడించారు. ఆవిధంగా దేశమంతటా పారతంత్ర్యపీడ ప్రకటితమైంది. స్వాతంత్ర్యేచ్ఛ దేశస్థులందరిలోనూ ప్రబలమయింది. దేశంలో విభేదాలు అంతరించాయి. జాతీయోత్సాహంతో ఊగులాడింది దేశం. కాని ఈ సంచలన మేమీ బ్రిటిషువారు పాటించలేదు. తాము చేస్తూఉన్న యుద్ధం ఇకముందు యుద్ధాలు లేకుండా చేయడానికనీ, ప్రపంచంలో ప్రతిదేశానికీ స్వరాజ్యపుహక్కును స్థిరపరచడానికనీ, ప్రజాస్వామికత్వానికి ప్రపంచంలో ఎక్కడా భంగంకలగకుండా చేయడానికనీ ఈ మొదలుగాగల ఉన్నతాశయాలు బ్రిటిషువారూ, వారి మిత్రులూ సహస్రముఖాల ప్రకటించారు. అయితే ఈ భూమిమీద ప్రజలకు ప్రశాంతజీవనం లేకుండాపోయి కలహాలూ కక్షలూ, అసూయలూ, ద్వేషాలూ ప్రబలి మిక్కుటమైన అశాంతికి కారణమైన పరిస్థితులు ఎక్కడున్నాయంటే అవి బ్రిటిషు సామ్రాజ్యంలోనే.

బ్రిటిషువారినీ, వారి మిత్రమండలినీ జర్మనీతో యుద్ధానికి పురికొల్పిన ఉన్నతాశయాలు ప్రపంచానికంతటికీ శాంతి సమకూర్చేటట్టే కనపడ్డాయి. బ్రిటిషుసామ్రాజ్యాంతస్థితమైన పారతంత్ర్య కళంకం అంతటితో మాసిపోతుందని తోచింది. పారతంత్ర్యం అనుభవించే దేశాలలోని సక్రమాందోళకులందరూ తమ దేశాల కష్టాలు గట్టెక్కుతాయని ఆశించారు. అప్పట్లో ఈజిప్టు ప్రధానమంత్రి అయిన హుస్సేను రుష్దీపాషా యుద్ధము ముగిసిన తరువాత ఈజిప్టుదేశానికి స్వరాజ్యం ప్రసాదించవలసిందని ప్రార్థించాడు. వెంటనే బ్రిటిషువారు 1918లో యుద్ధము ముగియనున్నప్పుడు, బ్రిటిషు ఈజిప్టీయ సంఘ మొకటి నియమించారు. ఆ సంఘంలో జాతీయవాదియైన జగ్లూలుపాషాను ఒక సభ్యునిగా నియమించవలసిందని ఈజిప్టు ప్రధానమంత్రి కోరాడు. కాని బ్రిటిషువారికి అతని పొడ కిట్టలేదు. ఈజిప్టు న్యాయశాఖామంత్రికి సలహాదారుగా నున్న బ్రిటిషుఉద్యోగి సర్ విలియం బ్రోనైట్టు సంఘంలో ఒక సభ్యుడు. ఆయన ఈజిప్టుదేశానికి ప్రభుత్వవిధానం ఒకటి తయారుచేశాడు. ఆ నివేదిక ఏవిధంగానో ముందుగానే అందరికీ వెల్లడిఅయింది. దానితో ఈజిప్టుకు ప్రసాదింపబోయే స్వరాజ్యపు సత్తా సర్వత్రా తెలిసిపోయింది. దీనికీ, బ్రిటిషువారు యుద్ధకాలంలో ప్రకటించిన ఉన్నతాశయాలకూ ఏకోశాన్నీ పోలికలేదు.

ఈజిప్టుదేశంలో కొంతకాలంనుంచి జాతీయోద్యమం అణిగి ఉండటం బ్రిటిషు ఉద్యోగులకూ, బ్రిటిషుమంత్రివర్గాలకూ భ్రమ కలిగించింది. ఈజిప్టుదేశం తమ పరిపాలనా సౌఖ్యానికి సంతృప్తిచెందిందని భావించారు. మసిబూసిన మారేడుకాయవలె ఒక స్వరాజ్యవిధానం తయారుచేశారు. 1917 లో సుల్తాను హుస్సేను చనిపోయాడు. అతని స్థానే పూర్వపు ఖేడీవు ఇస్మయిలుకుమారుడు ఫౌద్ అనే అతనిని సుల్తానుగా చేశారు. ఈ సుల్తాను నిరంకుశతత్వవాది. ప్రజలలో గౌరవప్రపత్తులేమాత్రమూ లేవు. దేశంసంగతి అవసరంలే దతనికి. అవసరమైతే బ్రిటిషువారి పక్షంలో చేరడానికి సందేహించడు.

ఈ పరిస్థితులలో 1918 సం॥రం నవంబరు 13వ తేదీని జగ్లూలుపాషా బ్రిటిషు ప్రతినిధి అయిన సర్ రెజినాల్డు వింగేటుగారిని కలుసుకున్నాడు. ఈజిప్టీయుల హక్కులను ఇంగ్లాండు ప్రజలకూ, ప్రభుత్వానికీ తెలియ జేయడంకోసం తాను మరికొందరు మిత్రులతో కలిసి ఇంగ్లండుకు ప్రయాణం కానున్నట్లు తెలియజేశాడు. ఈ రాయబారం సందర్భంలో జగ్లూలు, అతని అనుచరులూ ఈజిప్టుదేశపు ప్రతినిధులని సమ్మతిస్తూ దేశంలో వేలకొద్దీ ప్రజలు ప్రతిచోటా సమావేశాలు చేసి సంతకాలుచేశారు. లెజిస్లేటివు అసెంబ్లీ సభ్యులందరూ ఈప్రాతినిధ్యం ఆమోదించారు. ఈజిప్టీయ ఉద్యోగులూ, తదితరులూకూడా జగ్లూలుపాషా ప్రాతినిధ్యంలో పరిపూర్ణవిశ్వాసం ప్రకటించారు. ఈ సంతకాలూ హడావిడీ బ్రిటిషువారిని కలవరపెట్టింది. వెంటనే నిషేధించారు. విశ్వాసపత్రాలను స్వాధీనం చేసుకున్నారు. అప్పుడు ఇంగ్లీషువారితో బహూసయోధ్యగా పనిచేసిన ప్రధాన మంత్రి రుష్దీపాషా తననూ, తనతోపాటు విద్యామంత్రిగా ఉన్న అద్లీ ఎఘెకాపాషానూ ఇంగ్లండుదేశానికి వెళ్ళనివ్వవలసిందని అడిగాడు. కాని వారిని వెళ్ళనివ్వలేదు. అందుచేత ప్రధానమంత్రి డిశంబరు 23 వ తేదీని ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. ఈలోగా బ్రిటిషు ప్రతినిధివద్దనుంచి జగ్లూలుపాషాకు సమాధానం వచ్చింది. ఈజిప్టు ప్రభుత్వవిషయం ఏది చెప్పదలచినా బ్రిటిషువారి ఉద్దేశాలకు విరుద్ధంగాలేకుండా వ్రాతమూలంగా సక్రమమైన మార్గంలో, అంటే బ్రిటిషుప్రతినిధిగారి సముఖమునకు పంపుకోవలసిందేకాని మరొకవిధం లేదని తెలుసుకోవలసిందిగా వ్రాశాడు. డిశంబరు 3 వ తేదీని జగ్లూలు ప్రత్యుత్తరం పంపాడు. "నేనూ, నా మిత్రులూ స్వీయాభిప్రాయాలు చెప్పుకోవడం మా ఉద్దేశంకాదు. సర్వజనాంగీకారంమీద ఈజిప్టుదేశ ప్రాతినిధ్యం వహించి ఈజిప్టుప్రజల స్వతస్సిద్ధమైన హక్కులను స్వాతంత్ర్యప్రియులని పేరువడసిన బ్రిటిషు ప్రజలకు తెలియజేయాలి. మమ్మల్ని ఇంగ్లండుదేశం వెళ్ళనీయకపోవడం బ్రిటిషువారు నిరంతరం ప్రకటనలలో వెల్లడించే స్వాతంత్ర్యాశయాలకు

కేవలం విరుద్ధం." కాని ఇది తెలియకనా బ్రిటిషు అధికారులు జగ్లూలు ప్రభృతులను ఈజిప్టు దాటనివ్వలేదు. రుష్దీపాషాకు మాత్రము 'వస్తే నీవు తరువాత రావచ్చునులే' అని కబురుచేశారు. రుష్దీ దేశగౌరవంమాట కొంత ఆలోచించి జగ్లూలును రానీయనంతవరకు తానూ రానన్నాడు. ప్రజాభిప్రాయమంతా జగ్లూలుపాషా పక్షమే.

1919 సంవత్సరం జనవరిలో లెజిస్లేటివ్ ఎసెంబ్లీ సభ్యుడైన హామీద్‌పాషా ఎల్‌బసాల్ అనే ప్రసిద్ధజమీందారుగారి ఆధిపత్యంక్రింద ఒక విందు జరిగింది. ఆ సందర్భంలో జగ్లూలుపాషా ఈజిప్టుదేశపూర్ణ స్వరాజ్య కార్యక్రమం వివరించాడు. సుల్తానుతో సంభాషిద్దామని చూచాడు కాని సుల్తాను ఒప్పుకోలేదు. ఈజిప్టుదేశంలో బ్రిటిషువారి రక్షణ అధికారం అంతటితో అంతరించిందని మార్చి 3 వ తేదీని జగ్లూలు ప్రకటించాడు. దీనితో బ్రిటిషువారికి శివమెత్తినట్లయింది. బ్రిటిషు సైన్యాధిపతి జగ్లూలు ప్రభృతులను వెంటనే పిలిపించి జాగ్రత్త అని హెచ్చరించాడు. బ్రిటిషు అధికారితో జరిగిన సంభాషణవివరాలన్నీ వాఫ్దుసభ్యులు (ప్రతినిధివర్గము) ప్రకటించారు. రెండురోజులు గడిచింది. లండను కెయిరోల మధ్య తంతి మీద హడావిడిగా ఉత్తరప్రత్యుత్తరాలు నడిచాయి. మార్చి 8 వ తేదీని జగ్లూలునూ, అతని అనుచరులలో ముగ్గురినీ, హమీద్‌పాషా, మహమ్మద్ షా, సిద్కీపాషాలను అరెస్టుచేశారు, ఇంగ్లీషు యుద్ధనౌకమీద ఎక్కించి మాల్టాద్వీపమునకు తీసుకొనిపోయారు. దీనితో దేశంలో విప్లవాగ్నిహోత్రం అంటుకుంది.

ఈజిప్టుదేశంలో మంత్రివర్గం అంతరించింది. యుద్ధకాలంలో వలెనే దేశమందంతటా సైనికశాసనం అమలులోకి వచ్చింది. కఠిన నిర్బంధంలో పత్రికలు కొనఊపిరితో కాలంగడుపుతున్నాయి. దేశమంతా పూర్తిగా నిరాయుధమైంది. ఆయుధం ముట్టితే మరణశిక్ష. జగ్లూలు పాషాను అరెస్టుచేయడంతోనే ప్రజలలో సంచలనం ప్రారంభమైంది. విద్యార్థులు విద్యాలయాలు వదిలి వీథులలో పడ్డారు. వందలకొద్దీ విద్యార్థు

లరెస్టయారు. కెయిరోపట్టణమందంతటా సంచలనం తీవ్రమయింది. ప్రభుత్వపక్షంగా వ్రాసే 'అల్ మొకాటమ్' పత్రిక కార్యస్థానం ప్రజలు చుట్టవేశారు. మిలిటరీ వచ్చింది. తుపాకులు పేల్చారు. కొందరు చని పోయారు. మార్చి 11 వ తేదీని ప్లీడర్లంతా హరతాల్ చేశారు. ట్రాంవే పనివాళ్లు సమ్మెకట్టడంచేత ట్రాంబళ్లు ఆగిపోయాయి. ఆవేళకూడా కొందరు హతులయారు. జగ్లూలుభార్య యుద్ధరంగంలోకి వచ్చి ప్రజలను ప్రోత్సహించింది. తాము నివసించే ఇంటితో సహా సర్వస్వమూ దేశానికి సమర్పించానంది. వాప్డ ఉద్యమానికి నాయకత్వం వహించింది. మార్చి 12 వ తేదీకి జాతీయసంచలనం దేశమంతా వ్యాపించింది. ఉద్రేకపూరితు లయిన ప్రజలు రైలుబద్దెలూ, టెలిగ్రాఫ్ తీగెలూ తెగగొట్టారు. స్వరాజ్య ప్రభుత్వసంఘాలు అక్కడక్కడ స్థాపితమయాయి. కాని నిరాయుధమై, నిస్సహాయమైన దేశం నవీనమారణసాధనాలకు ఎదురుగా నిలబడ గలగడ మేలాగు? ఆ పరిస్థితులలో ఆయుధబలాన్నే నమ్మకుంటే విప్లవం విఫలంకాకతీరదు. ఈజిప్టుప్రజలు దీక్షతో సహాయనిరాకరణం సాగించారు. ప్లీడర్లు కోర్టులు బహిష్కరించారు. ఉద్యోగస్థులు రాజీనామా లిచ్చారు. విద్యార్థులు విద్యాలయాలను బహిష్కరించారు. బ్రిటిషు తుపాకిగుండ్లకు బలియైన స్వాతంత్ర్య ప్రియులకు పట్టణపు జనమంతా సమకూడి అంత్య క్రియలు జరిపారు.

మార్చినెలాఖరుకు మిలిటరీ పరిపాలన స్థిరపడింది. ఈజిప్టు రక్షణ కోసం లార్డ్ అలెన్బీ అనే యోధుణ్ణి బ్రిటిషువారు పంపారు. మార్చి 25 వ తేదీని ఆయన ఈజిప్టు చేరాడు. ఏప్రిలు 8 వ తేదీని జగ్లూలు ప్రభృతులను విడుదలచేయాలని లార్డు అలెన్బీ ఉత్తరువుచేశాడు. విడుదలకావడంతోనే వారు ఫ్రాన్సుదేశం ప్రయాణమయారు. ఆ మరునాడు రుష్దీపాషా తిరిగి మంత్రిత్వ మంగీకరించాడు. కాని ఉద్యోగాలు బహిష్కరించినవారంతా కలిసి వాఫ్డుయొక్క ప్రాతినిధ్యాన్ని ప్రభుత్వమువారు అధికారరీత్యా అంగీకరించాలనీ, ఇంగ్లీషురక్షణను తిరస్కరించాలనీ, సైన్యంలో

ఇంగ్లీషు ఉద్యోగులందరినీ తీసివేసి వారిస్థానే ఈజిప్టీయులను నియమించాలనీ తీర్మానించారు. ఇంగ్లీషువారి చేతులలో కీలుబొమ్మగా ఉన్న ప్రభుత్వానికి ఈ తీర్మానాలు అంగీకరించడం ఏలా సాధ్యమవుతుంది? ప్రజాభిప్రాయం మన్నించడం న్యాయమని అంగీకరిస్తే ఇంగ్లీషువారి అంకుశపు పోటు తప్పదుగా! అందుచేత చేసేది ఏమీ లేకపోయింది ప్రభుత్వానికి. కాని అదివరలోవలె ఇంగ్లీషువారి తుపాకుల బలం చూచుకొని ఉద్యోగాలు పట్టుకొని వేళ్ళాడుతూ ఉండకుండా ప్రజల సమ్మతి లేని ప్రభుత్వం పరిపాలించకూడదనే న్యాయము ననుసరించి ఏప్రిలు 21 వ తేదీని మంత్రులు రాజీనామా ఇచ్చారు. దేశంలో సహాయ నిరాకరణం కొంతకాలం సాగింది. కాని ఇంగ్లీషువారు తుపాకుల బలంతో రాజ్యం సాగించారు. జోహుకుంవాలాలను ఉద్యోగాలకు సిద్ధంచేశారు. ఇంగ్లీషువారి అడుగులకు మడుగులొత్తే మహమ్మదు సయ్యదుపాషాగారు మంత్రిత్వం సంపాదించారు. బ్రిటీషు ఉద్యోగులు విప్లవము అణచివేశామని సంతోషించారు.

## 4

తుపాకుల బలంవల్ల సాగించే ప్రభుత్వం ప్రజలలో భయమౌఢ్యాలూ, అంతర్భేదాలూ అంతమైన క్షణంలో అదీ అంతమవుతుంది. ప్రజలలో ఈ స్థితి కలుగజేయడమే జాతీయోద్యమాల ముఖ్యఫలితం. పరప్రభుత్వపు దృష్టిలో విప్లవము విఫలమైనట్లు కనపడినప్పటికీ ప్రజలలో దాని పని అది నెరవేరుస్తుంది. ఈ విప్లవంవల్ల ఈజిప్టుప్రజలకు మంత్రివర్గాన్ని కూలదోసే సూత్రం తమ చేతుల్లోనే ఉందన్న రహస్యం వెల్లడి అయింది. చాలాకాలంనుంచి దేశదౌర్భాగ్యకారణమైన అంతర్విభేదాలు అంతరించాయి. నిజంగా ఏదేశంలోనైనా జాతిమతాదివిభేదాలు నశించి పవిత్రమైన జాతీయత ప్రభవించాలంటే విప్లవరూపకంగా త్యాగాగ్ని ప్రజ్వలించాలి. మానవహృదయంలోని సంకుచితభావాలన్నీ, పవిత్రమైన

త్యాగాగ్నిలో భస్మమయితేనేగాని, సమసిపోవు. రాజకీయదాస్యమనే దౌర్భాగ్యం దేశానికి పట్టకపోతే దేశంలో ఆత్మవినాశకమైన విభేదాలు కలగడం అరుదు. కలిగినా వెంటనే సమసిపోకతప్పదు. కాని పరప్రభుత్వం పరిపాలన ఆరంభించినతరువాత భేదోపాయమే దానికి బలంకావడంచేత అదివరలో లేని విభేదాలుకూడా తలయెత్తుతాయి. పరప్రభుత్వాశ్రయం కోరి బాగుపడా లనే భ్రమ దేశంలో వివిధకక్షలవారికి కలుగుతుంది. ప్రభువుల చూపు తమపైన కాస్త ప్రసరిస్తే ధన్యుల మవుతా మనుకొనే మనుష్యులు ప్రతిదేశంలోనూ ఉంటారు. వీరికి ప్రాధాన్యం వస్తుంది దాస్య దేశాలలో. వీరే ప్రభుత్వాదరణ పొందుతారు. జాతీయాశయాలకు ప్రబల మైన ప్రతిస్పర్ధు లవుతారు. దేశదాస్యాన్ని మరింత బలపరుస్తారు. వీరి నాధారం చేసుకుని పరప్రభుత్వం పరిపాలన సాగించగలుగుతుంది. ఈ దౌర్భాగ్యదశ పోవాలంటే ప్రజలందరిలోనూ జాతిమతాదివిభేదాలతో ప్రమేయం లేకుండా 'మా కుటుంబం, మా మతం, మా కులం' అనే చిన్నచిన్న భావాలన్నీ నశించి విశాలమైన జాతీయభావం వ్యాపించాలి. ఇది త్యాగప్రధానమైన విప్లవోద్యమంవల్ల కలుగుతుందేకాని కమిటీలూ, ఎగ్రిమెంటులూ మొదలైనవాటివల్ల ఎన్నటికీ కలుగదు.

ఈజిప్టులో చాలాకాలంనుంచి మహమ్మదీయులతోపాటు కోప్టు లనే క్రైస్తవులుకూడా సహవాసులై యున్నారు. దేశంలో పరప్రభుత్వపు ప్రభ హెచ్చడంతోనే దేశస్థులలో విభేదాలు ఆరంభమయాయి, పర ప్రభుత్వం వీరిలో వీరికి అంతర్విభేదాలు కల్పించి, తమ వరప్రసాదమైన ఉద్యోగాలు ఎరపెట్టి, ఒకరిచేత ఒకరిని అణచిఉంచే ప్రయత్నం చేసింది. దాస్యదేశానికీ,తద్వాసులకూ ఉద్యోగాలే ఆదర్శమయే దుస్సహస్థితి ఉన్నంత కాలం పరప్రభుత్వపు ఈ విభేదపథకం జయప్రదంగా సాగుతుంది. కాని త్యాగప్రధానమైన ఉన్నతాశయం దేశాదర్శమై ప్రజలలో సంచలనం కలిగించడంతోనే దీనికి భంగం కలుగుతుంది. 1919 సంవత్సర విప్లవ సంచలనంలో ఈజిప్టులో ఈ పరివర్తన కలిగింది. మతవిభేదాలు పూర్తిగా

మాయమయ్యాయి. అనేకమంది కోప్టులు జగ్లూలుకు ముఖ్యానుచరులు. ఈజిప్టుచరిత్రలో మొదటిసారి మహమ్మదీయమసీదులలో కోప్టులూ, కోప్టుల చర్చిలలో మహమ్మదీయులూ ఉపన్యసించారు. మహమ్మదీయులూ, కోప్టులూ చేయీచేయీ కలిపి జాతీయపతాకాలతో ఊరేగారు. పతాకాలమీద మహమ్మదీయుల చంద్రవంకా, కోప్టుల సిలువా కలిపి చిత్రింపబడ్డాయి. క్రైస్తవపాదిరీలూ, మహమ్మదీయముల్లాలూ కలిసి వీథులలో దేశభక్తి బోధించారు. ఈ సమయంలోనే ఈజిప్టుదేశస్త్రీలు స్వాతంత్ర్యసమర రంగంలో అడుగుపెట్టారు. పర్దా వదలిపెట్టి బయటికివచ్చారు. జాతీయోత్సవాలలో ముందంజవేశారు. బహిరంగసభలలో ఉపన్యసించారు. ఆఫీసులదగ్గర పికెటింగు చేశారు. రైతులతోపాటు రైతుల భార్యలుకూడా విప్లవంలో పాల్గొన్నారు. బ్రిటిషుఅధికారుల క్రూరనిర్బంధచర్యలన్నీ పురుషులతోపాటు స్త్రీలూ సంతోషంతో సహించారు. ఈవిధంగా 1919 సం.రం విప్లవంవలన ఈజిప్టుచరిత్రలో నూతనయుగం ఆరంభమయింది.

పారతంత్ర్యంవలన దేశానికి కలిగే అరిష్టాలలో ముఖ్యమైనది నైతికపతనం. ప్రజలలో ఆత్మగౌరవం నశిస్తుంది. ధైర్యం, సాహసం మొదలైన మానవుని ముఖ్యలక్షణాలు మాయమవుతాయి. ప్రజలను భయమౌఢ్యాలు ఆవరిస్తాయి. ఈ స్థితి పోవడానికి జనసామాన్యంలో విరివిగా సరియైన విద్య వ్యాపించాలి. విద్యావ్యాపన అంటే విదేశప్రభువులకు కిట్టదు. ఇది ఆంగ్లేయులమీది ద్వేషంచేత మనం చెప్పే విషయం కాదు. ఆంగ్లేయుడైన సర్ విలియమ్ షిరోలు అనే గ్రంథకారుడే "ఇది నిశ్చయంగా మనం చేసిన అపచారాలలో ముఖ్యమైనది" అని వ్రాశాడు. పరప్రభుత్వం ఏ అవసరంచేతనైనా, భయంచేతనైనా విద్యావ్యాపన చేసినప్పటికీ అది తమకు జోహారుచేయించుకొనే ప్రయత్నమేకాని జాతీయ గౌరవమూ, ఆత్మగౌరవమూ వర్ధిల్లజేసేటందుకు కాదు. ఇందుచేత 50 సంవత్సరాలకాలంనుంచీ ఈజిప్టుదేశపు బాగోగులన్నీ తమ చేతులలో పెట్టుకొన్న బ్రిటిషువారు ఈజిప్టుదేశపు విద్యాదివిషయాలలో అభివృద్ధి

కనబరచకపోవడం ఆశ్చర్యకరం కాదు. దేశంలో ఆరోగ్యపారిశుద్ధ్యాదిక స్థితి దుస్సహంగానే ఉంది. దేశప్రజలలో విద్య వ్యాపిస్తేనేకాని ఆరోగ్యాదివిషయాలు చక్కబడవు. ప్రాథమికవిద్య అంటే బ్రిటిషుపాలకులకు నిర్లక్ష్యం. ఈజిప్టుదేశాదాయంలో నూటికి రెండువంతులుమాత్రమే విద్యాశాఖకై చేసే ఖర్చు. ప్రాథమికపాఠశాలలకై చేసే ఖర్చు సాలుకు 20 వేల పౌనులుమాత్రం. చెమట ఓడ్చి రైతులు కట్టిన పన్నులు ఖర్చు కావడం బ్రిటిషువారి పత్తిపొలమయిన సూడానులో వారికి తగిలే నష్టం భర్తీచేయడానికి కాని దేశహితార్థం మాత్రం కాదు. దేశంలో కాలేజీలు నాలుగూ బ్రిటిషువారి హయాముకు పూర్వము ఏస్థితిలో పాడుపడి ఉండేవో ఆస్థితికేమీ లోపంలేకుండా నిలిచిఉన్నాయి. విజ్ఞానాదివిషయాలను గురించికాని, ఈజిప్టుప్రాచీనచరిత్రలనుగురించికాని, పారిశ్రామికసంబంధమైనదికాని విద్య లభించదు. చదువంతా ఇంగ్లీషులోనేకాని మాతృభాషలో కాదు. ఎల్‌అజారువిద్యాలయంలో మాత్రం కొద్దిపాటి మార్పులను చేశారు. విద్యారోగ్యాదివిషయాల విధం ఇదీ. ఇక దేశపరిపాలనలో ప్రజలకు బాధ్యతగాని, పలుకుబడిగాని లేశమాత్రమైనా అధికమైందా అంటే అది అంతకుముందే లేదు. తమకు జోహారుచేస్తూ తమ అడుగులకు మడుగులొత్తే మంత్రివర్యులన్నా, ఉద్యోగులన్నా బ్రిటిషువారికి సహజంగా ఇష్టం. ప్రతివిషయంలోనూ కద్దనడానికీ, లేదనడానికీ సర్వాధికారం బ్రిటిషువారిదే కాని ఈజిప్టీయుల ప్రమేయ మేమీ లేదు. ఈ బ్రిటిషు ఉద్యోగులు లేశమాత్రమైనా ప్రజాహృదయం గుర్తెరుగలేని అహంకారపూరితులైన పరదేశీయులు. వీరికి ముట్టే జీతాలకు లెఖ్కలేదు. క్రమక్రమంగా ఈజిప్టుదేశపు ఉద్యోగాలలో ఇంగ్లీషువారు నిండిపోయారు. 1896 వ సం.రంలో ఈజిప్టులో ఉన్న మొత్తం ఇంగ్లీషు ఉద్యోగుల సంఖ్య 286. 1906 లో 662; 1919 లో 1671 "దీనిఫలిత మేమిటంటే ప్రజలలో బాధ్యత, స్వయంసహాయం మొదలైన పరిపాలనకు ముఖ్యమైన లక్షణాలు నశించడం" అని వ్రాశాడు షిరోలు. ప్రజాహితం గుర్తెరుగ

జాలని ఈ ఉద్యోగులంటే ప్రజలకు అసహ్యం. మరీ అసహ్యమైన ఉద్యోగులను కొందరిని ఆలెంబీప్రభువు తీసివేశాడు. కాని అంతమాత్రం చేత ఏమి అవుతుంది ?

1919 వ సంవత్సరం మేనెలనాటికి ఇంగ్లండులోని బ్రిటిషు ప్రభుత్వమువారికి ఈజిప్టుసంచలనపు రొద కొంత చెవినిపడింది. వెంటనే ఒక విచారణ సంఘ మన్నారు. ఈ సంఘం చేయవలసిన పని ఏమిటంటే "ఈమధ్య ఈజిప్టులో జరిగిన అల్లరులకు కారణా లేమిటో కనుక్కోవడం, దేశంలో శాంతిసంపదలు వర్ధిల్లడానికీ, స్వయంగా పరిపాలించుకునే శక్తి ప్రజలకు అలవాటుపడడానికి అవసరమైన సంస్థలు క్రమక్రమంగా అభివృద్ధికావడానికీ, దేశంలో పరదేశస్థుల ఆస్తిపాస్తులు సురక్షితంగా ఉండడానికీ అనువుగా బ్రిటిషువారి రక్షణకు లోబడి ఏవిధమైన పరిపాలనా విధానం ఉంటే బాగుంటుందో నిర్ణయించడం." బ్రిటిషువారి రక్షణ సుస్థిరమయ్యే ఉపాయ మాలోచించడాని కన్నట్టుంది ఈసంఘనియామకం. సంఘంలో అంతా ఇంగ్లీషువారేకాని ఒక్కడైనా ఈజిప్టీయుడు లేడు. అధ్యక్షుడు మిల్నరుప్రభువు. సంఘం వెలవడంతోనే ప్రజలకు దాని సత్తా విశదమయింది. దేశమంతటా ఏకగ్రీవంగా అసమ్మతిని వెల్లడించారు. కాని దేశస్థుల సమ్మతి అవసరమయేటట్టయితే పరాయిరాజ్యా లెందుకు బ్రిటిషువారికి ? సంఘం నియామకంకావడంతోనే ఇక చేయగలిగిన దేమీ లేక ఈజిప్టుమంత్రివర్గం రాజీనామా ఇచ్చింది. కాని దాస్యదేశాలలో మంత్రుల కేమి కొదువ ? యూసఫ్‌వాహబ్‌పాషా అనే కోప్టుప్రముఖుడు మంత్రిపదవి స్వీకరించాడు. ఇదే తరుణం చూచి ఇంగ్లండులో కామన్సు సభలో బాల్ఫరుమంత్రి "ఈజిప్టుదేశంలో బ్రిటిషుఆధిపత్యం సుస్థిరంగా ఉంది; సుస్థిరంగా ఉండితీరుతుంది. ఈజిప్టుదేశంలోగాని, బయటగాని ఎవరూ ఈ విషయాన్నిగురించి కించిత్తైనా సందేహించనక్కరలేదు" అని బ్రిటిషు అధికారబలం వెల్లడించాడు.

మిల్నరు సంఘం డిసెంబరు 7 వ తేదీని ఈజిప్టులో పాదం పెట్టింది. మిల్నరుసంఘాన్ని బహిష్కరించాలని ఈజిప్టీయులు నిశ్చ

యించారు. బహిష్కరణం సంపూర్ణంగా సాగింది. ఈజిప్టు దేశమంతా గాలించి వెదకినప్పటికీ ముచ్చటకైనా సంఘసభ్యులతో మాటాడడానికి వచ్చే మనిషి కనపడలేదు: ఏరైతును ఏ ప్రశ్న అడిగినా, "వెళ్ళి జగ్లూలును అడగండి తెలుస్తుంది" అనడమేకాని మరొకవిధమైన ఉత్తరం లేదు. చేసేదేమీ లేక 1920 సంవత్సరం మార్చినెలలో సంఘం ఈజిప్టుదేశం వదిలి లేచిపోయింది. ఆ వెంటనే లెజిస్లేటివ్ ఎసెంబ్లీ సమావేశమై 1914 వ సంవత్సరంనుంచీ అమలులో ఉన్న ప్రభుత్వశాసనాలన్నీ అక్రమమనీ, న్యాయసమ్మతం కావనీ, అవన్నీ అంతటితో పూర్తిగా రద్దయాయనీ తీర్మానంచేసింది. బ్రిటిషు ప్రభుత్వంవారు ఈజిప్టు క్షేమవిచారణకోసం మిల్నరుకమీషనుతో పాటు మరొక సంఘాన్ని కూడా సృష్టించారు. ఈ సంఘానికి నియమించిన కార్యం సూడానులో నీటిపారుదల అభివృద్ధి చేసే విధం ఆలోచించడం. ఈ సంఘంలోనూ ఈజిప్టీయు డొక్కడూ లేడు. ఇండియానుంచి తెప్పించిన ఇంగ్లీషువారు ఇద్దరూ, అమెరికానుంచి వచ్చిన దొరగారొకరూను సంఘంలో సభ్యులు. సంఘసభ్యత్వవిషయంలో ఈజిప్టుకు ప్రమేయం లేదుకాని డబ్బువిషయంలోమాత్రం పూర్తిగా ఈజిప్టుదే బాధ్యత. సూడానులో చేసే ఇరిగేషను పనులన్నింటికీ పెట్టుబడి ఖర్చు ఈజిప్టు ఆదాయంలోనుంచేకాని ఇతరత్రా ఇచ్చే దాత ఎవడూ లేడు. సూడాను అన్నివిధాలా ఈజిప్టుకు ఆయువుపట్టయితేనేమి? ఈజిప్టుక్షేమం ఆలోచిస్తే బ్రిటిషు పారిశ్రామిక ప్రభువులకు పత్తి ఎక్కడినుంచి వస్తుంది? ఈజిప్టుదేశంతో అన్నివిధాలా సంబంధం ఉన్న విషయంలో ఈజిప్టు ప్రమేయమేమీ లేకుండా వారికి తోచినవిధంగా వారు చేయడం నిజంగా ఆశ్చర్యమే. కొంతమంది బ్రిటిషుప్రముఖులకే ఇది సిగ్గుచేటుగా కనపడి, ఈ విషయంలో బ్రిటిషుప్రభుత్వ చర్యలను తీవ్రంగా ఖండించారు. బ్రిటిషువారు జరిపించిన ఈ రెండు విచారణలవల్లా, విభేదాలు సమసిపోయి చాలావరకు దేశమంతా ఐక్యమయింది.

మాటాడే మనిషి లేక దేశం వదిలిపెట్టిపోయిన మిల్నరుసంఘం ఇంగ్లండుచేరడంతోనే జగ్లూలుపాషాతో రాయబారాలు ప్రారంభించారు.

ఆగస్టులో ఒకవిధంగా సమాధానం కుదిరింది. "బ్రిటిషువారి రక్షణలో ఉన్న ఈజిప్టుదేశం" అన్నమాట వదిలిపెట్టి "స్వతంత్రమైన ఈజిప్టు దేశం" అని ఒడంబడికలో చేర్చడానికి బ్రిటిషువారు సమ్మతించారు. అదివరలో పరదేశస్థులు ఈజిప్టులో అనుభవిస్తూఉన్న అదనపు అక్రమపు హక్కులన్నీ రద్దుచేయడానికి ఒప్పుకున్నారు. కాని ఆ ఆస్తిపాస్తులకూ, హక్కులకూ ఇంగ్లండుదేశం వారసులుగా అంగీకరించా లన్నారు. ఇండియాదేశానికి పోయే మార్గం తాము సురక్షితంగా చూచుకోడానికి ఈజిప్టులో బ్రిటిషుసైన్యం ఇంకా ఉండకతప్పదు; కాని ఈసైన్యం ఈజిప్టును ఆక్రమించుకొనే నిమిత్తమనికాని, ఈజిప్టు ప్రభుత్వపు అధికారానికి భంగకరమనికాని భావించకూడ దన్నారు. ఈజిప్టు మంత్రివర్గంలో ఆర్థిక మంత్రికీ, న్యాయశాఖామంత్రికీ మాత్రం బ్రిటిషు సలహాదారులుంటే చాలునన్నారు. ఇదీ కుదిరిన ఒడంబడిక! జగ్లూలు పాషా బుట్టలో పడలేదు. ఒడంబడికలోని షరతులనుగురించి దేశంలోని ప్రజాభిప్రాయం కనుక్కోవాలన్నాడు. జగ్లూలుపాషా తన అనుచరులతో ఈజిప్టుకు వచ్చి కుదిరిన సమాధానం ప్రచురించాడు. కొద్దిపాటి మార్పులు చేయమన్నారు ప్రజలు. మంత్రులకు కుదిరే సలహాదారులను నామమాత్రంగా చేయాలనీ, బ్రిటిషు 'రక్షణ'చిహ్నాలూ, పరదేశస్థుల అదనపు హక్కులూ తక్షణం పూర్తిగా పోవాలనీ వాఫ్దుపార్టీసభ్యులు నిర్ణయించారు. అక్టోబరులో లండనునగరానికి తిరిగివెళ్లారు. బ్రిటిషువారితో ఈ మార్పులు అంగీకరింపజేయడానికి సంప్రతించారుకాని సమాధానం కుదరలేదు. తిరిగి వచ్చారు.

1921 వ సంవత్సరము ఫిబ్రవరి 18 వ తేదీని మిల్నరుసంఘం వారు తమ రిపోర్టును ప్రచురంచేశారు. తమ నివేదికలోని షరతుల ననుసరించి ఈజిప్టు గవర్నమెంటుతో ఒడంబడికచేసుకోవలసిందని బ్రిటిషుప్రభుత్వానికి సలహా ఇచ్చారు. కాని బ్రిటిషుప్రభుత్వానికి ఇదికూడా నచ్చలేదు. తమతో సంప్రతించి సమాధానం కుదుర్చుకోడానికి అద్లీపాషా

ఆధిపత్యంక్రింద మరొక క్రొత్తరాయబారం పంపవలసిందని సుల్తానుకు వ్రాశారు. అద్లీపాషా సమ్మతించి జగ్లూలునుకూడా తనతో చేరమన్నాడు. జగ్లూలుపాషా 1921 ఏప్రిలులో ఈజిప్టుదేశం చేరాడు. అసామాన్యమైన ఉత్సాహంతో ప్రజ లతనికి స్వాగతమిచ్చారు. ఏకొద్దిమందిధనికులో తప్ప మిగిలిన ప్రజలంతా అతని నాయకత్వంలో సంపూర్ణవిశ్వాసం వెల్ల డించారు. బ్రిటిషువారు ఆకొద్దిమంది ధనికులనే పట్టారు. అప్పట్లో ఈజిప్టు ప్రభుత్వం జగ్లూలుకు ప్రతికక్షులయిన ధనికుల చేతులలో ఉంది. కండ్లు విప్పి చూచినవారందరికీ ఆ ప్రభుత్వానికి పలుకుబడి శూన్యమన్న విషయం విశదమే. కాని చూడడాని కిష్టంలేనివారి కెల్లా విశదమవుతుంది? ప్రభుత్వపు పలుకుబడి అంతా వినియోగించి మూడుపర్యాయాలు ఎన్నికలు జరిపినా జగ్లూలుపక్షానికే ప్రతిసారీ సంపూర్ణవిజయం కలిగింది. అద్లీ పాషాతో తాను కూడా రాయబారంలో చేరడానికి జగ్లూలు సమ్మతించాడు. కాని కొన్ని షరతులు పెట్టాడు. పూర్ణస్వరాజ్యమే ప్రతిపాదించాలనీ, బ్రిటిషుసైనికశాసనం అంతరింపజేయాలనీ కోరాడు. అదివరలో తమ నాయకత్వంక్రింద సంప్రతించిన వాఫ్దుపక్షంలోనుంచే ఈ నూతనప్రతినిధి వర్గంలో అధికసంఖ్యాకులనూ, అధ్యక్షునీ కూడా నియమించా లన్నాడు. బ్రిటిషువారి ప్రాపకం ఆశించిన అద్లీపాషాకు ఈ షరతులు అంగీ కారంకాలేదు. నూతనరాయబారం ఏర్పాటుచేయడానికి కొత్తఎన్నికలు జరిపి కొత్తఅసెంబ్లీ ఏర్పరచవలసిందన్న సూచనకూడా అతనికి నచ్చ లేదు. 1921 వ సంవత్సరంలో అద్లీపాషా లండనునగరానికి వెళ్లి కర్జనుప్రభువుతో సంప్రతించాడు. ఆ ప్రభువు ఏమాత్రం కొరుకుపడలేదు. సంప్రతింపులలో వివాదవిషయాలు నాలుగు.

1. సూడానులో ఈజిప్టుదేశపు ఆధిపత్యం.

2. ఒక్క సూయజుకాలవప్రాంతంలోనేగాక మిగిలిన ఈజిప్టులో కూడా బ్రిటిషుసైన్యాలను నిలిపే అధికారము.

3. ఆర్థిక, న్యాయపరిపాలనావిషయాలలో బ్రిటిషుసలహాదార్ల ప్రాబల్యం.

4. ఈజిప్టుకూ, ఇతరవిదేశాలకూ కలిగే వ్యవహారాలవిషయంలో బ్రిటిషువారి పెత్తనం.

సంప్రతింపుల సారాంశ మేమిటంటే అద్లీపాషా కర్జనుప్రభువుకు ఒక్క దణ్ణంపెట్టి తన ఉద్యోగానికి రాజీనామా దాఖలుచేయడం. ఈజిప్టులో మంత్రివర్గం ఏర్పడే దిక్కు లేకపోయింది. బ్రిటిషువారి సైనికశాసనం పేరిట సైనికోద్యోగుల పరిపాలన బహిరంగంగా సాగింది. 1921 సంవత్సరం డిశంబరు 3 వ తేదీని ఈజిప్టుపరిపాలనవిషయమై లండను నుంచి చర్చిలుమంత్రిగారు పంపించిన హుకుము ననుసరించి అలెన్బీ ప్రభువు సుల్తానుగారికి తాఖీదుఒకటి అందజేశాడు. దేశంలో మరింత ఆందోళన హెచ్చింది. డిశంబరు 23 వ తేదీని ఈజిప్టులో వాఫ్దు సమావేశం జరపాలని చూశారు. వెంటనే సైనికోద్యోగుల నిషేధపు టుత్తరువు ప్రత్యక్షమయింది. జగ్లూలుపాషా స్టేటుమెంటు ఒకటి ప్రచురించాడు. అతనినీ, అతనితోపాటు మరిముగ్గురు అనుచరులనూ పట్టుకొని దేశాంతరం తీసుకొనిపోయారు. దీనితో ఉద్యమం తిరిగి తీవ్రమయింది. ఈజిప్టుప్రజలు తిరిగి సహాయనిరాకరణం సాగించారు. జగ్లూలుభార్య సోఫియా నాయకత్వం వహించింది. అలెన్బీప్రభువు కొంచెం కండ్లు తెరిచాడు. ఈజిప్టుజాతీయతను తుదివరకూ ప్రతిఘటించడం సాగదని గ్రహించాడు. కొంతవరకైనా దేశాన్ని సంతృప్తిపరచడం ముఖ్యమని లండనులో పీఠస్థులైన బ్రిటిషుమంత్రులకు సూచించాడు. సర్వత్పాషా అనే మితవాదితో తాను సంప్రతించాడు. అదివరలో జగ్లూలు మిల్నరు సంప్రతింపులలో జగ్లూలు కోరిన షరతులమీదే సమాధానపడడానికి అంగీకరిస్తా నన్నాడు. 1921 సంవత్సరం జనవరి 31 వ తేదీని సర్వతు పాషా ఈ విషయం ప్రకటించాడు, ప్రజలలో కొంత అంగీకారం కనపడింది. కాని బ్రిటిషుమంత్రులకు అలెన్బీచర్య నచ్చలేదు. వెంటనే లండనులో హాజరుకావలసిందని అతనికి హుకుం జారీచేశారు. లండను వెళ్ళి ఆయన బ్రిటిషుమంత్రులకు నచ్చచెప్పాడు. లండనులో సురక్షితంగా

కూర్చున్న మీకు అచ్చటి నిజస్థితి ఏమి తెలుస్తుం దన్నాడు. ఏలాగయి తేనేం, బ్రిటిషుమంత్రులు తలలూపారు. ఫిబ్రవరిమాసాంతానికి ఆలెన్‌బీ ఈజిప్టుదేశానికి తిరిగివచ్చి, ఈజిప్టుదేశపు స్వాతంత్ర్యం ప్రకటించాడు.

## 5

బ్రిటిషువారి రాజనీతిచాతుర్యం అసామాన్యమైన దనడంలో సందేహం లేదు. ఎంతటి క్లిష్టసమయంలోనైనా చివరకు ఏదోవిధంగా బైటపడగలుగుతారు. ఈజిప్టుదేశపు పూర్ణస్వాతంత్ర్యం అంగీకరించి ప్రకటించిన మహనీయులు దేశాన్ని యథాప్రకారంగా దాస్యబంధంలోనే ఉంచడానికి ఎంతమాత్రమూ సందేహించలేదు. ఈజిప్టుకు పూర్ణస్వరాజ్యం కాగితంమీదనే లభించింది. ఆచరణలోమట్టుకు అది పూర్ణానుస్వారమే. ఈ క్రింది నాలుగు విషయాలూమాత్రం బ్రిటిషువారు తమకు మినహా యించుకొని మిగతా స్వాతంత్ర్యం యావత్తూ ప్రసాదించారు. పొదుగు మినహా గోదాన మన్నట్టు :

1. ఈజిప్టులోనుంచి పోయే బ్రిటిషువారి సామ్రాజ్యపు రహదారీల సంరక్షణ.

2. పరదేశా లేవీ ఈజిప్టుదేశానికి అపాయం కలుగజేయకుండా రక్షణ.

3. ఈజిప్టులో పరదేశీయుల ఆస్తిపాస్తులకు ఏవిధంగానూ భంగం కలుగకుండా రక్షణ.

4. సూడాను.

ఇంత అపారమైన రక్షణబాధ్యత వారి తలమీద ఉండగా ఇంగ్లీషు సైన్యం ఈజిప్టును వదిలిపోవడం ఏలా కుదురుతుంది! యథాప్రకారం గానే సైన్యమంతా కెయిరో కోటలో కాపురంపెట్టి పట్నమంతా అర చేతిలో పెట్టుకున్నారు. అతి ఔదార్యంతో తాము ప్రసాదించిన ఈ స్వరాజ్య వరానికి ఈజిప్టీయులు బ్రహ్మకల్పాంతంవరకూ కృతజ్ఞులై ఉండాలని బ్రిటిషువారి అభిలాష. బ్రిటిషువారి ఉద్దేశంలో ఈజిప్టుదేశానికి స్వాతంత్ర్య

మనేది తమ వరప్రసాదఫలితమేకాని స్వతహాగా ఉండే హక్కుకాదు. ఇందుచేత శాంతిసంరక్షణకు భంగంలేకుండా, వరంప్రసాదించే తమకు ముప్పు రాకుండా, ఎంతవరకు ఈజిప్టుదేశాన్ని స్వతంత్రంగా వ్యవహారం చేసుకోనివ్వవచ్చును అన్నదే ప్రశ్నకాని సర్వవిషయాలలోనూ సంపూర్ణ స్వాతంత్ర్యం ఉన్నదా అనే ప్రశ్నకు తావేలేదు. ఈజిప్టీయుల కీభావం నచ్చకపోవడమేకాదు సరికదా అసహ్యాకరంకూడాను. వారి ఉద్దేశంలో బ్రిటిషువారు అన్యాయంగా, అక్రమంగా కేవలం పశుబలప్రయోగంచేత ఈజిప్టుదేశం ఆక్రమించారు. అందుచేత ఇంగ్లండుదేశానికి ఎంతవరకు లొంగిఉంటావని ఈజిప్టును ప్రశ్నించడం అన్యాయం. తమ జన్మస్వత్వమైన సంపూర్ణస్వాతంత్ర్యం ప్రశ్నలేకుండా, షరతులు లేకుండా మొదట అంగీకరించితీరాలి. ఆ తరువాత ఇంగ్లండుదేశానికీ, స్వతంత్రమైన ఈజిప్టు దేశానికీ ఏమైనా లావాదేవీ లుంటే సయోధ్యగా సంప్రతించుకొని సమాధానం కుదుర్చుకోవచ్చు. దానికి ఈజిప్టుదేశం అభ్యంతరపెట్టదు. ఇదీ ఈజిప్టీయుల దృష్టిపథం. ఈజిప్టు ఇంగ్లండుదేశాలకు లేశమాత్రమైనా సమదృష్టిలేని ఈలాంటి విషమస్థితిలో సమాధానాలూ, సఖ్యతలూ ఏలా సమకూరుతాయి ?

ఏదో సమాధానం కుదిరిందనిపించడానికి ఒక మంత్రివర్గం లెజిస్లేటివ్ అసెంబ్లీ ఈ మొదలైన అట్టహాసంతో మసిబూసి మారేడుకాయ చేద్దామని బ్రిటిషువారు సకలపాట్లూ పడ్డారు. కాని లాభంలేకపోయింది. బ్రిటిషువారు ప్రకటించిన ఈజిప్టుస్వాతంత్ర్యం ఈలోగా రూపందాల్చడం మొదలుపెట్టింది. 1922 వ సంవత్సరం మార్చి 1 వ తేదీని అంతవరకూ సుల్తానుగా కాలక్షేపం చేసిన ఈజిప్టుఖెడీవు ఈ నూతన స్వాతంత్ర్య ఫలితంగా 'రాజు'గా మారాడు. సర్వతుపాషా మంత్రివర్గం సమకూర్చడానికి అంగీకరించాడు. తమ చేతులలో కీలుబొమ్మగా చేసుకోడానికి సర్వతుపాషా సర్వవిధాలా సరిపోతాడని కర్జనుప్రభువు అలెన్బీప్రభువుకు వ్రాశాడు. ఫౌదురాజుగారికి ప్రజలలో పలుకుబడి శూన్యం. సర్వతు మంత్రి

వర్గంలో అతని ఆ ప్తులు మినహాగా మరెవరూ లేరు. జగ్లూలుపాషాను తిరిగి రానియ్యవలసిందనీ, 1914 వ సంవత్సరంలో దేశం ఆమోదించిన ఎన్నికల చట్టంప్రకారం కొత్త ఎన్నికలు జరిపి నేషనల్ ఎసెంబ్లీని సమావేశపరచవలసిందనీ ప్రజలు ఆందోళన మొదలుపెట్టారు. కాని దేశం మొత్తంమీద బహిరంగంగా ఎన్నికలు జరిపితే జగ్లూలూ, అతని పక్షంవారూ ఎసెంబ్లీని పూర్ణంగా వశంచేసుకోవడం నిశ్చయం. ఈ ఆపద తప్పించడానికి మార్గం ఆలోచించాడు సర్వతుపాషా. తన అనుచరులను ముప్ఫైముగ్గురిని హుస్సేనురుష్దీపాషా అధ్యక్షత కింద ఒక సంఘంగా నియమించాడు. స్వతంత్ర ఈజిప్టుకు ప్రభుత్వవిధానం తయారుచేసే కార్యం ఆ సంఘానికి వప్పచెప్పాడు. బ్రిటిషు వరప్రసాదితమైన స్వాతంత్ర్యంలో ఈజిప్టుకు మార్షలులా తప్పలేదు. సమావేశాలూ, సభలూ యథాప్రకారంగానే నిషేధం. 1923 వ సం.రం. జూలై 5 వ తేదీవరకూ కాగితంమీదనైనా ఆస్థితి మారలేదు. అప్పుడైనా ముందు జాగ్రతలన్నీ కట్టుదిట్టంచేసుకొని. మరీ సైనికశాసనం తొలిగించామన్నారు. 1914 వ సంవత్సరంనుంచీ సైనికశాసనంవల్ల పరిపాలించిన యావత్కాలంలోనూ ప్రభుత్వోద్యోగులు చేసిన కార్యాలన్నీ, ఏవిధమయిన విచక్షణా లేకుండా అన్నీ సక్రమమైనవిగానూ, న్యాయసమ్మతమైనవిగానూ మునుముందుగా శాసనంచేసిన తరువాతకాని సైనికశాసనం తొలిగించామన్న ప్రకటన వెలువడలేదు. 1923 వ సంవత్సరం సెప్టెంబరు 17 వ తేదీని జగ్లూలు పాషా రెండవసారి దేశాంతర ప్రవాసంనుంచి తిరిగివచ్చాడు. యథాప్రకారంగా ప్రజ లతనికి బ్రహ్మరథం పట్టారు.

సెప్టెంబరు 27 వ తేదీని కొత్త ఎన్నికల హడావిడి ఆరంభమయింది. దేశంలో ముఖ్యమైన పార్టీలు మూడు. జాతీయపక్షం, జగ్లూలు పాషానాయకత్వంకింద వాఫ్దుపక్షం, సక్రమాందోళన లేక లిబరలుపక్షమూను. జాతీయపక్షానికీ, ఫౌదురాజుకూ సగమెరుక. అదివరలో యుద్ధ ప్రారంభంలో బ్రిటిషువారిచేత పదవినుంచి తొలగించబడిన ఖెడీవు

అబ్బాసుహిల్మీని పునఃప్రతిష్ఠ చేయాలని ఈ పక్షంవారి ఆశయం. ఈ పక్షమంతా శ్రోత్రియమహమ్మదీయులు. వాఫ్దుపక్షంలో మతప్రాధాన్యమేమీ లేదు. మహమ్మదీయులూ, కోప్టులూకూడా అందులో సభ్యులే. అనేక మహమ్మదీయజిల్లాలలో వాఫ్దుపక్షంతరఫున కోప్టులను ప్రతినిధులనుగా యెన్నుకొన్నారు. జగ్లూలుపక్షంవారు ఎన్నికలలో ప్రత్యేకకార్యక్రమమేమీ ప్రచురించలేదు. దేశంలోని విభేదాలన్నీ పోయి దేశమంతా తమపక్షం తరఫున ఐక్యంకావలసిందని కోరాడు జగ్లూలు. 1924 వ సంవత్సరం జనవరిలో నూతన ఈజిప్టుపార్లమెంటుకు ఎన్నికలు జరిగాయి, వాఫ్దు పక్షానికి సంపూర్ణవిజయం చేకూరింది. మిగిలిన అన్నిపార్టీలకూ కలిసి మొత్తం 27 స్థానాలు లభిస్తే ఒక్కవాఫ్దుపక్షానికి 188 స్థానాలు లభించాయి. జనవరి 28 వ తేదీని జగ్లూలుపాషా మంత్రిత్వ మంగీకరించాడు. రాజకీయఖైదీలనందరినీ విడుదలచేయడానికి బ్రిటిషుప్రతినిధి సమ్మతించాడు. మార్చి 15 వ తేదీని కెయిరోపట్టణంలో నూతనపార్లమెంటు సమావేశమయింది. పార్లమెంటు ఆరంభమయే సందర్భంలో రాజుగారి ఉపన్యాస ముంటుంది. పేరు రాజుగారిదికాని వ్రాత అంతా ప్రధాన మంత్రిదే. ఆ ఉపన్యాసం తయారుచేయడంలో జగ్లూలు చాలా చతురత కనపరిచాడు. వివాదభూయిష్ఠమైన విషయా లేమీ తలపెట్టలేదు. సూడాను మాటగాని, బ్రిటిషువారి ఆధిపత్యంవిషయంగాని కదపలేదు. ఇందుకై ప్రతిపక్షులు తీవ్రంగా విమర్శించారు.

నూతనంగా ఏర్పడిన ఈజిప్టుపార్లమెంటుకు మొదటినుంచీ బ్రిటిషు వారి ప్రతిఘటనంతోనే సరిపోయింది. నామమాత్రంగా ఉన్న ఈజిప్టు స్వాతంత్ర్యం వాస్తవంకావాలంటే బ్రిటిషుఅధికారానికి స్వస్తిచెప్పడం ముఖ్యం. బ్రిటిషువారు మినహాయించుకొన్న విషయాలలో సూడాను విషయం ఒకటి. దీన్నిగురించి ఈజిప్టుదేశంలో ఎట్టి అభిప్రాయభేద మున్నూ లేదు. ఒక వందసంవత్సరాలనుంచి సూడాను ఈజిప్టుతో ఐక్యమైయే ఉంది. మతవిషయంలోనూ, భాషవిషయంలోనూ ఈ రెండు

దేశాలకూ భేదంలేదు. 1924 వ సంవత్సరంలో సూడానులోని ప్రజలు, దేశీయులూ ఈజిప్టీయులూకూడా కలిసి ఈజిప్టుతో సంబంధం వెల్లడించ డానికి ప్రయత్నించారు. కాని బ్రిటిషువారు బలప్రయోగంవల్ల ఆప్రయత్నం అణచివేశారు. సూడానుపరిపాలన బ్రిటిషువారి చిత్తమువచ్చినట్లు చేయడమేకాని ఈజిప్టుప్రమేయమేమీ లేదు. ఖర్చుమాత్రము ఈజిప్టు దేశానిదే. ఈజిప్టుదేశస్వాతంత్ర్యం ప్రకటించినతరువాతకూడా బ్రిటిషువారు సూడానును తమ సామ్రాజ్యాంతర్భాగంగానే పరిగణించారు. అదివరకు 1899 వ సంవత్సరంలో ఈజిప్టుదేశపు హక్కును అంగీకరిస్తూ ఈజిప్టుతో బ్రిటిషువారు ఒక ఒడంబడిక చేసుకొన్నారు. ఆ ఒడంబడిక రీత్యా అధికారమంతా బ్రిటిషువారిదైనప్పటికీ ఈజిప్టుకు సూడానులో హక్కు ఉంచనే మాట అయినా కాగితంమీద నిలిచింది. పురాతనమయి పోయిన ఆ కాగితం బ్రిటిషువారికి నిరుపయోగంగా తోచింది. విద్యాధికు లయిన సూడానుప్రముఖులు కొందరు ముఖ్యపట్టణమైన ఖార్టూములో సూడాను ఈజిప్టుదేశాలు ఐక్యంకావాలన్న ఉద్దేశంతో శ్వేతపతాకసంఘం అని ఒక సంఘం ఏర్పరిచారు. 1924 వ సంవత్సరం జూన్‌నెలలో ఈ సంఘంతరపున ఈజిప్టురాజుకు ఒక వినతిపత్రం సమర్పించడంకోసం ఒక ఈజిప్టీయుడు కెయిరోపట్నానికి ప్రయాణమయాడు. బ్రిటిషువారు అతనిని దేశం దాటిపోకూడ దన్నారు. సూడానులో ఆందోళన ప్రబలమైంది. ఈస్థితిలో బ్రిటిషుప్రభుత్వంతరపున పారుమూరు ప్రభువుగారు సూడాను వ్యవహారం గురించి ఈ విధంగా చెప్పాడు: "సూడానునువదిలిపెట్టే ఉద్దేశం లేశమాత్రమైనా బ్రిటిషువారికి లేదని సంశయరహితమైన భాషలో ఖచ్చితంగా చెప్పుతాను, సూడాను ప్రజల సంరక్షణబాధ్యత బ్రిటిషు ప్రభుత్వంమీద ఉంది. ఈ బాధ్యతను ఒదులుకోవడమనేది బ్రిటిషు ప్రతిష్ఠకు భంగం." పార్‌మూర్ ప్రభువుగారి సంశయరహితమైన ఈ సంభాషణవల్ల సూడానులో వ్యవహారం చక్కబడలేదు. పైపెచ్చు ఆందోళన హెచ్చింది.

ఈలోగా ఇంగ్లండులో లేబరు ప్రభుత్వం వెలిసింది. ప్రధానమంత్రి మేక్డొనాల్డుగారు జగ్లూలుతో సంప్రతించడానికి కబురుచేశాడు. కాని సంప్రతింపులు సఫలమయ్యే ధోరణి కనపడలేదు. బ్రిటిషువారు ఈజిప్టు స్వాతంత్ర్య ప్రకటనసందర్భంలో చేసిన మినహాయింపులు నిరంకుశంగా చేశారనీ, ఈజిప్టుప్రజల ప్రమేయమేమీ లేదనీ, ఈజిప్టుదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం స్వతహాగా ఉన్న హక్కుగాని బ్రిటిషువరప్రసాద ఫలితం కాదనీ, కేవలం బలప్రయోగంచేత బ్రిటిషువారు ఈజిప్టును సమ్మతింప జేశారనీ జగ్లూలుపాషా వాదించాడు. బ్రిటిషు ప్రధానమంత్రీ, లేబరుపార్టీ నాయకుడూ అయిన మేక్డొనాల్డు మహాశయుడు బ్రిటిషు అధికార ప్రతిష్ఠను నిలబెట్టడంలో తన పూర్వులకు తీసిపోలేదు. ఈజిప్టుదేశ వ్యవహారానికి సంబంధించినంతవరకు లేబరుపార్టీ అయినా, కన్సర్వేటివుపార్టీ అయినా, మరేపార్టీ అయినా ఒకటే అని ఆయనచర్యవల్ల స్పష్టమయింది. చర్చిల్, కర్జను ప్రభృతుల మార్గమే అనుసరించాడు ఈ మహానీయుడూను. దేశం లోపల వ్యవహారంలో బ్రిటిషువారి జోక్య మెంతమాత్రమూ లేకుండా చేయడానికి జగ్లూలు ప్రయత్నించాడు. ఈజిప్టుదేశం ఆక్రమించి స్థిర నివాసమేర్పరచుకొన్న బ్రిటిషు సైన్యాని కయ్యే ఖర్చు ఇకముందునుంచి ఈజిప్టుదేశం భరించదని ఈజిప్టు పార్లమెంటులో తీర్మానించారు. (1920వ సంవత్సరము జూన్ 28) అంతవరకూ బ్రిటిషుసైన్యపు ఖర్చు సుమారు 146,000 పౌనులు ఈజిప్టుదేశమే భరిస్తూఉండేది. సూయజుకాలవను సురక్షితంగా చూచే బాధ్యత అంతర్జాతీయ సమితికి వప్పగించవలసిం దన్నాడు జగ్లూలు. దేశంలోని పరదేశీయులకు ఈజిప్టుదేశంలో ప్రత్యేకంగా వచ్చిన ముప్పేమీ లేదన్నాడు. తుర్కీ, యుగోస్లావియా మొదలైన అనేక చిన్నచిన్న స్వతంత్రదేశాలలో పరదేశీయుల రక్షణకు పరప్రభుత్వాల ప్రమేయమేమీ అవసరంలేకపోయినప్పుడు ఒక్క ఈజిప్టుదేశంలో మట్టుకు ఆ అవసరమెందుకు అన్నాడు. ఇంక దేశంలో మైనారిటీల సమస్య లేనేలేదు. కోప్టులూ, మహమ్మదీయులూ సఖ్యంగానే కాలక్షేపం

చేస్తున్నారు. కోప్టునాయకులు చాలామంది సుప్రసిద్ధజాతీయవాదులు. బ్రిటిషువారు పూర్తిగా వారి ఇష్టానుసారం చేసిన మినహాయింపులకు ఏ విధంగానూ కారణంకాని, అగత్యంకాని లేదని జగ్లూలుపాషా వివరించాడు. కాని బ్రిటిషువారి కీవాద మేలా నచ్చుతుంది? వారి కీసంగతులన్నీ తెలియవు కనుకనా? ఇంక సూడాను విషయంలో చెప్పనే అక్కరలేదు. చర్చిలు ప్రభృతులకంటె ఒక ఆకు ఎక్కువే చదివాడు మేక్డొనాల్డు. మేక్డొనాల్డుతో సంప్రతింపులు విఫలమైన తరువాత ఈజిప్టుమంత్రి స్వదేశానికి తిరిగి వచ్చాడు. ప్రజ లతన్ని అపరిమితోత్సాహంతో సన్మానించారు. ఈజిప్టు పార్లమెంటు సమావేశమయింది. బ్రిటిషు ప్రభుత్వమువారి వైఖరినిబట్టి, తా నింక ప్రధానమంత్రిగా ఉండడం అసాధ్యమని ఎంచి, జగ్లూలు రాజీనామా ఇస్తానన్నాడు కాని పార్లమెంటు అంగీకరించలేదు. అదేసమయంలో ఇంగ్లండులో లేబరుప్రభుత్వపు మూన్నాళ్ళముచ్చటా తీరి తిరిగి కన్సర్వేటివు ప్రభుత్వం వచ్చింది. ఈజిప్టులో పార్లమెంటూ, ప్రజాప్రాతినిధ్యం, ఎన్నికలూ ఈ తతంగమంతా పెట్టడమే బుద్ధిపొరపాటని కన్సర్వేటివుల అభిప్రాయం. వాఫ్దుపక్షంవారు అధికారం సంపాదించి ఈజిప్టు దేశంలో బ్రిటిషుపెత్తనం తొలగించడానికి ప్రయత్నించడం వారికి దుర్భరమైంది.

పార్లమెంటరీ ప్రభుత్వం ఆరంభమైన తరువాత ఈజిప్టుదేశంలో కార్మికపక్షం ఒకటి ఏర్పడి క్రమంగా వృద్ధిచెందింది. ఈజిప్టులో పరిశ్రమలు తక్కువ. ఉన్నవైనా తెల్లవారి యాజమాన్యంలోనివే. చాలా కాలం కార్మిక సంఘాలు అక్రమ సంఘాలుగా ఉండేవి. 1919 వ సంవత్సరంనుంచీ ఈపరిశ్రమలకు సంబంధించిన పనివారు సమ్మెలు కట్టడం సామాన్యమైంది. కెయిరో, అలెగ్జాండ్రియా పట్నాలలోని ట్రాంవేపనివారు కూలి యెక్కువచేయవలసిందనీ, పనిచేయవలసిన కాలానికి నిర్ణయముండాలనీ అనారోగ్యం, అపాయాలూ మొదలైనవాటికి ఇన్షూర్యెన్సు ఉండాలనీ ఆందోళనచేయడం మొదలుపెట్టారు. యూరపుఖండంలో

విలాసంగా కాలంవెళ్ళబుచ్చే తెల్లదొరలకు కూలినాలి చేసుకునే కార్మికుల కష్టాలు ఏమి బోధపడతాయి? వారి చెవుల కెక్కనే ఎక్కలేదు కార్మికుల గోల. దానిమీద కార్మికులు చాలాకాలం సమ్మెకట్టారు. ఏవో కొన్ని సౌకర్యాలు లభించాయి.

1922 వ సంవత్సరంలో హుస్నీ ఎల్ అరాబీ అనే అతని నాయకత్వంకింద ఈజిప్టుదేశంలో సోషలిస్టుపార్టీ ఒకటి బయలుదేరింది. ఈ అరాబీ రష్యాదేశం వెళ్ళి అక్కడి సామ్యవాదులతో సంబంధం కల్పించుకొన్నాడు. ఇతని పార్టీ సామ్యవాదసిద్ధాంతాలను ఆమోదించింది. వీరి కార్యక్రమంలో బ్రిటిషువారి ఆక్రమణ అంతమొందించడం మొదలు కొని, స్త్రీస్వాతంత్ర్యం, విద్యావ్యాపనవరకూ అనేకఅంశా లున్నాయి. పెద్దపెద్ద జమీందారీ ఎస్టేట్లన్నీ రద్దుచేయా లన్నారు. 30 ఫెద్దానులకు (ఫెద్దానంటే ఎకరానికి కొంచెము ఎక్కువ) తక్కువభూమి సాగుచేసే రైతులందరి అప్పులూ రద్దుచేయాలనీ, 10 ఫెద్దానులలోపు భూమి గల రైతులవద్దనుంచి పన్ను వసూలుచేయకూడదనీ ఉద్దేశించారు. నూరు ఫెద్దానులకు మించి ఎవరికీ భూమి ఉండకూడదన్నారు. 1924 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో అలెగ్జాండ్రియాలో కార్మికుల తిరుగుబాటు జరిగిందికాని ప్రభుత్వమువారు వెంటనే అణిచివేశారు.

కన్సర్వేటివుపార్టీవారికి ఈజిప్టువ్యవహారం చూస్తే కన్నెర్రగా ఉందని పైనివ్రాశాం. 1924 వ సంవత్సరం నవంబరు 19 వ తేదీని ఈజిప్టుదేశంలోని బ్రిటిషు సర్వసేనాధిపతి సర్ లీస్టాక్‌గారిని కెయిరో పట్నంలో ఎవరో హత్యచేశారు. తక్షణమే కన్సర్వేటివుప్రభుత్వం తీవ్ర మైన హుకుం జారీచేశారు. నవంబరు 22 వ తేదీని లార్డ్ ఆలెన్‌బీ, బ్రిటిషుఅధికారుల తాఖీదులను జగ్లూలుకు అందజేశాడు. "ఈ హత్య ప్రస్తుతపద్ధతిలో పరిపాలింపబడుతూన్న ఈజిపుకు నాగరికదేశాలలో తల వంపు; ఈజిప్టుసూడానులలో బ్రిటిషువారి స్వతస్సిద్ధమైన హక్కులమీద వెలువడిన ద్వేషానికి ఫలితం; బ్రిటిషువారు ఈజిప్టుకు చేసిన మేలుకు

కృతఘ్నత" అన్నారు బ్రిటిషుమంత్రులు. ఈజిప్టుప్రభుత్వాన్ని తక్షణం క్షమాపణ వేడుకోమన్నారు. హత్యానిరూపణకు వెంటనే విచారణ ఆరంభించమన్నారు. ఐదులక్షల పౌనులు నష్టపరిహారం మివ్వమన్నారు. ఇంతేగాక సూడానులోనుంచి ఈజిప్టుసైన్యమంతా తీసివేయా లన్నారు. సూడానులో తమ యిచ్ఛవచ్చినట్లు నిరభ్యంతరంగా నైలునదీజలం ఉపయోగించుకుంటామన్నారు.పార్లమెంటరీప్రభుత్వం ప్రారంభమైనప్పుడు ఇష్టంలేక ఉద్యోగాలు విరమించినవారికి అప్పట్లో యిచ్చిన నష్టపరిహారాలు చాలవనీ, అధికంచేయాలనీ అన్నారు. (అదివరలో ఉన్నతోద్యోగులకు రెండుప్రభుత్వాలూ కలిసి అంగీకరించి ఇచ్చిన కాంపెన్సేషన్ ఎంత అంటే ఒక్కొక్కరికి 8,500 పౌనులు. ఈ లెక్కను ఇచ్చిన మొత్తం 65 లక్షల పౌనులవరకూ చేరింది. ఇంత కాంపెన్సేషనూ తీసుకొని వీరు దేశం వదిలిపోయారా అంటే అదీ లేదు. వీరినే తిరిగి కొత్తకంట్రాక్టులమీద ఉద్యోగులుగా నియమించారు.) ఆర్థికన్యాయశాఖామంత్రులకు సలహాదార్లుగా నియమింపబడ్డ బ్రిటిషుఉద్యోగులకు పూర్వపు అధికారమంతా అప్పజెప్పాలన్నారు. ఆఖరి మూడుషరతులూ కేవలం అక్రమమన్నాడు జగ్లూలుపాషా. బ్రిటిషువారు ఆయుధాలుతీశారు. జగ్లూలు రాజీనామా ఇచ్చాడు. సెనేటుసభకు అధ్యక్షుడుగా ఉన్న జవారుపాషాను ప్రధానమంత్రిగా నియమించారు. బ్రిటిషు సర్వసేనాధిపతిహత్యవిషయంలో విచారణలు జరిగాయి. మొదటిలో 8 గురు విద్యార్థులూ, యువకులూ అయిన ఈజిప్టీయులకు మరణశిక్ష విధించారు. తరువాత మళ్ళీ 7 గురిని విచారించారు. వీరిలో ప్రముఖులైన వాఫ్దుసభ్యులను కూడా చేర్చారు. కాని వీరిలో ఒక్కనికి మాత్రం ఉరిశిక్ష విధించి మిగిలినవారిని నిర్దోషులనుగా తీర్పుచెప్పారు. విచారణసంఘానికి అధ్యక్షుడైన ఆంగ్లేయునికి ఈ తీర్పు నచ్చలేదు. సంఘంలోని ఈజిప్టీయసభ్యులు తనను త్రోసిరాజన్నారని చెప్పి ఆయన రాజీనామా ఇచ్చాడు.

జవారుపాషా మంత్రివర్గంలో అందరూ ధనాధికులూ, రాజాశ్రితులూను. దీనికి సూత్రధారుడు రాజుగారి కిష్టుడైన నహత్‌పాషా. ఇతనంటే

ప్రజలందరికీ అసహ్యం. మంత్రివర్గంలో కంతటికీ కొంచెము ఎన్నదగిన వాడు ఇస్మయిల్ సిద్కీపాషా ఒక్కడు. ఇతను మొదట్లో వాఫ్దుపక్షంలో వాడేకాని తరువాత వాఫ్దుకు ఎదురుతిరిగాడు. అధికారం వహించడం తోనే నూతన మంత్రివర్గం చేసిన పని పార్లమెంటును రద్దుచేయడం. (1924 వ సంవత్సరం నవంబరు) సక్రమంగా కొత్త ఎన్నికలు జనవరిలో జరగవలసి ఉంది. కాని మార్చివరకూ నిలుపుచేసి ఆలోగా గవర్నమెంటు పక్షంవారే అధికంగా ఎన్నుకొనబడేటందుకు సర్వ యత్నాలూ చేశారు, మంత్రివర్గపు అధికార బలానికి బ్రిటిషువారి ఆయుధ బలం సహాయమయింది. కొత్త ఎన్నికల చట్టమయితే తమకు లాభ ముండదని ఊహించి పూర్వము 1914 వ సంవత్సరంలో అమలులో ఉన్న ఎన్నికల చట్టాన్ని అనుసరించి ఎన్నికలు జరిపారు, మార్చినెలాఖ రున కొత్త పార్లమెంటు సమావేశమయింది. ప్రథమసమావేశంనాడే ప్రభుత్వపు సత్తా బయల్పడింది. సర్వతుపాషాను సభాధ్యక్షపదవికి అభ్యర్థిగా గవర్నమెంటువారు నిలబెట్టారు. జగ్లూలుపాషా ఒక అభ్యర్థి. జగ్లూలుకు 125, సర్వతుపాషాకు 85 ఓట్లు వచ్చాయి. బ్రిటిషువారి బలమే దిక్కని నమ్మిన మంత్రివర్గానికి పార్లమెంటు ప్రతిబంధకమైంది. మొదటి సమావేశంనాడే పార్లమెంటును మరల రద్దుచేశారు. కొత్త ఎలెక్షన్లు కొత్త చట్టంప్రకారం మే 23 వ తేదీని జరుగుతాయని ప్రకటించారు. కాని అప్పుడు మాత్రం జగ్లూలుపాషా అపాయం ఏలా తప్పుతుంది ? అందు చేత వెంటనే తిరిగి తెలియబరచే పర్యంతమూ ఎన్నికలు ఆపుచేయడ మయిందని మరొక ప్రకటన చేశారు. కారణ మేమన్నారంటే "ఇదివర కున్న ఎలెక్షను శాసనంప్రకారం ఎన్నికలు జరిగితే ప్రజాభిప్రాయం సరిగా వ్యక్తంకావడంలేదు. ప్రజాభిప్రాయం సరిగా వ్యక్తమయే పద్ధతిని ఎన్నికలు జరపవలసి ఉంటుంది. దీనికోసం కొత్తఎన్నికల చట్టమొకటి తయారుచేయవలసి ఉంది" అని. అందుకోసం ఒక సంఘం కల్పించారు. ఆ సంఘంవారు 1925 నవంబరు నెలవరకూ దీర్ఘాలోచన చేస్తూనే

ఉన్నారు.ఆలోగా పార్లమెంటూలేదు, కాన్‌స్టిట్యూషనూ లేదు. బ్రిటిషు వారి ఆయుధబలం ఆధారంగా చూచుకుని మంత్రులు నిరంకుశంగా పరిపాలన సాగించారు. బ్రిటిషు ప్రముఖులకూ, పత్రికలకూ ఈపద్ధతి నచ్చింది, పార్లమెంటు అంటూ ఒకటి కల్పించి జాతీయాందోళకులను అందులో గడబిడచేయనివ్వడం వారికి కొరివిపెట్టి తలగోక్కున్నట్టు తోచింది. కాన్‌స్టిట్యూషనూ, పార్లమెంటూ అనే వెర్రివెర్రి పద్ధతులు కట్టిపెట్టి తమ కిష్టులైన మంత్రులద్వారా దేశాన్ని పాలించడం దివ్యంగా కనపడింది. ఒకసంవత్సరం ఈవిధంగా పరిపాలనచేయగలగడంతోనే దేశంలో ఆందోళకుల అల్లరేకాని మరేమీ లేదనీ, దేశం శాంతస్థితిలోనికి వచ్చిందనీ బ్రిటిషుఅధికారులకు తోచింది. సెప్టెంబరునెలలో జవారుపాషా మంత్రివర్గంలో విభేదాలు కలిగాయి.

ఈజిప్టులో కోర్టుజడ్జీగా ఉన్న షేక్‌అబ్దుల్‌రజాక్ అనేఆయన కొరాను గ్రంథాన్నిగురించి ఒకపుస్తకం వ్రాశాడు. కొరానులో విధించిన నియమాలన్నీ కేవలం వ్యక్తులకోసం ఉద్దేశింపబడ్డవికాని సంఘంకోసం కాదనీ, సాంఘికపరిపాలనాపద్ధతులకూ, కొరానునియమాలకూ ఏమీ సంబంధంలేదనీ, సంఘంలో కాలాన్ననుసరించి మార్పులు గలగడం ముఖ్యమనీ ఈ మొదలుగాగల భావాలు ఆ గ్రంథంలో వెల్లడించాడు. పూర్వాచారులంతా మండిపడ్డారు. కొరానును దూషించిన మతభ్రష్టు డన్నారు. అతనిని ఉద్యోగములోనుంచి తీసివేయాలన్నారు. ప్రజాభిప్రాయంమట్టుకు అబ్దుల్‌రజాకుపక్షమే వహించింది. జనసామాన్యానికి ఆతని భావాలు సహేతుకంగా కనబడ్డాయి. అబ్దుల్‌రజాకును ఉద్యోగం లోనుంచి తీసివేయవద్దని లిబరలుప్రముఖులు కొందరు రాజుగారిని కోరారు. కాని ఫలితము లేకపోయింది. ఆయన్ను ఉద్యోగంలోనుంచి తీసివేశారు. దానిమీదట మంత్రివర్గంలో ఉన్న లిబరలుమంత్రులు, ఇస్మయిలుసిద్కీ పాషాతో సహా రాజీనామా యిచ్చారు. వీరు వదిలిపోవడానికే కనిపెట్టుకొని ఉన్న రాజుగారికి సంతోషమైంది. తన్నాశ్రయించి తనచుటూ తిరిగేవారే

మంత్రులుగా ఉండాలని అతని ఆశయం. అంతటితో మంత్రివర్గంలో ఎన్నదగిన మనిషి ఒక్కడూ లేకుండాపోయాడు. ప్రభుత్వప్రతిష్ఠ పూర్తిగా నశించింది. నిర్బంధశాసనాలన్నీ అమలులోనే ఉన్నప్పటికీ దేశంలో ఆందోళన అధికమైంది.

## 6

ఈ పరిస్థితుల్లో ఈజిప్టుదేశంలోని బ్రిటిషుప్రతినిధి మారాడు. లార్డు అలెన్బీ వెళ్ళిపోయి సర్ జార్జి లాయడ్ దయచేశాడు. ఈ మహానీయుడదివరలో ఇండియాలో ప్రభుత్వంచేశాడు. ప్రాచ్యదేశాలలో పార్లమెంటులూ, కాన్‌స్టిట్యూషన్లూ పనికిరావని ఆయననమ్మకం. నిరంకుశంగా పరిపాలిస్తేనేకాని ఆ దేశస్థులు మనుష్యులు కారని లాయడ్ గారి ఉద్దేశం. బ్రిటిషువారి బలం ప్రదర్శిస్తే చాలు ప్రజలు కిక్కురుమనకుండా కాలంగడుపుతారంటాడు. దేశంలో పాదంపెట్టినప్పటినుంచీ ఈజిప్టుజాతీయత అడుగంటే ఉపాయం ఆలోచించాడు. కాని అధికారమదాంధుల చర్యలవల్ల జాతీయత విజృంభిస్తుంది; అడుగంటదు. ప్రపంచచరిత్రలో అనేకపర్యాయాలు ఈ విషయం వ్యక్తమైంది. కాని అంధులైన నిరంకుశపాలకులకు అది గోచరంకాదు.

బ్రిటిషువారూ, వారి దాసులైన నామమాత్రపు మంత్రులూ కలిసి నిరంకుశంగా సాగించిన పరిపాలనవల్ల దేశంలో విభేదాలన్నీ నశించి జాతీయైక్యత కలిగింది. జగ్లూలుపాషా నాయకత్వం బలపడింది. ఈజిప్టు కాన్‌స్టిట్యూషను ప్రకారం ప్రతిసంవత్సరం నవంబరునెలలో మూడవ శనివారంరోజున పార్లమెంటు సమావేశంకావాలి. పార్లమెంటు సమావేశం కావడం ప్రభుత్వానికి ఇష్టంలేదు. పార్లమెంటు భవనంలో సైన్యాన్ని కాపలాపెట్టారు. కాని జగ్లూలు నాయకత్వంక్రింద మూడు పక్షాలవారూ ఏకీభవించి గవర్నమెంటు నిషేధమున్నప్పటికీ పార్లమెంటు సమావేశం జరపాలని నిశ్చయించారు. 1925 నవంబరు 21 వ తేదీని జగ్లూలు

అధ్యక్షతక్రింద పార్లమెంటు భవనంలోనే సమావేశం జరిగింది. కాన్స్టిట్యూషన్ ప్రకారం పార్లమెంటు రద్దుకాలేదనీ, సజీవమై ఉందనీ ప్రకటించారు. గవర్నమెంటు చర్యలన్నీ అక్రమమని శాసించారు. పార్లమెంటుకు అధ్యక్షునిగా జగ్లూలుపాషానూ, ఉపాధ్యక్షులుగా ఇతర పార్టీనాయకులైన మొహమ్మద్ పాషామహమూద్, అబ్దుల్ అజీజ్‌పాషా ఫామీ, అబ్దుల్ హమీద్ బే సయ్యదులను ఎన్నుకొన్నారు. దేశభక్తుల పవిత్ర త్యాగంవల్ల సిద్ధించిన ఈజిప్టు కాన్స్టిట్యూషనును తమ యావచ్ఛక్తీ వినియోగించి రక్షించడానికి నిశ్చయించుకున్నారు. నిరంకుశత్వం నిర్మూలంచేయడానికి తీవ్రమైన ఆందోళన జరుపవలసిందని ప్రజలను హెచ్చరించారు.

1925 వ సంవత్సరం డిసెంబరు 8 వ తేదీని ప్రభుత్వంవారు కొత్త ఎన్నికలచట్టం ప్రచురించారు. దానిప్రకారం 30 సంవత్సరాలకు పైవారుకాని వోటుచేయకూడదు, ఇంకా అనేక ఉపాయాలు పన్ని రాజాశ్రితులు మాత్రము ఎన్నుకోబడేటందుకు కట్టుదిట్టాలు చేశారు. ఆచట్టము ప్రకారం 3 వ ఈజిప్టు పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతాయని ప్రకటింపబడింది. అన్నిపార్టీలవారూ కలిసి ఎన్నికలు బహిష్కరించాలని తీర్మానం చేశారు. బహిష్కరణం నెగ్గదని మంత్రు లాశించారు. ఉద్యోగపు ఆశచేత కొంతమందైనా ఎన్నికలలో పాల్గొంటారని ఊహించారు. కాని వారి ఆశలు విఫలమయాయి. జాతీయవాదులలో విభేదాలు కలుగలేదు. 1926 ఫిబ్రవరి 19 వ తేదీకి కెయిరో పట్నంలో జాతీయ సమావేశం ఒకటి ఏర్పాటుచేశారు. ఈజిప్టులోని సర్వపక్షాలలోని ప్రముఖులందరూ సమావేశానికి వచ్చారు. జివారుపాషా మంత్రివర్గానికీ, బ్రిటిషుప్రతినిధికీ గూడా ప్రజాభిప్రాయప్రాబల్యం విశదమైంది. విభేదాలు కలిగించగలమన్న వారి ఆశలు అడుగంటాయి. ఇక గత్యంతరంలేక మేనెలలో జగ్లూలు ప్రభుత్వం నాటి ఎలెక్షను శాసనంప్రకారం కొత్త ఎన్నికలు జరిపారు. తిరిగి వాఫుపక్షానికి సంపూర్ణ విజయం చేకూరింది. జగ్లూలుకు ప్రతిపక్ష

లెవరూ లేరు. రాజాశ్రితులకు పార్లమెంటులో స్థానమే దొరకలేదు. లిబరలు నేషనలిస్టు పార్టీలవారు వాఫ్దుతో సమాధానం చేసుకొన్నారు. క్రమానుసారం జగ్లూలుపాషా ప్రధానమంత్రి కావలసిఉంది. కాని లాయడ్ ప్రభువు అందుకు సమ్మతించలేదు. అద్లీఎఘెూ పాషా ప్రధానమంత్రిగా మంత్రివర్గం ఏర్పాటుఅయింది. కాని మంత్రివర్గంలో అధిక సంఖ్యాకులు జగ్లూలు పక్షంవారే. జగ్లూలు సభకు అధ్యక్షుడయ్యాడు. బ్రిటిషుప్రభుత్వం తరఫున లాయడ్ ప్రభువుగారు కష్టకాలములో తమకు అండగా నిలిచి నందులకు జివారు పాషాను ప్రస్తుతించి అతన్ని ఓదార్చారు. దానితో ఆ పాషాకు ఏరవంతైనా ప్రతిష్ఠ మిగిలితే అది కాస్తా నశించింది.

నూతనపార్లమెంటు ప్రతినిధులు ప్రథమసమావేశంలో వివాద ఘ్యాయిష్ఠమైన విషయా లేమీ చర్చించలేదు. 1926 వ సంవత్సరం నవంబరు 18వ తేదీని 2వ సమావేశంలో బ్రిటిషువారితో సంబంధంవిషయం తలపెట్టారు. ప్రారంభోపన్యాసంలో బ్రిటను ఈజిప్టుదేశాలకు స్థిరమైన సఖ్యత కుదురుతుందని రాజుగారు ఆసించారు. బ్రిటిషుప్రభుత్వం తరఫున ఛేంబర్లేను కూడా లండనులో ఈ ఆశనే వెల్లడించాడు. ఈ మర్యాదల మాట ఏలా ఉన్నా ఆచరణలో మాత్రం లాయడ్ప్రభువు ఈజిప్టుదేశంతో సఖ్యానుకూలమైన రీతిని వర్తించలేదు. ఐనదానికీ కానిదానికీ ఈజిప్టు పరిపాలనలో జోక్యం కలుగజేసుకోకుండా ఉండడం అతనికి సాధ్యం కాలేదు. 40 సంవత్సరాలక్రితం క్రోమరుప్రభువు పరిపాలించినరీతిగా తాను కూడా బ్రిటిషుఅధికారం ఎదురుమాటలేకుండా చలాయించాలని అతని ఆశ. కాని కాలచక్రం తిరిగిపోవడం అతని బుద్ధికి తట్టలేదు. అతని చర్యలవల్ల ఈజిప్టుదేశంలో అసహ్యం బయలుదేరింది కాని సఖ్యభావం కలుగలేదు.

1927 వ సంవత్సరం ఏప్రిలునెలలో అద్లీఎఘెూపాషా ప్రధాన మంత్రిత్వం వదులుకున్నాడు. ఈజిప్టులో తిరిగి విభేదాలు కలుగవచ్చు నని లాయడ్గారు ఆశించారు కాని లాభంలేకపోయింది. ఎఘెూపాషా

అనంతరం సర్వతుపాషా ప్రధానమంత్రి అయాడు. ఇతను చాలా మిత వాది. అయినా బ్రిటిషువారు శాశ్వతంగా ఈజిప్టులో కాపురముండాలని కోరేవాడు మాత్రం కాడు. ఇతను ఆధిపత్యం వహించడంతోనే పురాతన పద్ధతులతో తరిఫీదయి ఎందుకూ పనికిరాకుండాఉన్న ఈజిప్టుసైన్యాన్ని నూతనపద్ధతుల ననుసరించి సంస్కరించాలని ప్రయత్నించాడు. వెంటనే లాయడ్ ప్రభువుకు వెర్రులెత్తాయి. కూడదన్నాడు. మాల్టానుంచి బ్రిటిషు యుద్ధనౌకలను పిలిపించాడు. జాగ్రత్త అని హెచ్చరించాడు.

ఈస్థితిలో 1927 సంవత్సరం జూలైలో ఈజిప్టురాజూ, ప్రధాన మంత్రీ ఇంగ్లండుదేశం వెళ్ళారు. వారిని అట్టహాసంగా ఆహ్వానం చేయడంలో బ్రిటిషువారు ఎక్కడా లోటుకనబరచలేదు. రాజనీతిచతురులైన బ్రిటిషు అధికారులు సకలవిధ సన్మానాలూ జరిపారు. ఆసమయం కనిపెట్టి ప్రధానమంత్రి సర్వతుపాషా బ్రిటిషువిదేశాంగ మంత్రియైన సర్ ఆస్టిన్ ఛేంబర్లేన్‌తో సంప్రతింపులు ప్రారంభించాడు. సరిగా ఆసమయంలో ఈజిప్టుదేశానికి నాయకాగ్రణియైన మహాపురుషుడు సాధ్ జగ్లూలు పాషా అస్తమించాడు.

ఈజిప్టుదేశపు ఆధునికచరిత్ర జగ్లూలుపాషా జీవితచరిత్రతో మిళితమైపోయింది. అంతకుపూర్వం 50 సంవత్సరములక్రిందట అరాబీ పాషావిప్లవంతో ఆరంభం ఆయనదేశసేవ. అప్పటినుంచీ మరణ పర్యంతమూ జాతీయోద్యమరంగంలో ప్రధానస్థాన మాక్రమించాడు. స్వాతంత్ర్యసమరంలో పడరాని ఇక్కట్టులన్నీ పడ్డాడు. అసామాన్యమైన అతని స్వార్థరాహిత్యంవల్ల ప్రజాహృదయాన్ని అద్భుతంగా ఆకర్షించాడు. తన త్యాగదీక్షవలన ప్రజలలో నూతనోత్తేజం కలిగించాడు. నిష్కళంకమైన జీవితంవల్ల జగ్లూలుపాషా ప్రజలకు ఆదర్శపురుషు డయ్యాడు. జగ్లూలు జీవించినంతకాలమూ బ్రిటిషువా రతని నిష్కళంక జీవితమూ, స్వార్థరాహిత్యమూ గుర్తించలేదు. ఇది అతని విషయంలోనే కాదు, బ్రిటిషువారి దాస్యంలో చిక్కి వారిని ప్రతిఘటించి జాతీయోద్యమాలు

నడుపవలసివచ్చిన పలువురు మహాపురుషుల విషయంలో కూడా ఇంతే. జగ్లూలుపాషా ఈజిప్టుదేశపు సామాన్యజనులలోనుంచి వెలువడిన మహాపురుషుడు. ఈజిపుదేశపు ముఖ్యలక్షణాలన్నీ ఇతనిలో మూర్తీభవించాయి. ఇతని ఔన్నత్యం చాలాకాలంవరకూ ధనాధికులకు కిట్టలేదు. సర్వవిధాలా ప్రతిఘటించారు. కాని జగ్లూలుయొక్క రాజనీతి చతురతవలనా, సహృదయతవలనా చివరకు వారుకూడా అతని నాయకత్వ మంగీకరించ డానికి సందేహించలేదు. యావత్తు ఈజిపుదేశాన్నీ ఒక్క తాటిమీద నడిపించిన ప్రజ్ఞాశాలి జగ్లూలు. సర్వపక్షాలనూ ఐక్యంచేసి ఈజిప్టులో బ్రిటిషు అధికారప్రాబల్యం అంతరించడానికి మార్గం చూపించాడు. ఈజిప్టులో జాతీయతను పెంపొందింపజేయడమేకాక ఈజిప్టుప్రజలకు నూతన ప్రజాస్వామికపద్ధతులను అ ల వా టు చే శా డు. నవీనయుగంలో ఈజిప్టుదేశానికి ఆదర్శపురుషుడైన ఈ దేశభక్తుడు వయస్సునిండినప్పటికీ దేశసేవే జీవితాదర్శంగా కాలంగడిపి చివరకు 1927 వ సంవత్సరం ఆగస్టు 23వ తేదీని, తన డెబ్బదియారవ ఏట దివి నలంకరించాడు. మాతృదేశహితార్థమై అతడు ధారవోసిన 45 సంవత్సరముల నిష్కళంక జీవితం ఈజిప్టుచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖితమౌతుం దనడానికి సందేహం లేదు.

జగ్లూలుపాషా మరణించిన తరువాత ఈజిప్టుజాతీయత చాలవరకు క్షీణిస్తుందని చాలామంది అనుకున్నారు. కాని వారు దేశజీవితతత్వం గ్రహించినవారు కారు. ప్రపంచంలో ఏదేశంలో నైనప్పటికీ ఎంతటి మహాపురుషులైనా, జాతీయత వ్యక్తుల జీవితంమీద ఆధారపడిఉండదు. నిజంగా దేశంలో వికసించే జాతీయతవలననే కాలానుసారంగా మహాపురుషు లుద్భవిస్తారని చెప్పాలి. మానవసంఘపరిణామంలో జాతీయత అనేది సహజమైన ఒక ముఖ్యావస్థ. ఈ పరిణామదశకు వెనుకముందు లుండవచ్చు. వృద్ధిక్షీణత లుండవచ్చు. కాని ఒకసారి అంకురించిన తరువాత ఎన్ని ఆటంకాలు కలిగినప్పటికీ, కాదు—ఆటంకాలు కలిగినకొద్దీ

జాతీయత వికాసంచెంది తుదకు మానవజీవితానికి ఉత్తేజం కల్పించడం నిశ్చయం.

జగ్లూలుపాషా అనంతరం ముస్తాఫా నహాసుపాషాను వాఫ్దు నాయకుడుగానూ, పార్లమెంటు అధ్యక్షుడుగానూ ఎన్నుకొన్నారు. ఇతడు నిశితమైన స్వభావం కలవాడు. దేశభక్తిపరాయణుడు, నవంబరు 17 వ తేదీని పార్లమెంటు సమావేశమయింది. రాజుగారి ప్రారంభోపన్యాసంలో ఈజిప్టుబ్రిటనుల సంప్రతింపునుగురించి ముచ్చటించాడు. సర్వతుపాషాకూ, సర్ ఆస్టిన్ ఛేంబర్లేనుకూ జరిగిన సంప్రతింపుల ఫలితం తెలుసుకోవడానికి పార్లమెంటుసభ్యులు ఆత్రతపడ్డారు. సంప్రతింపులలో మామూలుగా ఇదివరలోవలెనే సూడాను, బ్రిటిషు సేనలూ, పరదేశీయుల రక్షణా ప్రాముఖ్యతవహించాయి. ఈజిప్టు స్వాతంత్ర్యం తమ జన్మస్వత్వమని భావించే ఈజిప్టీయుల దృష్టిపథానికీ, తమ వరప్రసాదమని భావించే బ్రిటిషు అధికారుల దృష్టిపథానికీ ఏవిధమైన సంబంధం లేకపోవడంచేత, సంప్రతింపులు సఫలంకాకపోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు. సర్వతుపాషా ఈజిప్టీయులలో మితవాదులలో మితవాది. స్వతహాగా శాంతిప్రియుడు. బ్రిటిషువారితో సఖ్యం కుదర్చడానికి సర్వవిధాలా శ్రమపడ్డాడు. సూడాను విషయంలో అప్పట్లో పట్టుపట్టడం లాభంలేదని గ్రహించి 1924 వ సంవత్సరానికి పూర్వము అమలులో ఉన్న ఈజిప్టు-బ్రిటిషుఒడంబడిక పునరుద్ధరింపజేస్తే చాలునన్నాడు. ఈజిప్టుదేశంలో పరదేశీయులకు రక్షణ ఉండదనడం హాస్యాస్పదమనీ, ఆమూలంగా బ్రిటిషువారు దేశంలో స్థావరంగా అట్టే పెట్టదలచిన బ్రిటిషుసైన్యంవల్ల దేశీయులలో జాత్యోద్రేకం అధికంకావడం తప్ప మరియొక ప్రయోజన ముండదనీ ఎన్నోవిధాల నచ్చజెప్పాడు. సూయజుకాలవను సంరక్షించడానికి ఈజిప్టు దేశమంతా బ్రిటిషుసైన్య మాక్రమించడం అక్రమమనీ, నిజంగా సూయజు రక్షణ అవసరమయ్యే పరిస్థితులలో మాల్టాద్వీపమునుంచి క్షణకాలంలో బ్రిటిషుసైన్యం పరుగెత్తవచ్చుననీ సూచించాడు. కాని బ్రిటిషుసామ్రాజ్యాధి

కారులకు కేవలం వాగ్రూపకమైన ఈ వాదం ఎలా నచ్చుతుంది? దేనికి దానికే అభ్యంతరం చెప్పారు. చివరకు బ్రిటిషు ఈజిప్టీయసమాధాన మనే పేరుతో ఒక పత్రం తయారుచేశారు. సర్వతుపాషావంటివానినే సంతృప్తి పరచలేని బ్రిటిషువారు ఇక ఈజిప్టీయ జాతీయవాదులను ఏవిధంగా సమాధానపరుస్తారు? బ్రిటిషువారు తయారుచేసిన ఈ ఒడంబడిక చూచి సర్వతు నిర్విణ్ణు డయ్యాడు. అధికారాంధతవలన కలిగిన బుద్ధిహీనతకు విచారించాడు. అది ఈజిప్టు బ్రిటనుదేశాలకు సామరస్యం కుదర్చడానికి చేసేయత్నం కాదన్నాడు. ఛేంబర్‌లేన్‌గారు ఒడంబడిక మరిమార్చడానికి వీలులేదనీ, అంగీకరించేదీ లేనిదీ కాలయాపన లేకుండా వెంటనే తెలియ పరచవలెననీ అన్నాడు. ఈజిప్టీయ మంత్రివర్గం ఒడంబడికనుగురించి యోచించి, తిరస్కరింపక తప్పదన్నారు. 1928వ సంవత్సరం మార్చి నాలుగవతేదీని, సర్వతుపాషా, మంత్రివర్గంవారి తీర్మానం లాయడ్ ప్రభువుకు నివేదించి తను రాజీనామా దాఖలుచేశాడు. మరి ఆరునెలలు తిరగకుండా మరణించాడు.

బ్రిటిషు బలప్రయోగమహిమచేత ఏకచ్ఛత్రాధిపత్యం చేయదలచిన లాయడ్ ప్రభువుకు ఈజిప్టుదేశంలోనేకాదు, ప్రాచ్యదేశాలలో ఎక్కడైనా సరే పార్లమెంటులూ, కాన్‌స్టిట్యూషన్లూ అనవసరమేకాక అపాయకరం కూడా అని అభిప్రాయం. తనకు అధికారం సంప్రాప్తించిన తరువాత తన పరిపాలనకు పార్లమెంటనే ప్రతిబంధకం లేకుండా చేసుకోడానికే ప్రయత్నించాడు. కాని ఛేంబర్లేనుగారు తయారుచేసిన ఒడంబడికకు ఈజిప్టు పార్లమెంటుమొహరుకూడా పడడం ఎందుకైనా మంచిదని కొంతకాలం ఓపికపట్టాడు. కాని ఆ ఆశ నిరాశ అయింది. ఈజిప్టీయ పార్లమెంటుకు రోజులు దగ్గరపడ్డాయి. 1924వ సంవత్సరంలోవలెనే బ్రిటిషువారు తమ చేతులలోనే ఉన్న రాజును పురికొల్పి పార్లమెంటును రద్దుచేయించడానికి పూనుకొన్నారు. జగ్లూలుకాలంలో ఏర్పడిన వివిధ పక్షాల సంయోగానికి ఇంకా భంగం రాలేదు. అందుచేత సర్వతుపాషా

రాజీనామా ఇచ్చినతరువాత రాజుగారి కిష్టములేకపోయినప్పటికీ, వాఫ్దు నాయకుడైన ముస్తాఫా నహాస్‌పాషాను ప్రధానమంత్రిగా చేయకతప్పింది కాదు. అతని మంత్రివర్గంలోకూడా అన్నిపక్షాలవారూ కలిశారు. కాని మంత్రివర్గానికి మూడునెలలు గడవడమే దుస్తరమైంది. ప్రతివిషయం లోనూ లాయడ్‌ప్రభువు అడ్డంపడడం మొదలుపెట్టాడు. అదివరలో యుద్ధకాలంనుంచీ తెల్లవారు ఆయుధాలు పట్టవచ్చును, ఈజిప్టీయులు ముట్ట కూడదు అనే శాసనం ఉంది. ఈజిప్టు దేశస్థులకు కలిగిన ఈ అక్రమం తొలిగించడానికి నహాసుపాషా కొన్నిశాసనాలు చేశాడు. పనికిరాదన్నాడు లాయడ్‌ప్రభువు. ఈవిషయంలో జోక్యం కలుగజేసుకొనడానికి నీ కవ సరంలేదన్నాడు ఈజిప్టు ప్రధానమంత్రి. లాయడ్‌ప్రభువుకు చిర్రుమంది. మాల్టానుంచి మరుక్షణంలో బ్రిటిషుయుద్ధనౌకలు తెప్పించాడు. ఈజిప్టీయులు ఆయుధాలు పట్టవచ్చు ననే ఆ శాసనాలు రద్దుచేస్తావా, లేదా అన్నాడు. ఈవిషయంలో బ్రిటిషువారికి సంబంధంలేదనీ, పరదేశీయుల జోక్యానికి తా మెంతమాత్రమూ సహింపజాలమనీ నహాసుపాషా సమా ధానం చెప్పాడు. వచ్చే పార్లమెంటు సమావేశంవరకూ (1928 నవంబరు వరకూ) సెనేటుసభలో ఈ బిల్లులను గురించిన చర్చ నిలుపుచేస్తా నన్నాడు. దీనితో లాయడ్‌ప్రభువు ఉద్దేశం సఫలమైంది. ఆవచ్చే నవం బరులో పార్లమెంటు సమావేశమే లేకుండాచేశాడు. రెండుసంవత్సరాల పాటు జీవించి, మూడవ ఈజిప్టీయ పార్లమెంటు బ్రిటిషువారి తంత్రం వల్లా, ఈజిప్టురాజు నిరంకుశత్వంవల్లా అంతరించింది.

1928వ సంవత్సరారంభంలో మంత్రివర్గంలోని ఏకీభావం మాయ మయింది. మొదట లిబరలుపక్షంవారు విడిపోయారు. మొహమ్మదు మహమ్మదుపాషా రాజీనామా ఇచ్చాడు. తరువాత వాఫ్దుసభ్యులు ముగ్గురు వదలుకొన్నారు. సరిగా ఆ క్లిష్టసమయంలో ప్రధానమంత్రి అయిన నహాసు పాషా, పార్లమెంటు సభాధ్యక్షుడైన విసావాసీద్‌బే అనే కోప్టుప్రముఖుడూ తమ అధికారం దుర్వినియోగంచేసి ఒక కేసులో అక్రమంగా ధనమార్జించా

రని ప్రతిపక్షులు నిందమోపారు. ప్రముఖులైన జాతీయనాయకుల ప్రతిష్ఠకు భంగకరమైన ఈ నేరారోపణలవల్ల బ్రిటిషువారికీ, రాజుకూ కళ్లు చల్ల పడ్డాయి. 1928వ సంవత్సరం జూన్‌లో రాజుగారు మంత్రివర్గంలో సఖ్యత పోయిందన్న సాకు చెప్పి ముస్తాఫానహాసుపాషాను రాజీనామా యివ్వమన్నాడు. "పార్లమెంటులో అధికసంఖ్యాకులు మాపక్షం. నేను రాజీనామా నివ్వవలసిన అవసరం లేదు" అన్నాడు నహాసుపాషా. అందు మీదట అతనిమీద ప్రతిపక్షులు మోపిన అన్యాయపు నేరాలు ఆధారం చేసుకొని రాజుగారు నహాసుపాషాను డిస్‌మిస్‌చేశారు. తనచుట్టూ తిరిగే మహమూద్ మహమూద్‌పాషాకు మంత్రిత్వ మంటగట్టాడు. ఇతనంటే లాయడ్‌ప్రభువుకుకూడా ఇష్టమే కాని ఈజిప్టుప్రజలకు లేశమాత్రమైనా విశ్వాసంలేదు. నామమాత్రమైన ఈ మంత్రివర్గం ఆధారంచేసుకొని పార్ల మెంటుకూ, కాన్‌స్టిట్యూషన్‌కూ స్వస్తి చెప్పగలిగాడు లాయడ్‌ప్రభువు.

మహమూద్‌పాషా నాయకత్వంకింద నూతనంగా ఏర్పడిన మంత్రి వర్గం మొదటినుంచీ దేశంలో ప్రజాస్వామిక పద్ధతులను భగ్నంచేయాలనే సంకల్పంతోటే ప్రారంభమయింది. ఆ మంత్రివర్గానికి అధికారం లభించడమే ఆ ఉద్దేశంచేత లభించింది. మహమూద్‌పాషా ఈజిప్టు దేశంలోని అతిధనవంతమైన జమీందారీ కుటుంబాలలోనివాడు. ప్రజా స్వామికమంటే అతనికి ఉత్సాహంకాని, సానుభూతికాని ఎలా ఉంటుంది? అధికారం లభించినవెంటనే అతన్ని వేనోళ్ళ నుతించారు లాయడ్ ప్రభువూ, బ్రిటిషు పత్రికలూ, ప్రముఖులూ అందరూను. ఈజిప్టుదేశపు అదృష్టంవల్ల అతడు లభించా డన్నారు. దేశంలో శాంతిస్థాపన చేయడానికి అవతరించా డన్నారు. మహమూద్‌పాషా మంత్రిత్వం రాగానే రైతుల బాగుకని ఏవేవో నాలుగుచట్టాలు చర్చించాడు. కాని అతని ప్రధానకార్యం పార్లమెంటుకు స్వస్తిచెప్పడం. 1928వ సంవత్సరం జూలై 19వ తేదీని రాజూ, మంత్రివర్గం కలిసి ఈజిప్టుదేశంలో ప్రజా స్వామికపద్ధతుల నంతరింపజేయడానికి ఉపక్రమణచేశారు. జాతీయ

విజృంభణవలన కలిగిన విప్లవాని కిది ప్రతీకారం. రాజూ, ధనాధికారులూ కలిసి, బ్రిటిషువారిని మద్దతుచేసుకొని, జాతీయాశయాలన్నీ దుమ్ముచేశారు. తమ నిరంకుశత్వాన్ని స్థిరంచేసుకొన్నారు. అప్పటికి అమలులో ఉన్న పార్లమెంటు సంబంధమైన కాన్స్టిట్యూషనును రాజుగారు రద్దుచేశారు. పార్లమెంటు, ఎన్నికలు, ప్రతినిధులు సర్వమూ రద్దన్నారు. పత్రికలకు కఠిననిర్బంధం ఏర్పరిచారు. తామే స్వయంగా పరిపాలనచేస్తామనీ, తమ్ము ప్రతిఘటించే ప్రతిపక్షుల నందరినీ అణగదొక్కడానికి సందేహించమనీ, ప్రజలకు శ్రేయస్కరమైన కార్యాలు తామే చేస్తామనీ ప్రధానమంత్రిగారు ప్రకటించారు. పార్టీకక్షలవల్ల పార్లమెంటరీ పరిపాలన భగ్నమయిందనీ, తాము అంతా బాగుచేస్తామనీ ప్రకటించారు. అదివరలో జివారుపాషాకాలంలో జాతీయోద్యమానికి కలిగిన నిరోధంకంటె ఈ నిరోధం ప్రబలమైంది. ఈ నిరంకుశాధికారులు దేశంలో ప్రజాపరిపాలనా సూత్రాలనే నిర్మూలించాలని చూశారు. బ్రిటిషుపత్రికలూ, ఈజిప్టులోని తెల్లవారూకూడా ఈ జాతీయ ప్రతిపక్షవిజయానికి పొంగిపోయారు. ఈజిప్టుదేశం అంతవరకూ జాతీయతా, పార్లమెంటూ, ఎన్నికలూ—ఈ గోలతో విసిగివేసారిం దన్నారు. శాంతంగా పల్లెలలో పొట్టపోసుకొనే రైతులకు ఈ గొడవంతా అక్కరలేదన్నారు. ఇది కేవలం అధికారాపేక్షచేత ఆందోళన సాగించిన స్వార్థపరుల హడావిడిమాత్రమే కాని ప్రజలకు వాస్తవంగా ఈ కోలాహలమేమీ అక్కరలేదనీ, వారిని ప్రశాంతంగా జీవితం గడుపుకోనిస్తే వారి కదే పదివేలనీ, అలా పరిపాలించే ప్రభుత్వాన్నే దేశం కోరేదనీ ఈప్రబుద్ధులు కనుక్కోగలిగారు. కాని దేశపు ప్రజలంటే ఇంత ప్రేమ గల వీరుకాని, మంత్రివర్గంకాని తమ చర్యలకు ప్రజామోదం పొందడానికిమాత్రం సాహసించలేదు. జనసామాన్యానికి పరిపాలనతో సంబంధం లేకుండా చేయడానికి పూనుకొన్నారు. నిత్యం జోహారు లొనర్చే ప్రముఖులతో ఉద్యోగాలన్నీ నింపివేశారు.

పార్లమెంటును అంతరింపజేయడం అక్రమమనీ, పార్లమెంటు రద్దుకాలేదనీ వాఫ్దుపక్షంవారు ప్రకటించారు. ప్రభుత్వంవారు పార్లమెంటు భవనం సైన్యంతో నింపివేశారు. జూలై 28 వ తేదీని ఒక గృహస్థుని భవనంలో పార్లమెంటు సభ్యులందరూ సమావేశమయ్యారు. ఆ సమావేశంలో అప్పట్లో పరిపాలన చేస్తూన్న గవర్నమెంటు సక్రమమైనది కాదనీ, ఆగవర్నమెంటు చేసే కార్యాలన్నీ న్యాయవిరుద్ధ మవుతాయనీ, ఏవిధమైన ఒడంబడికలు, సమాధానాలు చేసుకున్నా అవి చెల్లతగవనీ తీర్మానించారు. నవంబరులో మూడవ శనివారంనాడు కాన్‌స్టిట్యూషన్ ప్రకారం పార్లమెంటు సమావేశం జరగవలసిఉంది. ఆలోగా నహాస్ పాషామీది కేసు విచారణకువచ్చింది. ఎట్లాగైనా శిక్షపడేటట్లు చేయాలని గవర్నమెంటువారు సకలవిధాలా శ్రమపడ్డారుకాని లాభంలేకపోయింది. న్యాయమూర్తులు దీర్ఘంగా విచారణసలిపి నహాస్‌పాషా నిర్దోషి అని తీర్పుచెప్పారు. తీర్పు పత్రికలలో ప్రకటించకూడదని ప్రభుత్వమువారుత్తరువుచేశారు. కాని సమాచారము దేశమంతటా వ్యాపించింది. ప్రజలలో అమితమైన ఉత్సాహం కలిగింది. దేశమంతా నహాసుపాషాను అత్యుత్సాహంతో అభినందించింది.

## 7

ఈసమయంలో ఇంగ్లండుదేశంలో లేబరుపార్టీకి అధికారం లభించింది. దీనితో ఈజిప్టు పరిస్థితులుకూడా కొంతవరకూ మారవలసి వచ్చింది. సుప్రసిద్ధుడైన హెండర్సనుగారు లేబరుప్రభుత్వంలో విదేశాంగమంత్రి అయాడు. మహమూద్‌పాషా ఇంగ్లండుకు రావడం చూచి అతనితో సంప్రతించి 1929 ఆగస్టు 3వ తేదీని ఒక ఒడంబడిక సిద్ధం చేశాడు. దీనికీ, అదివరలో ఛేంబర్లేన్‌గారు తయారుచేసిన ఒడంబడికకూ ముఖ్యవిషయాలలో సహస్రాంతరం భేదం ఉంది. హెండర్సన్‌గారు ఈజిప్టుదేశానికి బ్రిటిషురక్షణ అనే అవస్థ నిజంగా తప్పించడానికి ప్రయత్నించాడు. బ్రిటిషు సైనికదళం ఈజిప్టును అక్రమించి కాపుర

యుండడం ఇంతటితో నిలిచిపోవాలి అన్నది ఒడంబడికలో మొదటి అంశము. బ్రిటిషుప్రభుత్వమువారి అంగీకారము మాత్రమేకాక ఈజిప్టు పార్లమెంటుయొక్క అంగీకారముకూడా పొందితేనేకాని ఒడంబడిక అమలులోనికి రాకూడదని బ్రిటిషుమంత్రి వివరించాడు. ఈ ఒడంబడికతో ఊరుకోలే దాయన. లాయడ్‌ప్రభువును ఉద్యోగం చాలించి రమ్మని ఉత్తరువుచేశాడు. అతని స్థానే సర్ పెర్సీ లోరెయిన్ అనే అతనిని నియమించాడు. లాయడ్‌ప్రభువు తన ఇష్టమువచ్చినట్లు నిరంకుశంగా వర్తించడమే కాకుండా కన్సర్వేటివుమంత్రి ఛేంబర్లేనుగారికి విరుద్ధంగా వర్తించాడని హెండర్సనుగారు నిరూపించారు. లాయడ్‌ప్రభువు ఈజిప్టు రంగంనుండి నిష్క్రమించడం యావన్మందికీ సంతోషదాయకమైంది.

అక్టోబరు 2వ తేదీని మహమూద్‌పాషా మంత్రివర్గం రాజీనామా ఇచ్చింది. కొత్త ఎన్నికలు జరిగే పర్యంతం అద్లీ ఎఘెన్‌పాషా ఆధిపత్యం క్రింద తాత్కాలికంగా మంత్రివర్గం ఏర్పడింది. మూడవపార్లమెంటు అంతరించిన 18 నెలలకు నాలుగవ పార్లమెంటు సమావేశమయింది. లిబరలు పక్షంవారు ఎన్నికలలో పాల్గొనమని ప్రకటించారు. వాఫ్దుపక్షంవారు హెండర్సన్ ఒడంబడికను గురించి అప్పట్లో ఏమీ ప్రస్తావన చేయలేదు. పార్లమెంటు సమావేశమయిన తరువాత ఆవిషయం ఆలోచించవచ్చునన్నారు. కొత్తఎన్నికలు డిశంబరు 21వ తేదీని జరిగాయి. ఫలితము యథాప్రకారమే. పార్లమెంటు పూర్తిగా వాఫ్దుపక్షానికి వశమయింది. 1930వ సంవత్సరం జనవరి 11వ తేదీని కొత్తపార్లమెంటు సమావేశమైంది. ముస్తాఫానహాస్‌పాషా ప్రధానమంత్రి అయాడు. బ్రిటిషువారికీ, ఈజిప్టువారికీ అదివరలో ఎన్నడూ కని విని యెరుగని సామరస్యంతో సంప్రతింపులు జరిగాయి. దేశంలో కార్యాలు చాలా ఉన్నాయి కొత్త పార్లమెంటుకు. అదివరలో ఈజిప్టుదేశపు వ్యాపార సందర్భంలో ఎగుమతి దిగుమతిపన్నులు కేవలం విదేశీయుల సౌకర్యానికి అనుకూలంగా ఉండడమేకాని దేశహితాని కనుకూలంగా కాదు. ఈ అన్యాయం తొలగించ

డానికి ఫిబ్రవరి 17 వ తేదీని క్రొత్తచట్ట మొకటి అమలులోనికి వచ్చింది. దేశంలోని వ్యవసాయ వ్యాపారాదులన్నిటి శ్రేయస్సూ ముఖ్యంగా గమనించి దేశాదాయం అధికం కావడాని కనుకూలంగా ఎగుమతిదిగుమతి పన్నులు విధించారు. అదివరకు ఈజిప్టులో పరదేశీయులు అమితమైన లాభాలు గడించి కోటీశ్వరు లవుతూన్నప్పటికీ ఒక్క చిల్లిగవ్వఅయినా వారు పన్నుఇచ్చేవారు కారు. ఈస్థితి కేవలం పాశ్చాత్యుల బలవంతంవల్ల కలిగింది. దేశంలో వా రెంత డబ్బు సంపాదించినా వారివద్దనుంచి ఏ సందర్భంలోనూ పన్నులు వసూలుచేయకూడదని తాతలనాడెప్పుడో ఈజిప్టుగవర్నమెంటును బలవంతపెట్టి ఖరారునామాలు వ్రాయించు కొన్నారు. ఇది ఒక పన్నుల విషయంలోనే కాదు, న్యాయశాసనముల విషయంలోనూ, దేశపు ఇతరశాసనాల విషయంలోనూకూడా. దేశంలో స్థిరవాస మేర్పరచుకొన్నప్పటికీ, పరదేశీయుల కేమీ సంబంధంలేదు. ఈజిప్టుదేశంలోపల వీరు వేరువేరు రాజ్యాలు స్థాపించారన్నమాట ఖర్చు మాత్రం వారు పెట్టుకోకుండాను. అన్యాయమైన ఈహక్కును తొలగించ డానికి ఈజిప్టుప్రభుత్వం ఎప్పుడు ప్రయత్నించినా, పాశ్చాత్య న్యాయ ప్రియులు ప్రపంచమంతా మునిగిపోయినట్టే గగ్గోలుపెడతారు. వారి చర్యలు క్రమమా, అక్రమమా అనే విచక్షణ వారికేమీ అవసరంలేదు. వారిది ఒక్కటే వాదం—పిడివాదం.

నూతన ప్రభుత్వం సాధ్యమైన అన్నివిధాలలోనూ అనేక సంస్కరణాలు ప్రవేశపెట్టడానికి ఆరంభించింది. విద్యావ్యాపనకు తగిన విధానం ఆచరణలోనికి తెచ్చింది. నిర్బంధోచితవిద్యవలన 1935 వ సంవత్సరం నాటికి దేశంలో విద్యావిహీనత పూర్తిగా అంతరించేటట్టు కార్యక్రమం వేసింది. ఈజిప్టుదేశానికీ, బ్రిటిషు ప్రభుత్వానికీ సమాధానం కుదరడానికి అనుకూలసమయం లభించినట్టే కనపడింది, హెండర్సన్ మహాశయుని ఉదారాశయాలవల్ల. ఇంగ్లండుదేశంతో సంప్రతించి సమాధానం కుదుర్చు కొనేటందుకు పార్లమెంటులో ముస్తాఫానహాస్‌పాషానూ, మరికొందరినీ

ప్రతినిధులుగా ఎన్నుకొన్నారు. ఈ ప్రతినిధులలో ఇద్దరు కోప్టులు. 1930 ఏప్రిలు మేనెలలలో లండనులో సంప్రతింపులు జరిగాయి. అన్నివిషయాల లోనూ సమాధానం కుదిరిందికాని సూడానువిషయంలోమట్టుకు అప్పట్లో కుదరలేదు. సంప్రతింపులు అంతటితో ఆఖరయినప్పటికీ సమాధాన పడడానికి తిరిగి వెంటనే ప్రయత్నిస్తామని రెండుపక్షాలవారూ ప్రకటించారు. ముస్తాఫానహాసుపాషా అనుచరులతో ఈజిప్టుకు తిరిగివచ్చాడు. అప్పుడు సంభాషణలు జరిగిన ధోరణిలోనే తిరిగి సంప్రతింపులు జరిగితే రెండు దేశాలకూ త్వరలోనే సఖ్యం కుదరవచ్చునని తోచింది. కాని ఈజిప్టుకు ఇంకా కష్టకాలం గడచిపోలేదు. వాఫ్దుపక్షానికి విరోధులందరూ, ముఖ్యంగా దేశంలో అన్యాయంగా అందలమెక్కగలిగిన పరదేశీయులందరూ, వాఫ్దు పొందిన విజయం చూచి సహించలేకపోయారు. ఈజిప్టుదేశంలో నివసిస్తూన్నప్పటికీ దేశస్థులందరితోపాటూ వారుకూడా పన్నులివ్వవలసి వచ్చేస్థితి సంభవిస్తుందనే భావం వారికి కంటకమైంది. అనేక విధాల అల్లరిచేసి బెదరించారు ఈ పాశ్చాత్యనీతికోవిదులు. కాని హెండర్సను వీరి ప్రలాపాలను అంతగా పాటించినట్టు లేదు.

దేశంలో ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని తిరిగి భగ్నంచేసే యత్నం జరుగుతుందేమో నని సందేహం తోచింది. అలాజరుగకుండా చేయడానికి పార్లమెంటులో శాసనం ఒకటి తయారుచేశారు. పార్లమెంటు సమ్మతి లేకుండా కాన్‌స్టిట్యూషన్ మార్చడానికి ప్రయత్నించడం దేశద్రోహంగా పరిగణింపబడుతుందనీ, అందుకు బాధ్యులైన మంత్రులు ఆజన్మాంత కఠినశిక్షకూ, 10వేల పౌనుల జరిమానాకూ పాత్రులౌతారనీ పార్లమెంటులో శాసనం చేయించడానికి ప్రయత్నించారు. కాని వాఫ్దుపక్షాన్ని వదుల్చుకో డానికి కనిపెట్టుకొనిఉన్న రాజుగారు దీని కడ్డంపడ్డారు. 1930వ సంవ త్సరం జూన్ 17వ తేదీని నహాసు మంత్రివర్గం రాజీనామా దాఖలుచేసింది. వాఫ్దుపక్షానికీ, ప్రజాప్రభుత్వ పద్ధతులకూ కూడా విరోధిఅయిన ఇస్మయిలు సిద్కీపాషాను చేరదీశారు రాజుగారు. ఈజిప్టులోని పాశ్చాత్యధనాఢ్యులకు

అ ప్తుడు సిద్కీ-పాషా. ఆయన ఆధిపత్యం రావడంతోనే వాఫ్దుతో కయ్యం ప్రారంభించాడు. జూ౯ 21వ తేదీని ముందుగా ఒక నెలరోజులు పార్లమెంటును నిలుపుచేశామన్నాడు. ఆ పిమ్మట రద్దుచేశా మన్నాడు. వాఫ్దుపత్రికల నన్నిటినీ అణిచివేశాడు. ఆ ప్తులనందరినీ ముఖ్యమైన ఉద్యోగాలలో నియమించాడు. పార్లమెంటుమాత్రం పూర్తిగా నహాసు పాషాను సమర్థించింది. పార్లమెంటును రద్దుచేశామని ప్రకటించిననాడు ప్రతినిధులందరూ పార్లమెంటుభవనంలో ప్రవేశించి కాన్‌స్టిట్యూష౯ రక్షించడానికి తమ యావచ్ఛక్తీ వినియోగిస్తామని శపథంచేశారు. మూడు రోజుల తరువాత కెయిరో పట్నంలో ప్రజాప్రతినిధులందరూ సుమారు 800 మంది సమావేశమై ఈలాంటి తీర్మానమే చేశారు. నిరంకుశాధికార ప్రియుడైన రాజుకూ, ప్రజాపక్షమైన వాఫ్దుకూ సంఘర్షణ తీవ్రమయింది. దేశంలో సంచలనం అధికమయింది. సైనిక బలంచేత పరిపాలన సాగించారు గవర్నమెంటు. అనేక తావులలో ప్రజలకూ, సైనికులకూ తీవ్రమైన సంఘర్షణలు జరిగాయి. జూలై 8వ తేదీని ఎల్‌మనసూరియా లోనూ, 15వ తేదీని అలెగ్జాండ్రియాలోనూ ప్రజారక్తం ప్రవహించింది.

1930వ సంవత్సరం సెప్టెంబరు ప్రాంతంలో పార్లమెంటు అధి కారం తీసివేసి రాజుకు అధికారమంతా అప్పజెప్పి కొత్త కా౯స్టిట్యూష౯ ఒకటి తయారుచేశారు. నామమాత్రంగా నిలవబెట్టిన పార్లమెంటుకు ఎన్నికలు కూడా నామమాత్రమే అయేటట్టుగా ఎన్నికల చట్టం మార్చారు. వోటుచేసే అధికారం అపురూపంచేశారు. వాఫ్దుపక్షంవారూ, వారితోబాటు లిబరలుపక్షంవారూ ఈ శాసనాలనన్నిటినీ ప్రతిఘటించారు. అదివరలో రాజాశ్రయం సంపాదించి నిరంకుశపరిపాలనకు మార్గదర్శకులయిన జివారు, మహమ్మద్‌పాషాలు ఇద్దరూ కూడా సిద్కీ-పాషాకు ఎదురయ్యారు. ఇంగ్లండులో అప్పటికి అధికారంలోకి వచ్చిన కన్సర్వేటివు ప్రముఖుల మీద సిద్కీ-పాషా కొండంత ఆశ పెట్టుకున్నాడు.

# అ రే బి యా

ప్రకృతంలో అరేబియాదేశం ఒక రాజ్యంగా లేదు. అనేకరాజ్యాలుగా విచ్ఛిన్నమైఉంది. తుర్కీసుల్తానుల సామ్రాజ్యం విచ్ఛిన్నంకానంత వరకూ, అరేబియాదేశమంతా తుర్కీవారి పాలనలో ఉండేది. సామ్రాజ్యాలనేవి తురుష్కసుల్తానులవైనా, లండనుదొరలవైనా, మరేప్రభువులవైనా ఒకే లక్షణాలు కలిగిఉంటాయి. పాలకజాతిలో ఒకవిధమైన అహంకారం, అతిశయం అవశ్యం. తుర్కీసుల్తానుల సామ్రాజ్యం ప్రాచీనమైనది. అనేకరకాల దేశాలకూ, ప్రజలకూ కాడిగట్టారు తుర్కీవారు. పూర్వం యూరపుఖండంలోని పాశ్చాత్యప్రజలుకూడా వీరి సామ్రాజ్యప్రజలుగానే ఉండేవారు. యూరపుఖండంలో జాతీయత ప్రబలమైనతరువాత, తుర్కీసామ్రాజ్యానికి అక్కడ అపాయం కలిగింది. క్రమంగా పాశ్చాత్యులు తుర్కీవారికి యూరపుఖండంలో నీడలేకుండా చేశారు. రాజనీతిదృష్టితో, ఏబ్రిటిషువారో, బహిరంగంలో సఖ్యం పాటించినప్పటికీ, తుర్కీసుల్తానులంటే పాశ్చాత్యులందరికీ ఆంతర్యంలో అసహ్యమే. తుర్కీని 'యూరపుఖండపు రోగి' అన్నారు పాశ్చాత్య ప్రముఖులు. ఈ రోగిని యూరపుఖండపు ఆవరణలోనుంచి బయటకు, ఆసియాఖండంలోకి,సాయం పడితేనేగాని, యూరపుఖండానికి ఆరోగ్యం వర్ధిల్లదని నిశ్చయించారు. చాలాకాలంకిందటే ఈపని చేసిఉండేవారు. కాని పరస్పరంగా అనుమానం, అసహనం ప్రబలిన నవీనపాశ్చాత్యప్రభుత్వాలకు పొత్తులు కుదరడమేలాగు? పాశ్చాత్యప్రభుత్వాల పరస్పరవైమనస్యాలవల్ల, తుర్కీసుల్తానులకు ఈగతి చాలాకాలం తప్పింది. కాని గతయూరపుయుద్ధంలో (1914-1918) తుర్కీ పాల్గొనడము, తుర్కీవారు చేరినపక్షం అపజయం పొందడముతోనే, విజయులైన పాశ్చాత్యసామ్రాజ్యప్రభువులకు మంచి అవకాశం లభించింది. తుర్కీని పూర్తిగా యూరపుఖండంలోనుంచి

వెడలగొట్టడానికి సర్వవిధాలా పాటుబడ్డారు. తుర్క్ సామ్రాజ్య మనేది లేకుండాచేయడానికి సర్వశక్తులూ ధారపోశారు. మొదటి విషయంలో పూర్తిగా సఫలులు కాకపోయినప్పటికీ, రెండవ విషయంలోమట్టుకు కృతార్థులయారు. వీరి ఈ ప్రయత్నఫలితమే నేటి అరేబియా.

ప్రస్తుతం అరేబియాదేశం అనేకరాజ్యాలుగా విచ్ఛిన్నమైఉంది. పాలస్తీను. ట్రాన్సుజోర్డేనియా, సిరియాలు ఒకపక్కనీ, ఇరాకు ఒక పక్కనీ భిన్నభిన్నరాజ్యాలుగా ఉన్నాయి. ఒక హెజాజుమినహాగా మిగిలినవాటికన్నింటికీ నానాజాతీయసమితివారు ధర్మకర్తలు. దురాశా పీడితమైన ఈ పాడుప్రపంచంలో, ఇతరసహాయమేమీ లేకుండా స్వతంత్ర జీవనం చేయలేని దేశాలుగా వీటిని పరిగణించి, కొంతకాలంపాటు, బలమైన పాశ్చాత్యప్రభుత్వాల రక్షణ పొందకతప్పదన్నారు. స్వీయ క్షేమంకోసమే కొంతకాలంపాటు ఇతరుల అదుపాజ్ఞలలో పెరగవలసిన ఈ దేశాలను 'మాండేటెడు టెరిటరీలు' అంటారు. ఈ దేశాలను రక్షించి పోషించే బాధ్యత బ్రిటిషువారిమీదా, ఫ్రెంచివారిమీదా పెట్టారు. చుట్టూ ఉన్న ఈ మాండేటెడ్‌రాజ్యాలకు నడుమనున్న అరేబియా ద్వీపకల్పం పాశ్చాత్యుల పోషణలేకుండా స్వతంత్రంగా ఉన్న రాజ్యం. ఇది సుప్రసిద్ధుడైన సుల్తాను ఇబున్‌సౌదు బలప్రాభవంవల్ల ఏర్పడిన రాజ్యం.

ఈవిధంగా పాశ్చాత్యప్రభుత్వాల రాజతంత్రంవల్ల అరేబియాదేశం వివిధరాజ్యాలుగా విచ్ఛిన్నమైనప్పటికీ, అరబుప్రజలలో ఒక్కదేశం, ఒక్కజాతి అనే ఆదర్శం మాసిపోలేదు. దేశం విచ్ఛిన్నమైనకొద్దీ ఆ ఆదర్శం ప్రస్ఫుటమైంది. అంతకంతకు అరబుజాతీయత ప్రబలమవుతోంది. ఒక కాలంలో యూరపుఖండాన్ని పాదాక్రాంతం చేసిన అరబు పూర్వౌన్నత్యం పునరుద్ధరించా లనే వాంఛ గాఢమవుతోంది. అరబుప్రజల ఆశయాలు సఫలంకావడం ఆలస్యంకావచ్చు; ప్రాయశః చాలా ఆలస్యం కావచ్చు. కాని సఫలంకావడంమట్టుకు తప్పదు.

## 2

అనేక ఇతర ప్రాచ్యదేశాలలోవలెనే అరబుదేశాలలోకూడా పాశ్చాత్య నాగరకతతో కలిగిన సంఘర్షణవల్ల ఆధునికజాతీయభావం ఉద్భవించింది. పాశ్చాత్యనాగరకతతో ప్రప్రథమంలో సంబంధం కలిగిన అరబుదేశాలు టర్కీసుల్తానుల సామ్రాజ్యంలో ఒక రాష్ట్రంగా ఉన్నంతకాలమూ ఆదేశాలకు ప్రత్యేకవ్యక్తిత్వ మేమీ ఉండేదికాదు. తుర్కీవారి పరిపాలన చాలా అధ్వానంగా ఉండేది. పూర్వం ఈజిప్టుదేశపాలకుడైన మహమ్మదాలీ సిరియాను జయించి దాని పరిపాలనావిధానం కొంతవరకు సంస్కరించాడు. ఆకాలంనుంచి దేశానికి పరప్రపంచంతో సంబంధం కలిగింది. మధ్యధరాసముద్రతీరం కావడంచేత, ముఖ్యంగా పాశ్చాత్యనాగరికతతో సంపర్కం కలిగింది. సిరియాదేశంలో మహమ్మదీయులూ, మారొనైటులనే క్రైస్తవులూ సహవాసం. నూతనజాతీయభావాలు మొదట క్రైస్తవులలో అంకురించాయి. 1868 సం॥ర ప్రాంతంలోనే అమెరికానుంచీ, ఫ్రాన్సునుంచీ పాశ్చాత్యక్రైస్తవప్రచారకులు కొందరు వచ్చి, దేశంలో విద్యావ్యాపన ప్రారంభించారు. ఆ తరువాత, మహమ్మదీయులలో కూడా, నూతన భావోదయానికి అనుకూలంగా విద్యావ్యాపన ఆరంభమైంది.

ఏదేశంలోనైనా, జాతీయోత్తేజం కలగడానికి ముందు దేశవాఙ్మయంలో నూతనభావోదయం కలగాలి. సిరియాలోకూడా ఇదేవిధంగా దేశవాఙ్మయంలో కలిగిన వికాసమే జాతీయవికాసానికి మార్గదర్శకమైంది. అదివరలో తుప్పుపట్టి చివికిపోయిన దేశభాషకు తిరిగి చేవ కలిగింది. పల్లెటూళ్ళలో, పామరులలో పాడుబడిపోయిన భాషకు, నవ్యభావోదయంతో పటుత్వమూ, ప్రాధాన్యమూ సిద్ధించింది. పురాణపఠనానికి మాత్రం అనుకూలమైన పురాతనగ్రంథాలలో, అదివరలో ఎన్నడూ ఊహించని నూతన అర్థవిశేషం బయల్పడింది. ప్రపంచంలోని ఎక్కడెక్కడి స్వతంత్రభావాలైనా, దేశభాషలో రూపందాల్చడం ఆరంభమైంది. ఈ సందర్భంలో బుట్రాసు ఎల్ బుస్తానీ అనే క్రైస్తవుడు మొట్టమొదట

ప్రఖ్యాతిపొందాడు. అనేకపుస్తకాలు వ్రాసీ, పత్రికలు ప్రచురించీ, స్తబ్ధత జెందిపోయిన మానవభావప్రపంచంలో కల్లోలం కలిగించా డీయన. స్త్రీపురుషభేదం లేకుండా, జనసామాన్యమంతలోనూ విద్యావ్యాపన ప్రోత్సహించాడు. ఇతనితరువాత అనేకమంది ఇతరమారొనైటులు ఈకార్యంలో పాల్గొన్నారు. యువకులలో తీవ్రమైన సంచలనం ఆరంభమైంది. అదీబ్ ఇషాకు అనే ఆయన యువజనోద్యమంలో ప్రముఖుడు. 1874సం॥రంలో ఇత డొక జాతీయపత్రిక ప్రచురించాడు. ఈజిప్టుదేశానికి పోయి, సుప్రసిద్ధుడైన జమాలుద్దీనువద్ద శుశ్రూష చేశాడు. తరువాత ఫ్రాన్సుకు పోయి, పారిసునగరంనుంచి మరొక పత్రిక ప్రచురించాడు. ఆ తరువాత, పిన్న వయస్సులోనే మరణించాడు. పురుషులతోపాటు స్త్రీలుకూడా ముందంజ వేశారు. 1893 సం॥రంలో హిందునొఫెలు అనే ఆమె స్త్రీలకొరకు పత్రిక స్థాపించింది. తరువాత కొద్దికాలంలోనే స్త్రీలపత్రికలూ, పుస్తకాలూ అనేకంగా అభివృద్ధిఅయాయి.

ఈ పరివర్తనతోబాటు మతవిషయాలలో కూడా జనుల భావాలు మారడం మొదలయింది. ప్రతివిషయాన్నీగురించి ప్రశ్నించే ధోరణి ప్రజలలో కలగడంతోనే, మతవిషయాలలో మాహాత్మ్యం చాలావరకు మాయమవుతుంది. మతంపేరిట, మానవహృదయంలో స్థావరమేర్పరుచుకొన్న మూఢత్వం నాశనమవుతుంది. నవనవోత్తేజం పొందిన సిరియను యువకులు మతవిషయాలన్నింటినీ తీవ్రంగా విమర్శించడ మారంభించారు. "మన ప్రాచ్యదేశాలలో సకలవిషయాలకూ మతమే ఆధారంగా చేయడం గొప్ప పొరబాటు. ఈస్థితి దేశపు భావిదశకు ఆటంకం. ప్రాచ్యదేశాల ఇక్కట్టు లన్నింటికీ మతమే మూలకారణం; మతప్రవక్తలే ముఖ్యకారకులు, అరిష్టదాయకులు" అని వ్రాయడం ఆరంభించారు. దేశంలో సర్వవిషయాలలోనూ సంచలనం కలిగింది.

ఈస్థితిలో (1908 సం॥రం) తుర్కీలో తరుణతురుష్కవిప్లవం కలిగింది. ప్రశంసనీయమైన విప్లవాదర్శాలు తురుష్కసామ్రాజ్యమం

డంతటా వ్యాపించాయి. నిరంకుశుడైన తుర్కీసుల్తాను, గత్యంతరం లేక, ప్రజాస్వామ్యపద్ధతులు ప్రవేశపెట్టడానికి సమ్మతించాడు. తురుష్క సామ్రాజ్యంలో, పార్లమెంటూ, ప్రతినిధివర్గమూ వెలిశాయి. సిరియా జాతీయవాదులు ఈ మార్పుకు సంతోషించారు. నిరంకుశత్వం నిర్మూలమయితే తమ ఆశయాలు సఫలమవుతాయని ఆశించారు. విప్లవోద్యమానికి చేయూత ఇచ్చారు.

కాని తరుణతురుష్కపక్షంలోకూడా, సామ్రాజ్యవాసన నశించలేదు. సామ్రాజ్యపాలనకు అలవాటుపడినవారికి సామ్రాజ్యప్రజలలో కలిగే స్వాతంత్ర్య భావోత్తేజం గోచరించదు. అధికార అహంకారంవల్ల సామ్రాజ్యపాలకులకు హ్రస్వదృష్టి ఏర్పడుతుంది. లోకానికంతకీ ప్రత్యక్షంగా కనపడే విషయాలు వారికి కనపడవు. తురుష్కసామ్రాజ్యవాదులు తమ సామ్రాజ్యంలోని అరబురాష్ట్రాలన్నింటినీ పూర్తిగా తురుష్కం చేయాలని ప్రయత్నించారు. ఆవిధంగా తమ సామ్రాజ్యానికి భంగం ఉండదని యోచించారు. అరబుజాతీయతను అభివృద్ధిజేసే విషయాలన్నిటినీ నిర్మూలంచేయడానికి పూనుకొన్నారు. పాఠశాలలలో అరబుభాష పనికిరాదన్నారు. ప్రజలలో అరబుజాతీయభావాలు ప్రచారం చేయకూడదన్నారు. ఈవిధమైన నిర్బంధ చర్యలవల్ల మొదట తురుష్క ప్రభుత్వానికి కొంత సుముఖంగా ఉన్న సిరియను జాతీయత పూర్తిగా విముఖమైంది. తుర్కీప్రభుత్వంతో తిరిగి ప్రతిఘటనం ప్రారంభమైంది. అరబుస్వాతంత్ర్యవాదులు, దేశంలో నిలవడానికి నీడలేక, దేశాంతరాలలో నివాస మేర్పరుచుకొన్నారు. విదేశాలలో స్వాతంత్ర్యసంఘాలు స్థాపించి అక్కడనుంచి అరేబియాదేశమందంతటా స్వాతంత్ర్యోద్యమప్రచారం సాగించారు. సిరియా, పాలస్తీనులలో అనేకవిప్లవసంఘాలు ఏర్పడ్డాయి. అప్పటికింకా తురుష్కసామ్రాజ్యంలోనుంచి విడిపోవాలనే ఉద్దేశం సిరియా అరబ్బులకు కలగలేదు. కొన్ని షరతులమీదనైతే తుర్కీసామ్రాజ్యంలో ఉండడం వెగటుగా తోచలేదు వారి కప్పటికి. తురుష్కరాజధానితో

*త్తరప్రత్యుత్తరాలవిషయంలో మాత్రం తప్ప మిగతా దేశవ్యవహారా ంన్నీ అరబ్బీభాషలోనే జరగాలన్నారు. స్థానికఅధికారులకు సమ్మతమైన వారినే దేశంలో ఉద్యోగులుగా నియమించా లన్నారు. విదేశవ్యవహా రాలూ, సైనికవిషయాలూ మినహాగా మిగతావిషయా లన్నింటిలోనూ రాష్ట్రస్వపరిపాలన ఉండాలన్నారు. పరిపాలనావిధానం సంస్కరించడానికి తురుష్కం, అరబ్బీభాషలు రెండూ వచ్చిన పాశ్చాత్య ఉద్యోగులను నియమించా లన్నారు. సంస్కరణవిధానం తయారుచేయడంకోసం బెయిరూటు పట్నంలో ఒక సంఘం స్థాపించారు. ఆసంఘంలో 42 మహమ్మదీయులూ, 42 క్రైస్తవులూ, 2 యూదులూ సభ్యులు. స్వపరి పాలన నిమిత్తం, రాష్ట్రీయశాసనసభ ఒకటి స్థాపించాలని వారు నిర్ణ యించారు. వారి తీర్మానాలన్నీ కాగితంమీదవి కాగితంమీదే నిలిచి పోయాయి. 1913 సం॥రంలో ఏప్రిలునెలలో తురుష్కప్రభుత్వంవారు బెయిరూటుపట్నంలోని స్వరాజ్యసంఘం రద్దుచేశారు. పట్నంలో రెండు రోజులు హర్తాలు జరిగింది. హైఫా, జెరూసలంపట్నాలలోని ప్రముఖులు కూడా ఆందోళనలో కలిశారు.

1913 సం॥రం జూనునెలలో అరబుసిరియనుకాంగ్రెసు ఒకటి పారిసునగరంలో (ఫ్రాన్సులో) సమావేశమైంది. పారిసునగరంలోనే నివాసమేర్పరుచుకొని పరాసుదేశమంటే గాఢాభిమానం గల కొందరు సిరియనుప్రముఖులు ఈసమావేశానికి ముఖ్యకారకులు. వీరు తుర్కీ వారితో ఏదోవిధంగా సమాధానపడాలని ప్రయత్నించారు. కాని ఈ ప్రయత్నాన్ని సిరియాలోని ప్రముఖులూ, పత్రికలూకూడా ఆమోదించలేదు. ఇతరవిదేశాలలోని సిరియనులుకూడా ప్రతిఘటించారు.

ఈసమయంలోనే అరేబియాదేశంలోని పెద్దపెద్ద సామంతులలో కూడా జాతీయాభిమానం కలగడం ఆరంభమైంది. తుర్కీవారి పాలనలో నుంచి బయటబడి, అరేబియాదేశమంతా ఏకదేశంగా, స్వరాజ్యం స్థాపించాలనే అభిప్రాయం దేశమంతటా వ్యాపించింది.

మధ్యఅరేబియా స్వాతంత్ర్యప్రియులైన వాహబీలకు నివాసం. ఏవిధమైన పరరాజ్యచిహ్నాలూ వీరు సహించరు. కాని వీరిలో ఐకమత్యం మృగ్యం. చిరకాలంనుంచీ వీరిలో వీరికి కలహాలూ, స్పర్ధలూ అలవాటు. 19 వ శతాబ్దాంతంలో, పరస్పరవైరం గల రెండురాజవంశాలవారు మధ్యఅరేబియాలో పరిపాలన చేస్తూఉండేవారు. దక్షిణంగా ఉన్న నెజ్దు రాజ్యం ప్రాచీన వాహబీరాజవంశంలోని ఇబున్‌సౌదు లనేవారి పాలన లోనూ, ఉత్తరభాగంలో ఉన్న జబెలుషెమ్మారు అనే రాజ్యం ఇబున్ రషీదు వంశంవారి పాలనలోనూ ఉండేవి. రియాదుపట్నం నెజ్దుకూ, హెయిలు నగరం ఉత్తరరాజ్యానికీ రాజధానులు.

19వ శతాబ్దాంతంలో జబెలుషెమ్మారు అమీరు - మహమ్మదు ఇబున్‌రషీదు అనే అతను మధ్యఅరేబియా అంతా స్వాధీనం చేసుకొని, ఇబున్‌సౌదువంశంవారిని దేశాంతరం వెడలగొట్టాడు, కాని 20వ శతాబ్దా రంభంలో, ఆవంశంలోని శూరుడు, అబ్దుల్ అజీజు ఇబున్ అబ్దుల్ రహమాను ఇబున్‌ఫైజలు ఎన్‌సౌదు అనే అతడు అతి సాహసంతో తన పూర్వుల రాజధానిని తిరిగి స్వాధీనంచేసుకొన్నాడు. దీనితో మధ్య అరేబియాలో వాహబీఉద్యమం,దానితోపాటు ఆరబుజాతీయోద్యమం విజృం భించడం ఆరంభమైంది. అబ్దుల్ అజీజు అనే ఈ శూరుడే ప్రకృతంలో చరిత్రప్రసిద్ధుడైన వాహబీపాలకుడు ఇబున్‌సౌదు. ఆరబుదేశ జీవితం సర్వవిధాలా ఉజ్జీవితం చేయడం వాహబీఉద్యమానికి ఆదర్శం. దేశంలో చిరకాలంనుంచీ నిలిచిఉన్న స్పర్ధలూ, కక్షలూ నిర్మూలంచేసి ఆరబుజాతి నంతనీ ఏకజాతిగా చేయాలనినిశ్చయించాడు ఇబున్‌సౌదు. 1913సం॥రంలో పర్షియా సింధుశాఖాతీరంలో, తుర్కీవారి పాలనలో ఉన్న ఎల్‌హాసా రాష్ట్రం జయించి, తన రాజ్యం సముద్రతీరంవరకూ వృద్ధిచేసుకున్నాడు. మధ్యఅరేబియాకు విదేశవ్యాపారసౌకర్యం లభించింది. సముద్రతీరం చేరడంతోనే, అదివరకే ఆప్రాంతాన్ని స్థావరం ఏర్పరుచుకొన్న బ్రిటిషు వారితో సంబంధం కలిగింది.

పై విధంగా ఒక్క నెజ్డురాజ్యంలోనేకాదు ఆరబుజాతీయభావాలు వ్యాపించినది. తుర్కీసుల్తానుల సామ్రాజ్యంలోని ప్రతి ఆరబురాష్ట్రం లోనూ వ్యాపించాయి. ఎర్రసముద్రప్రాంతంలోని ఎమెను ఆసీరురాష్ట్రాలలో ఎడతెగని యుద్ధాలు ఆరంభమయాయి. హెజాజురాష్ట్రానికి ముఖ్య నగరం ముసల్మానులకు ముఖ్యపుణ్యక్షేత్రమైన మక్కాపట్టణం. ఈ నగరపుషరీఫు. హుసెయిను ఇబున్‌అలీ మహమ్మదు ప్రవక్తవంశంలోని వాడు. ఆరేబియాదేశమంతా స్వతంత్రరాజ్యంగా చేయడము, దానికి తాను ఆధిపత్యం వహించడము ఈమొదలైన ఆశలు కలిగాయి అతనిలో. 1913 సం॥రంలో అతనికి సిరియను జాతీయవాదులు మద్దతయారు. తుర్కీమీద తిరగబడి స్వరాజ్యం సంపాదించే యత్నంవిషయంలో హుసెయిను, ఈజిప్టుదేశంలో బ్రిటిషు ప్రతినిధిగా ఉన్న లార్డుకిచనరుతో సంప్రతింపులు ఆరంభించాడు. కాని అప్పట్లో బ్రిటిషువారికి వారితో సఖ్యంగా ఉండవలసిన అవసర ముండడంవల్ల, సంప్రతింపులు సఫలంకాలేదు.

అరేబియాదేశమంతా ఐక్యమై ఒక్కరాజ్యంగా అభివృద్ధిగావడం ఆరంభంనుంచీ ఆరబుజాతీయవాదులకు ముఖ్యాశయం. 1905 సం॥రం లోనే ఆరబుజాతీయసంఘం కిందివిధంగా తీర్మానంచేసింది :

"ఆరబులలో ఉండే అప్రధానమైన చిన్నచిన్న భేదాలన్నీ పెంపొందించి, ఆరబుదేశాలను ఇంతవరకూ తుర్కీవారు పారతంత్ర్యంలో బంధించారు. కాని ఈస్థితి ఇంక నిలవదు. ఆరబ్బులందరికీ 'ఒక్క దేశం, ఒక్క జాతి' అనే భావం గాఢమై, తుర్కీనుంచి విడిపోయి స్వతంత్రంగా వర్ధిల్లడ మనే ఆశయం ముఖ్యమైంది. స్వతంత్రమైన ఈ నూతనఅరేబియా, స్వతహాగా దాని సరిహద్దులవరకూ, టైగ్రిసు యూఫ్రటీసునదీతీరాలనుంచి సూయజుకాలవవరకూ, మధ్యధరాసముద్రం నుంచి ఓమనుసింధుశాఖవరకూ వ్యాపిస్తుంది. ఆరబుసుల్తాను ఆధిపత్యం కింద ప్రజాస్వామికప్రభుత్వం స్థాపించడం మా ఉద్దేశం. ప్రస్తుతపు హెజాజు స్వతంత్రరాష్ట్రంగా ఉంటుంది. దీని పరిపాలకుడే యావత్తు

మహమ్మదీయప్రపంచానికీ ఖలీఫు (మతగురువు) గా ఉంటాడు."

ఆరబుజాతీయవాదుల ఆశయాలు యూరపుయుద్ధంతో సఫలమయే టట్టుగానే కనపడ్డాయి. యుద్ధంలో తుర్కీ బ్రిటనుకు విరోధపక్షం కావడంతోనే అరేబియా ప్రాముఖ్యమైన యుద్ధరంగంగా మారింది. అదివరలో అనేక కారణాలవల్ల తుర్కీతో కయ్యం పెట్టుకోవడం లాభ ప్రదంగా కనపడక బ్రిటిషువారికి సావకాశం చిక్కలేదుకాని, లేకపోతే అరేబియాలో ఆవరకే వారికి స్థావరం ఏర్పడిఉండేది. బ్రిటిషువారి అదృష్టమేమోగాని, ఈ ప్రపంచంలో అనేకదేశాలు వారికి ఏదోవిధంగా అవసరమయే తీరుతాయి. వారి అవసరమంటే ప్రపంచశాంతికి అవసర మన్నమాట వేరే చెప్పనేఅక్కరలేదు. బ్రిటిషువారి ఈ అవసరాలన్నీ దురదృష్టవశాత్తు, వారి పాశాలలో చిక్కిన భారతదేశంమూలంగా తట స్థించడం నిజంగా విషాదకరం. భారతదేశానికి సముద్రమార్గంలో ఉండడంచేత వారికి ఈజిప్టు అవసరం. భూమార్గంలో ఉండడంచేత పాలస్తీను అవసరం. వాయుమార్గంలో ఉండడంచేత, ఇరాకు అవసరం. ఎటు చూచినా, అన్ని అవసరాలూ, ఈ దౌర్భాగ్యభారతదేశం మూలం గానే. బ్రిటిషువారికి అవసరమయితే ఇంక కాదనే నాథు డెవడు ? వారి అవసరాలను ఆమోదించకపోతే, తిరిగి వారు ఇంకొకరి అవసరాలను ఆమోదించవద్దూ ! ఇదీ పాశ్చాత్యప్రభువుల రాజనీతి, ఇప్పటికీని.

బ్రిటిషురాజనీతివేత్తలలో అరేబియానుగురించి కొంత అభిప్రాయ భేదం ఉండేది. అప్పట్లో, భారతదేశంలోనుంచి ఏడెనురాష్ట్రం, పర్షియను సింధుశాఖమీదుగా మెసొపొటేమియాను స్వాధీనంచేసుకొందా మనేవా రొకరు. ఈజిప్టులో స్థిరపడ్డాముగనుక, అక్కడనుంచి ఎర్రసముద్రం, పాలస్తీను, సిరియాలమీదుగా స్వాధీనంచేసుకొందా మనేవా రొకరు. ఈ ఇరుతెగలవారికీ పలుకుబడి ఉంది. రెండుపక్షాలవారికీ గల అభిప్రాయ భేదానికి ఫలితం రెండు ఉద్దేశాలూకూడా సఫలంకావడమే. మొదటి అభిప్రాయం గలవారు యూరపుయుద్ధకాలంలో మధ్యఅరేబియాలోని

వాహబీల అండ జేరారు. కువయిటునగరంలో ఉండే బ్రిటిషుప్రతినిధి ఇబున్‌సౌదుపక్షంలో జెబెలుషెమ్మారు అమీరుతో యుద్ధంచేస్తూ మరణించాడు. పర్షియను సింధుశాఖదగ్గర బ్రిటిషుప్రతినిధి అయిన సర్ పెర్సీకాక్సు, 1916 సం॥రంలో ఇబున్‌సౌదుతో స్నేహం కలిపి ఒడంబడిక ఒకటి చేసుకొన్నాడు. ఈలోగా రెండవపక్షంవారూ ఊరుకోలేదు. వీరి ఎత్తుల ప్రకారం, మహమ్మదీయుల ముఖ్యపుణ్యక్షేత్రాలు - మక్కా, మదీనా, జెరూసలం పట్నాలు వీరి చేతులలోకి రావలసిఉంటుంది. ఇందుచేత వీరు 1915 సం॥రం నుంచీ మక్కా షరీఫు హుసెయినుతో స్నేహం కలిపారు. అప్పట్లో, కెయిరోపట్నంలో 'అరేబియన్‌బ్యూరో' అనే బ్రిటిషుసంస్థ ఒకటి ఉండేది. థామసు లారెన్సు అనే ఆయన అందులో ఒక ప్రధానోద్యోగి. అరేబియా వ్యవహారాలన్నీ ఆమూలాగ్రంగా అవగాహనచేసుకొన్నాడు ఆయన. హుసెయినుతో సంప్రతింపులన్నీ అతని ముఖతానే జరిగాయి. తరువాత, 1921 సం॥రంలో, విన్‌స్టన్ చర్చిలు విదేశాంగమంత్రి అయినప్పుడు, అరేబియా మొదలయిన మధ్యప్రాచ్యదేశాలను గురించి సలహాఇచ్చేకార్యం నిమిత్తం లారెన్సుకు ప్రత్యేకఉద్యోగం ఒకటి కల్పించాడు. బ్రిటిషువారి లాభక్షేమాలు భద్రంగా చూడడంలో చర్చిలు యోధు. మధ్యప్రాచ్యదేశాలలో, ఈజిప్టులగాయతు అరేబియా పర్షియాలను కలుపుకొని, ఇండియాపర్యంతము ఒక్క సామ్రాజ్యం స్థాపించాలని ఈయన ఎత్తువేశాడు. ఈ సామ్రాజ్యానికి బ్రిటిషువారి రక్షణ ఆయువుపట్టు. ఇందుకోసం ఉత్తరాన్ని కాన్‌స్టాంటునోపులును హస్తగతం చేసుకొని, తుర్కీని నామమాత్రంగా చేసి గుప్పిట్లోపెట్టుకోవడం ముఖ్యావసరం. ఈవిధంగా, మధ్యప్రాచ్య సామ్రాజ్యం ఒకటి అడ్డంపెడితే, సర్వనిరంకుశత్వదాహకమైన రష్యావిప్లవభావదావానలం ఇండియాను చుట్టుముట్టకుండా ఉంటుందని ఈయన ఆశ. ఈ సామ్రాజ్య సందర్భంలో బ్రిటిషువారి రాజకార్యాలన్నీ, బ్రిటిషువిదేశాంగమంత్రి స్వయంగా చూచుకోవలసిందేకాని, భారతప్రభుత్వసంబంధ మేమీ ఉండ

కూడదని ఉద్దేశించా డాయన. ఆ సామ్రాజ్యంలో ఉద్యోగాల నిమిత్తం సూడానుసివిలుసర్వీసులో పేరెన్నిక గన్న ఉద్యోగులను సిద్ధంగా అట్టే పెట్టారు. ఇవీ ఈపక్షంవారి ఎత్తులు. ఇబున్ సౌదు, హుసెయినులు విరోధులు. మొదటలో ఇబున్ సౌదుతో ఒకరూ, హుసెయినుతో మరొకరూ స్నేహంకలపడం కొంత ఇబ్బందిగానే కనపడింది. అదృష్ట వశాత్తూ, 1924-25 సం॥రంలో హుసెయినుకు పదచ్యుతి కలిగి అతని ఆశలన్నీ అడుగంటడంతో బ్రిటిషువారికి విరోధుల స్నేహ మనే విషమ స్థితి తప్పింది. రెండుపక్షాలవారి ఎత్తులూ ఏకమై సఫలమయాయి.

## 3

యూరపులో యుద్ధం జరుగుతున్నంతసేపూ బ్రిటిషువారూ, వారి మిత్రులూ మానవజాతికంతకీ ఆదర్శప్రాయమైన ఉన్నతాశయాలు విసుగూ విరామం లేకుండా ఉపన్యసిస్తూనే ఉన్నారు. తాము యుద్ధంలోకి దిగడము కేవలం ప్రపంచంలో ఇంక యుద్ధభయం లేకుండాచేయడాని కనీ, చిన్నాపెద్దాభేదం లేకుండా, బలాబలాలతో సంబంధం లేకుండా, సకలజాతులకూ, దేశాలకూ స్వతంత్ర, స్వరాజ్యప్రదానంకోసమనీ, ఈ మొదలైన విషయాలు ఉపన్యసించారు. ప్రపంచంలో పారతంత్ర్యం అనుభ వించే దేశాలలో (ముఖ్యంగా ఇవి ఈ ఉపన్యాసాలిచ్చిన ప్రభువుల పాలన లోనే ఉన్నాయి.) ఈ ఉపన్యాసకుల ఔదార్యం వేనోళ్ళ నుతించడం మొదలుపెట్టారు. అరేబియాలో స్వాతంత్ర్యంకోసం ఆందోళన అధిక మైంది. తుర్కీసుల్తానులకు వెర్రులెత్తాయి. జాతీయనాయకులను కొందరిని ఉరిదీశారు. దేశంలో ఆందోళన అధికమైనకొద్దీ రాజనీతిచతురులైన పాశ్చాత్యప్రముఖులు మరింత బిగ్గరగా, ఆర్భాటంగా ఉపన్యాసాలు సాగించి అరేబియా పంపకపు ఒడంబడికలు రహస్యంగా మొదలుపెట్టారు. 1916 సం॥రంలో, బ్రిటనుఫ్రాన్సుదేశాల తరఫున, వారి ప్రతినిధులు సర్ మార్కుసైకుస్, జార్జిపికోగార్లు రహస్యంగా ఒక ఒడంబడిక చేసుకొన్నారు.

బస్రాబాగ్దాదు పట్నాలతోసహా దక్షిణభాగమైన ఇరాకు పూర్తిగా బ్రిటిషు వారి అధీనంకావడానికీ, ఏకరుపట్నంలగాయతు అలెగ్జాండ్రట్టావరకూ ఉన్న సముద్రప్రాంత సిరియాదేశభాగమున్నూ, పై లీషియాయున్నూ ఫ్రెంచి వారి అధీనం కావడానికీ ఏర్పాటు. మొదట ఫ్రెంచివారు సిరియాదేశం పూర్తిగా తమకు భుక్తంకావలసిఉంటుం దన్నారు. కాని అది బ్రిటిషు వారికి అపాయకరంగా కనపడింది. ఎప్పుడైనా ఈజిప్టుదేశం తమ చేతులలోనుంచి జారిపోవడం తటస్థిస్తే, సూయజుకాలవను సంరక్షించు కోవడం ఎలాగా అని బెంగపెట్టుకొన్న బ్రిటిషువారికి అరేబియాలో పరాసువారి పొరుగు అపాయకరంగా కనపడింది. పడమట ఈజిప్టు నుంచీ, తూర్పున అరేబియానుంచీ కూడా సూయజుకాలవను సురక్షితంగా చూచుకోవాలని వీరి ప్రయత్నం. ఇంతేకాక, ఇండియాదేశానికి సూయజు కాలవనుంచి సముద్రమార్గమే కాకుండా భూమార్గంకూడా ఒకటి అవసరం. ఇందుకోసం, సూయజుకాలవనుంచి పర్షియా సింధుశాఖవరకూ ఉన్న దేశం వారి స్వాధీనంలో ఉండాలి. ఇందుకు పాలస్తీనును విడదీసి తమ చేతులలో పెట్టుకోవాలి. పాలస్తీనును విడదీయడానికి కారణం వెంటనే దొరికింది. క్రైస్తవులందరికీ అది పవిత్రభూమి. దక్షిణాన్ని గాజా, హెబ్రాను, జెరీకోపట్నాలకూ, ఉత్తరాన్ని ఏకరుపైబీరియసు పట్నాలకూ మధ్య నున్న దేశం అంతర్జాతీయ సంఘంవారి పాలనకు లోబడిఉండాలని నిశ్చయించారు. హైఫా ఏకరురేవుపట్నాలుమాత్రం బ్రిటిషువారి స్వాధీనంలో ఉండడానికీ, అక్కడనుంచి వారు మెసొపొటేమియాకు రైలు మార్గం నిర్మించుకొనే అధికారం ఉండడానికీ ఏర్పాటు. రష్యావారికి కూడా కొంత ముట్టజెప్పడం మరిచిపోకూడ దనుకొన్నారు. కాని అదృష్టం కలిసివచ్చి, కొద్దిలోనే రష్యాదేశం మిత్రమండలినుంచి విడి పోవడం తటస్థించింది. అంతటితో రష్యావారి ముడుపుముప్పు తప్పింది. పాలస్తీను పూర్తిగా బ్రిటిషువారి స్వాధీనంలోకి రావడమే తరువాతిమెట్టు. 1917 సం॥రం నవంబరు 2 వ తేదీని ఇంగ్లీషుమంత్రి బాల్ఫరు

పాలస్తీనునుగురించి ప్రకటన ఒకటి చేశాడు. "పాలస్తీను మొదటినుంచీ యూదులకు జన్మస్థానం. అయినప్పటికీ వారి కీప్రపంచంలో ఎక్కడా 'నా' అన్న స్థలం లేదు. ఈ దురవస్థ తొలగించడం ముఖ్యం. పాలస్తీనులో యూదులకు వసతికల్పించే భారం బ్రిటిషుప్రభుత్వం వహించవలసి వచ్చింది." సామ్రాజ్యపాలకుల పుణ్య మేమిటోగాని, ప్రపంచంలో వీరికి ఎప్పుడు ఎక్కడ కొంత రాజ్యం అవసరమయినా, ఆయాభూములలో, వారి పోషణకు పరితపించిపోయే ప్రజలు పొడగట్టుతూనే ఉంటారు. సిరియాసముద్రతీరంలో (లెబననులో) ఫ్రెంచివారి రక్షణకు పరితపిస్తారు మారొనైట్లు. పాలస్తీనులో నిలవడానికి నీడచూపించవలసిందని బ్రిటిషు వారిని బతిమాలుతారు యూదులు. 1920 సం॥రం ఏప్రిలునెలలో అరేబియా వాటాలు స్థిరపరుచు కోడానికి మిత్రమండలిప్రముఖులు సాన్‌రీమో పట్టణంలో సమావేశమయారు. సిరియా అంతా ఫ్రాన్సుకూ, ఇరాకు ట్రాన్సుజోర్డను పాలస్తీనులు బ్రిటిషువారికీ నిర్ణయించుకొన్నారు.

ఈలోగా బ్రిటిషువారికీ, మక్కా షరీఫు అయిన హుసెయిను ఆలీకీ అరేబియా స్వాతంత్ర్యాన్నిగురించి రాయబారాలూ, రహస్యసంభాషణలూ జరుగుతూనే ఉన్నాయి. యుద్ధం ఆరంభించిన కొత్తలోనే, బ్రిటిషురాజ కార్యధురంధరులు అరేబియాదేశం తుర్కీమీద తిరగబడేటట్టు చేయడానికి ప్రయత్నం ఆరంభించారు. యుద్ధం ముగియడంతోనే అరేబియాదేశానికంతకూ సంపూర్ణస్వాతంత్ర్యం సిద్ధించే ఏర్పాటు చేస్తామనీ, ఆ దేశంలో ఒక్క అంగుళంస్థలమైనా పరుల కెవరికీ చెందకుండాఉండే కట్టుదిట్టం చేస్తామనీ, ఈవిషయాలు సంధిషరతులలో ముఖ్యమైనవిగా ఉంటాయనీ వ్రాసిన కరపత్రాలు విమానాలలోనుంచి అరబుప్రజలలో వెదజల్లారు. హుసెయినుతో చేసిన సంప్రతింపులలో, అరేబియాదేశం తుర్కీవారి బంధంలోనుంచి బయటబడి స్వతంత్రమయితే, అతను అందలమెక్క వచ్చునని ఆశపెట్టారు. నవనాగరికులైన ఇంగ్లీషువారి మాటలన్నీ వేద వాక్యా లనుకొన్నాడు అమాయకుడు హుసెయిను. 1916 సం॥రం

జూన్‌నెలలో తుర్కీవారితో యుద్ధం ప్రకటించి, అరేబియాకు తాను రాజునని ప్రకటించుకొన్నాడు. అప్పట్లో తుర్కీవారిమీద కత్తిగట్టడం మహమ్మదీయు లెవరికీ ఇష్టంలేదు. తాను కేవలం మహమ్మదీయమతం ఉద్ధరించడంకోసమే యుద్ధం ప్రకటించవలసివచ్చిం దన్నాడు హుసెయిను. అరేబియాదేశమంతా ఏకరాజ్యంగా చేసి, అరబుజాతిని పునరుద్ధరించాలనే ఉన్నతాశయం అతనికి లేకపోలేదు. కాని దానితోపాటు తనూ, తన వంశంవారూ అరేబియానంతనూ ఏకచ్ఛత్రంగా ఏలాలనే గాఢాభిలాషా ఉంది. మహమ్మదు ప్రవక్తవంశంలోనివాడు తను. మక్కాపట్నానికి షరీఫు. మహమ్మదీయ దేవస్థానాలన్నింటికీ మహంతు. స్వయంగా పండితుడూను. ఇన్ని లక్షణాలున్నప్పుడు, అరేబియాదేశపు రాజరికమూ, దానితోపాటు మహమ్మదీయమతానికి పీఠాధిపత్యమూ (ఖిలాఫతు) తనకు సంక్రమించడంకంటే సబబు మరేముందనుకొన్నాడు. అసలు మహమ్మదు అరబుదేశస్థుడు. ఆయన స్థాపించిన గురుపీఠం మక్కాలో మహమ్మదు వంశంలో ఉండాలికానీ, కేవలం పరాయివారైన తుర్కీసుల్తానుల స్వాధీనంలో ఉండడం ఏమిన్యాయం? అంతటితో చాలాకాలంనుంచి ఉన్న ఆ అన్యాయం అంతమవుతుందని సంతోషించాడు. తన సంతోషంలో, ఆధునికరాజకీయవివేచన విసర్జించి, పూర్తిగా బ్రిటిషువారిని నమ్మాడు. వారి వాగ్దానాలలో వెర్రివిశ్వాసం పెట్టుకొన్నాడు. 1916 సంగరం నవంబరు 4 వ తేదీని యథావిధిగా హుసెయిను అరేబియారాజ్యపట్టాభిషేక మహోత్సవం చేసుకొన్నాడు. అతని సేనలు బ్రిటిషువారి సేనలతో కలిసి, తుర్కీవారిని అరేబియాదేశంనుంచి వెడలగొట్టడానికి సహాయపడ్డాయి.

1917 సంవత్సరంతో అరేబియాలో తుర్కీవారి యాజమాన్యం అఖరైంది. ఆసంవత్సరం మార్చినెలలో బాగ్దాదునగరం ఇంగ్లీషువారు స్వాధీనంచేసుకొన్నారు. బాగ్దాదులో ప్రవేశించడంతోనే, ఆ పట్టణపు ప్రజల నుద్దేశించి, బ్రిటిషుసైన్యాధిపతి ఈవిధంగా ప్రకటించాడు: "మీకు పారతంత్ర్యబంధం తగల్బడం బ్రిటిషువారి అభీష్టమని మీరు అనుకో

కూడదు. చిరకాలంనుంచి నెరవేరకుండా ఉన్న మీ మహాపురుషుల ఉన్నతాశయాలన్నీ ఇంక నెరవేరుతాయనీ, పవిత్రమైన మీ ఆశయాలకు అనుగుణమైనపాలనపద్ధతులలో మీరు ధనధాన్యసంపదలతో తులదూగుతూ మీ పూర్వోన్నత్యం తిరిగిపొందుతారనీ బ్రిటిషువారు ఆశిస్తున్నారు. ఘనులైన అరబ్బులు పడ్డ ఇక్కట్టులు వృథాకాకూడదని నిశ్చయించారు. అరబుజాతి యావత్తూ ఒక్కటిగా ఐక్యమై తిరిగి తన పూర్వోన్నత్యం పొందడమే బ్రిటిషువారికీ, వారి మిత్రులందరికీ గల ముఖ్యమైన కోరిక." ఈవిధంగా ప్రసంగించిన బ్రిటిషుసైన్యాధిపతి, అప్పటికే అమలులోఉన్న సైక్సు-పికో అరేబియా వాటాలజాబితాలో బాగ్దాదుప్రజలను ఏవాటాలో వేశారో మాత్రం వెల్లడించలేదు.

1917 సం॥రం డిశంబరు 9 వ తేదీని బ్రిటిషుసైన్యాధిపతి జనరలు అలెనుబీ జెరూసలంనగరంలో ప్రవేశించాడు. దీనితో ఇంచుమించు అరేబియారాజ్యంలో ప్రధానభాగమంతా 'పాశ్చాత్య మిత్రమండలిస్వాధీనమైంది. ఒకమూల అరేబియాదేశాన్ని ముక్క-ముక్క-లుగా విభాగం చేసుకొంటూ కూడా, అరబుస్వాతంత్ర్యమనీ, స్వరాజ్యమనీ ప్రసంగించడం మట్టుకు కట్టిపెట్టలేదు మిత్రమండలి ప్రముఖులు. 1918 సం॥రం నవంబరు 8 వ తేదీని, బ్రిటిషువారూ, ఫ్రెంచివారూ కలిసి చేసిన ప్రకటనలోకూడా "ఇంతవరకూ తుర్కీవారి పారతంత్ర్యబంధంలో పీడింపబడ్డ ప్రజలను పూర్తిగా విముక్తిజేసి, వారు అభిలషించి ఆమోదించే రాజ్యాంగవిధానం ఏర్పాటుచేస్తాము"అని, రవంతైనా సంశయానికి ఆస్పదంలేకుండా వాగ్దానం చేశారు.

1918 సం॥రం అక్టోబరు 1 వ తేదీని హుసెయిను ఆలీకుమారుడు ఫైజలు అరబుసైన్యంతో డమాస్కసుపట్నంలో ప్రవేశించాడు. డమాస్కసు సిరియారాష్ట్రానికి ముఖ్యపట్నం. అతి ప్రాచీనమైనది. తుర్కీవారి సామ్రాజ్యం అంతటితో పూర్తిగా విచ్ఛిన్నమైంది. ఫైజలు దూరదృష్టి గలవాడు. సిరియాదేశపు ఆనుపానులెరిగినవాడు. ప్రజల స్వాతంత్ర్య

భావాలకు విరుద్ధంగా ప్రవర్తించక వారి ప్రేమకు పాత్రుడయాడు. తన ఆధిపత్యం కింద సిరియాలో ప్రభుత్వం నెలకొలిపాడు. సిరియావారినే అన్ని పదవులకూ నియమించాడు.

1918 సంవత్సరంతో యూరపుయుద్ధం ముగిసింది. విజయులైన మిత్రమండలివారు సర్వసన్నాహంతోనూ వర్సైయిల్సునగరంలో సంధి సంభాషణలు ప్రారంభించారు. ఫైజలు హెజాజురాజ్యప్రతినిధిగా సంధి సమావేశానికి హాజరయాడు. తన తండ్రితో బ్రిటిషువారు చేసుకొన్న ఒడంబడిక చూపించాడు. తదనుసారంగా అరబురాష్ట్రాలన్నీ ఏకరాజ్యంగా చేయవలసిందని వాదించాడు. డమాస్కసు ప్రజలంతా ఫైజలుప్రాతినిధ్యంలో పూర్ణవిశ్వాసం వెల్లడించారు. లెబననువాసులైన మారొనైట్లు మాత్రం తమకు ఫ్రెంచివారి రక్షణ అవసరమన్నారు. భిన్నాభిప్రాయం కనపడుతోంది గనుక, సిరియాదేశం వెళ్ళి అక్కడి ప్రజల అభీష్టం ఏవిధంగా ఉంటుందో తెలుసుకొనేనిమిత్తం ఒక సంఘం ఏర్పాటుచేశారు సంధిసంఘపు పెద్దలు. ప్రజల అభీష్టం ఏవిధంగా ఉంటుందో బ్రిటిషు వారికీ, ఫ్రెంచివారికీ తెలియునుగా. విచారణసంఘంలో సభ్యులుగా ఉండమని నిరాకరించారు. అమెరికాదేశస్థులు ఇద్దరుమాత్రం విచారణకు బయలుదేరారు.

# సిరియా

1919 సం॥రం మేనెలలో ఫైజలు స్వదేశానికి తిరిగివచ్చి, సిరియా దేశానికి రాజ్యాంగవిధానం ఒకటి తయారుచేసే ప్రయత్నం చేశాడు. అరేబియా దేశమంతా ఒకటే అయినప్పటికీ, వివిధరాష్ట్రాల స్వాతంత్ర్యానికి భంగం కలుగదని ప్రకటించాడు. సిరియాకు రాజ్యాంగవిధానం తయారుచేయడంకోసం సిరియను నేషనలు కాంగ్రెసు ఒకటి సమావేశమవుతుందని ప్రకటించి, కాంగ్రెసుకు ప్రతినిధులను ఎన్నుకోవలసిందన్నాడు. పశ్చిమాన్ని సముద్రప్రాంతమైన లెబననులో స్థావరం ఏర్పరుచుకొన్న ఫ్రెంచివారు ఆ ప్రాంతంలో ఎన్నికలు జరగనియ్యలేదు. దక్షిణాన్ని పాలస్తీను స్వాధీనంచేసుకొన్న బ్రిటిషువారు ఆ ప్రాంతంలో ఎన్నికలు జరగనియ్యలేదు. మిగతా దేశమందంతటా ఎన్నికలు జరిగాయి. 1919 సం॥రం జూలై 20 వ తేదీని కాంగ్రెసు డమాస్కసుపట్నంలో సమావేశమైంది. యావత్తు సిరియాదేశానికీ, సరియైన, న్యాయసమ్మతమైన ప్రాతినిధ్యం కాంగ్రెసుకు ఉందని ప్రతినిధులు ప్రకటించారు. జూలై 2 వ తేదీని వర్సెయిల్సుసంధిసంఘం నియమించిన విచారణసంఘంలోని అమెరికను సభ్యులకు సిరియాకు గల హక్కులనూ, అభీష్టాలనూ గురించి తాము చేసిన తీర్మానం నివేదించారు.

"సిరియాలో, అన్నిజిల్లాలలోనూ, సకలమతముల ప్రజలూ, సక్రమంగా ఎన్నుకొన్న సిరియను కాంగ్రెసు ప్రతినిధులమైన మేము, సిరియాదేశ పరిపాలనవిషయంలో మాప్రజాభీష్టం మీకు నివేదింపగోరుతున్నాము.

(1) ఉత్తరాన్ని టారసుపర్వతాలు, దక్షిణం రాఫేఅల్‌జూఫ్ నుంచి అకాబాకు నిదానంగా గేటు ; తూర్పు, యూఫ్రటీస్‌కాబూరునదులు, అబూకమల్ నుంచి ఆల్‌జూఫ్‌వరకూ నిదానపు గేటు ; పశ్చిమం మధ్యధరా సముద్రం ; ఈహద్దులలో నున్న యావత్తు సిరియాదేశానికీ సంపూర్ణ

స్వాతంత్ర్యము, ఈ దేశానికి ఫైజలురాజుగా పార్లమెంటరీ ప్రభుత్వము ఏర్పరచాలి.

(2) యూరపుఖండంలోని బల్గేరియనులు, సర్వియనులు మొదలైన చిన్నచిన్న జాతులకంటె మేము తీసిపోయిన దేమీ లేదు. వారంతా సంపూర్ణస్వాతంత్ర్యానికి అర్హులనీ, ఒక్క మేముమాత్రం అర్హులము కామనీ ఎంచి, మాకు కొంతకాలం పాశ్చాత్యప్రభుత్వాల సలహా, పోషణా అవసరమని లీగ్ ఆఫ్ నేషన్సువారు (అంతర్జాతీయసమితి) సిద్ధాంతంచేయడం కేవలం అక్రమం. అయినప్పటికీ, ఒకవేళ మాబుద్ధికి గ్రాహ్యంకాని కారణాలవల్ల పరప్రభుత్వపు పోషణ మాకు తప్పదని అంతర్జాతీయసమితి అభిప్రాయపడే యెడల. సదరు పోషణపేరుమీదుగా మాస్వాతంత్ర్యానికి భంగంకలిగే పరిస్థితు లేవీ కల్పించడం వారి ఉద్దేశం కాదని నమ్ముతున్నాము. ఆసందర్భంలో, ఇతరదేశాలను ఆక్రమించాలన్న తృష్ణ లేని యునైటెడుస్టేట్సు (అమెరికాసంయుక్తరాష్ట్రాలు) ప్రభుత్వంతో సంబంధముమాత్రమే మేము వాంఛిస్తాము. అమెరికావారికి అంగీకారం కాని సందర్భంలో బ్రిటిషువారి రక్షణకు ఒప్పుకొంటాము. ఏసందర్భంలోనూ కూడా ఈ పోషణ అనేది 20 సంవత్సరాల గడువుకు పైబడకూడదు. మాదేశంలో ఫ్రాన్సుదేశానికి ఏవిధమైన హక్కులూ లేవు. అలా ఉన్నాయన్న వేవీ చెల్లదగినవి కావు. మాకూ, ఫ్రాన్సుదేశానికీ ఏవిధమైన సంబంధమూ ఉండకూడదు.

(3) దక్షిణంలో, స్వతహాగా సిరియాదేశంలో అంతర్భాగమైన పాలస్తీనును, యూదుల జన్మస్థానమని పేరుపెట్టి, మాదేశంలోనుంచి విడదీసే ప్రయత్నం కేవలం అక్రమము. దక్షిణాన్ని పాలస్తీనునుగాని, తూర్పున సముద్రతీరాన్ని లెబనన్నుగాని సిరియానుంచి విడదీయకూడదని కోరుతున్నాము.

(4) మెసొపొటేమియాకు కూడా సంపూర్ణస్వాతంత్ర్యం ఇవ్వాలనీ, ఆ దేశానికీ సిరియాకూ ఆర్థికవ్యవహారాలలో అడ్డంకు లేవీ కల్పించకూడదనీ కోరుతున్నాము."

సిరియాప్రజాభిప్రాయం గురించి విచారించిన అమెరికనుసభ్యు లిద్దరూ దేశంలోని నిజస్థితి గ్రహించారు. దేశవాసులెవరూ ఇతర ప్రభుత్వ రక్షణకు ఏమాత్రమూ అంగీకరించడం లేదని వ్రాశారు. కాని, బ్రిటిషు ఫ్రెంచి రాజనీతికోవిదులకు వీరి విచారణతో సంబంధ మేముంది? సంధి సంఘంలో నాథులు వారేగా. అమెరికన్ ప్రెసిడెంటు విల్సనుగారిని ఆవరకే బుట్టలో వేశారు. చివరకు ఒక్క సిరియావిషయంలోమాత్రమే కాకుండా, వారు తలచిన అన్నికార్యాలలోనూకూడా వారు వేసిన ఎత్తులన్నీ సఫలమయాయి.

1919 సం॥రం డిశంబరులో ఫైజలు కాంగ్రెసుసమావేశం నిలుపుజేశాడు. అప్పట్లో డమాస్కసుపట్నం పూర్తిగా సిరియావారి స్వాధీనంలోనే ఉంది. దేశంలో జాతీయసైన్యం సమకూర్చడం ఆరంభించారు. మార్చినెల 6వ తేదీని సిరియనుకాంగ్రెసు తిరిగీ సమావేశమైంది. ఏకగ్రీవంగా సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానం ఆమోదించారు. మార్చి 8వ తేదీని ఫైజలు సిరియాదేశానికి రాజు అని ప్రకటించారు. సంపూర్ణ స్వాతంత్ర్యసూత్రంమీద రాజ్యాంగవిధానం ఒకటి తయారుచేసి అమలులోనికి తెచ్చారు. మంత్రివర్గం ఒకటి ఏర్పడింది. దేశానికి సైరోఅరబు రాజ్యమని నామకరణం చేశారు. రాజధాని డమాస్కసునగరం. ప్రభుత్వ వ్యవహారాలన్నింటికీ భాష అరబ్బీ, మతం ఇస్లాము. రాజు హుసెయిను వంశీయుడు. దేశంలో సర్వాధికారమూ పార్లమెంటుది. ప్రజాప్రతినిధుల సభ, పెద్దల సభ రెండూ కలిసి పార్లమెంటు. ఏతీర్మానమైనాసరే, రెండు పర్యాయాలుగనుక పార్లమెంటులో ఆమోదింపబడినట్లయితే, దానిని నిరాకరించడానికి రాజుకు వీలులేదు. రెండుసభలకూ భేదాభిప్రాయం కలిగినప్పుడు ప్రజాప్రతినిధుల సభదే తుదిమాట. మంత్రివర్గం ప్రజాప్రతినిధుల సభకు లోబడిఉంటుంది. ఈవిధంగా రాజ్యాంగవిధానం తయారుచేసి, దేశంలో స్వరాజ్యం స్థాపించుకొందామని ఆశపడ్డారు సిరియనుజాతీయవాదులు. కాని పాశ్చాత్యప్రభుత్వాల జోక్యం లేకుండాఉండడ మేలాగు?

కాన్‌స్టిట్యూషను కాగితంమీదనే నిలిచిపోయింది. ఆచరణలోకి వచ్చే భాగ్యం పట్టలేదు. 1920 సం॥రం ఏప్రిలునెలలో, సాన్‌రీమోనగరంలో మిత్రమండలిప్రముఖులు సమావేశమై, పాలస్తీనును బ్రిటిషువారికి మినహాయించి మిగతా సిరియాదేశమంతా ఫ్రెంచివారికి అప్పజెప్పారు. అప్పట్లో జనరలు గౌరాడుగారు సిరియాలో ఫ్రెంచిహైకమిషనరు. ఫ్రెంచివారి ఆధిపత్యం అంగీకరించమని ఆయన తక్షణం ఫైజలుకు తాఖీదు పంపించాడు. ఫైజలు కొంచెం మెత్తపడ్డాడు, కాని కాంగ్రెసు తిరస్కరించింది. ఫ్రెంచివారు వెంటనే సేనలను నడిపించారు. జూలై 24 వ తేదీని సిరియనుయుద్ధమంత్రి యూసఫ్‌ఎల్‌అజ్మీగారి నాయకత్వంకింద అరబుసైన్యం ఒకటి ఫ్రెంచివారిని అడ్డగించడానికి ప్రయత్నంచేసింది. యుద్ధంలో నాయకుడు హతుడయాడు. సిరియనుసైన్యం ఓడిపోయింది. విజయధ్వానాలతో పరాసువారు డమాస్కసునగరంలో ప్రవేశించారు. ఫైజలురాజు పారిపోయాడు. సిరియా పూర్తిగా ఫ్రెంచివారి వశమైంది.

## 2

సామ్రాజ్యతృష్ణాపీడితులు, ఏదేశంవారైనా, ఏకాలంలోవారైనా, వారి చర్యలన్నీ ఒకేమాదిరిగా ఉంటాయి. ఫ్రెంచివారు సిరియాను స్వాధీనంచేసుకోవడంతోనే, అతినేర్పుతో, దేశంలో లేనికక్షలు కల్పించడం ఆరంభించారు. జాతీయభావోద్వేగంలో నశింపనైఉన్న మత విద్వేషా లన్నిటికీ ప్రాణం పోశారు. ఉన్నతాశయాలతో ఏకంకానున్న దేశాన్ని ముక్కముక్కలు చేసి వివిధభాగాలకు విద్వేషాలు కల్పించారు. సర్వవ్యవహారాలలోనూ పశుబలన్యాయమే ప్రాధాన్యం చేశారు. ఆధునిక నిరంకుశసాధనాలన్నీ వినియోగించి పరిపాలన సాగించారు. అదివరలో, ఫ్రెంచివారే దిక్కని మొర్రపెట్టిన మారొనైట్లకుకూడా ఫ్రెంచిపరిపాలనా సౌభాగ్యం మొగంమొత్తింది. లెబనను ప్రముఖులలో చాలామంది ఫ్రెంచి పరిపాలనాపీడ అంతంకావాలనీ, సిరియాతో ఐక్యంకావాలనీ తీర్మానం చేశారు. పరిపాలకులు వారందరినీ అరెస్టుచేసి, దేశాంతరం వెళ్లగొట్టారు.

1920 సం॥రం సెప్టెంబరు 1వ తేదీని 'గ్రేటులెబనను' అనే నామధేయంతో ఒక రాజ్యం కల్పించారు. తమకు వంగివంగి సలాములు చేసే కొందరిని సంపాదించి ఒక పరిపాలకసంఘం ఏర్పరిచారు. జనరలు గౌరౌడు ఆ మహారాజ్యాన్ని అట్టహాసంగా ఆశీర్వదించాడు. "మీ దేశానికి పెట్టని గోడై సర్వవిధాలా రక్షిస్తూఉన్న ఈ మహాపర్వతసాన్నిధ్యంలో అతిప్రాచీనకాలంలో గ్రీసు, రోము, ఫీనీసియాదేశమహోన్నత వైభవాలతో సాహచర్యం సలిపి, తిరిగీ ఈనాడు అత్యుదారమైన పరాసు పోషణభాగ్యం పొందగలిగిన ఈ సముద్రప్రాంతంలో పేరెన్నికగన్న ఫ్రెంచి ప్రజాస్వామికప్రభుత్వంపేరిట గ్రేటులెబనను రాజ్యరమకు వందనం చేస్తున్నాను" అని ఉపన్యసించాడు. ఒక ఫ్రెంచిగవర్నరూ, అనేకమంది ఫ్రెంచిసలహాదారులూ సిద్ధమయారు. నిరంతరకక్షలకు అనుకూలంగా ఉండేటట్టుగా సిరియాలోని మహమ్మదీయజిల్లాలను కొన్నిటిని కలిపి, ఆరుఏడులక్షల జనాభా గల ఆ నూతనమహారాజ్యం పాలించడం ఆరంభించారు. ఫ్రెంచిసామ్రాజ్యధురంధరులు ఒక్క గ్రేటులెబనను నూతన రాజ్యం సృష్టించడంతో సంతృప్తిపొందలేదు. లెబననురాజ్యానికి ఉత్తరంగాఉన్న సముద్రప్రాంతభాగము ఆ ప్రాంతవాసులైన అలావీల స్వతంత్రరాజ్య మన్నారు. దానికి ఉత్తరంగా ఇంకా మిగిలిన సముద్రప్రాంతం అలెగ్జాండ్రట్టా పట్టణసంబంధమైన స్వతంత్రరాజ్య మన్నారు. ఈవిధంగా దేశం విచ్ఛిన్నంచేసి, సముద్రతీరంతో సంబంధం లేకుండా చేసి, మిగిలిన సిరియా మండుఎడారిలో మాసిపోయే ప్రయత్నం చేశారు. చివరకు సిరియా అంతర్భాగంలోకూడా విడివిడిరాజ్యాలు కల్పించారు. డమాస్కసుపట్టణప్రాంతం ఒక రాజ్య మన్నారు. అలెప్పోపట్టణప్రాంతం ఒక రాజ్యమన్నారు. సిరియాదేశంలో ఏ 50 వేలమందికి లోపుగానో ఉన్న డ్రూజులనేవారిని లేవదీసి, జబెల్ఎడ్‌డ్రూజు అని వారి కొక స్వతంత్రరాజ్యం సృష్టించారు. అన్నిరాజ్యాలలోనూ తమకు దాసోహమనే ఉద్యోగులను నియమించి, పరిపాలన దేశీయుల పరమే అన్నారు.

పనికిమాలిన శాసనసభలను సృష్టించి ప్రజాస్వామికపద్ధతులలో తరిఫీదు చేస్తున్నా మన్నారు.

ఈరీతిగా నడిచింది సిరియాదేశ జీవితం 1924 సం॥రం వరకూను. దేశాన్ని సంరక్షించే భారం తలమీద పెట్టుకొన్న పరాసువారు సైనిక దళాలతో దేశమంతా నింపివేశారు. దేశక్షేమంతోనూ, సౌభాగ్యంతోనూ ప్రసక్తి వారి కెందుకు? ఫ్రాన్సుదేశపు ధనికుల లాభక్షేమాలుగాని వారికి కావలసినది! ఇందుకోసం సిరియాదేశం ఉపయోగపడడం ఆరంభమైంది. దేశంలో వ్యాపారపరిశ్రమలు అడుగంటాయి. ఫ్రెంచివారి వ్యాపారం దేశంలో మూలమూలలకు వ్యాపించింది. బంగారపునాణాలూ, చలామణీ భ్రష్టమై, విలువ తరిగిపోయిన ఫ్రెంచివారి కాగితపునోట్లు దేశంలో ప్రత్యక్షమయాయి. దేశభాష నశించి, ఫ్రెంచిభాష సుస్థిరమయే యత్నం సాగించారు. సిరియాదేశపు వ్యక్తిత్వం నశించి, ఫ్రాన్సుదేశంలో లీనమై పోవాలని ఆశించారు. కాని, ప్రజాహృదయంలో తాండవించే స్వాతంత్ర్య రూపం గుర్తెరుగలేని అధికారమత్తుల ఆశలన్నీ చివరకు నిరాశలుకాక తీరదు. పరాసునిరంకుశపాలకుల వివిధనిర్బంధచర్యలవల్ల 1925సం॥రంలో సిరియాదేశంలో విప్లవదావానలం ప్రజ్వరిల్లింది. 1924 సంవత్సరాంతంలో అంతవరకూ హైకమిషనరుగా ఉన్న జనరలు వెయిగౌండును ఇంటికి రమ్మని, ఫ్రెంచిప్రభుత్వంవారు, జనరలు సర్రెయిలును అతని స్థానే నియమించారు. అదివరలోని హైకమిషనరులకంటె సర్రెయిలు కొంత నయం. దేశంలోని అరబ్బులతో సఖ్యం కుదరనిది, లాభం లేదని గ్రహించాడు ఆయన. కొంతవరకైనా వారిని ఊ- అనిపిస్తేనేగాని దేశంలో చిరకాలం రాజ్యంచేయడం దుస్తరమని తెలుసుకొన్నాడు. అంత వరకూ విడదీసి పాలిస్తూఉన్న డమాస్కసు అలెప్పోరాష్ట్రాలు రెండూ ఏకంచేశాడు. రాజకీయఖైదీలను చాలామందిని విడుదలచేయించాడు. కాని సర్రెయిలయినా, సిరియా అంటే ఫ్రెంచివారి సొత్తు అనే భావించి పరిపాలించడానికి ప్రయత్నించాడు కాని సిరియాప్రజల అభీష్టంఅనుసరించి

వ్యవహరించలేదు. అలా వ్యవహరించడం అతనికి సాధ్యమూ కాదు.

సిరియాజాతీయవిప్లవం 1925 సం॥రంలో ఆరంభమైంది. సిరియా దేశానికి ఆగ్నేయసరిహద్దులో ఉన్న డ్రూజుపర్వతభూములలో అంకురించింది. ఈ పర్వతప్రాంతంలో సుమారు 50,000 మంది డ్రూజులనేవారు నివసిస్తారు. 1921 సం॥రంలో వారికి వేరే రాజ్యం కల్పించే సందర్భంలో ఫ్రెంచివారు వారితో ఒక సంధి చేసుకొన్నారు. దాని షరతులప్రకారం ఆ రాజ్యానికి డ్రూజుదేశీయుడే గవర్నరుగా ఉండాలి. మొదట డ్రూజు గవర్నరునే ఎన్నుకోనిచ్చారు. కాని అతను చనిపోయినతరువాత ఫ్రెంచి గవర్నరును నియమించారు. అతనంటే ప్రజల కిష్టంలేక, అతనిని తీసివేసి డ్రూజుగవర్నరును నియమించవలసిందని కోరడానికి కొందరు ప్రముఖులు సర్రెయిలును దర్శించారు. వారి మాటలు ఆయనచెవి కెక్కలేదు. పైగా, కొందరిని రప్పించి అరెస్టుచేయించాడు.

1925 సం॥రం జూలైలో డ్రూజునాయకుడైన సుల్తానుపాషా ఎల్అత్రాషీనాయకత్వంకింద సాగింది విప్లవం. కేవలం డ్రూజులు వారికున్న ఏవో కష్టనిష్ఠూరాలకోసం సాగించిన విప్లవం కాదు అది. కొద్దిలోనే దేశమంతా పాకి సిరియాజాతీయ విప్లవమైంది. జనసామాన్యమంతా విప్లవంలో పాల్గొన్నారు. కొద్దికాలంలోనే డ్రూజుసైనికులు ముఖ్యపట్నమైన ఎస్సులేడాను స్వాధీనంచేసుకొని అక్కడ ఫ్రెంచిసైన్యాన్ని ముట్టడించారు. వారి సహాయంకోసం సాగిన మూడువేలమంది ఫ్రెంచిసైనికులను నాశనంచేశారు. దానితో దేశంలో అపూర్వమైన విజయోత్సాహం ప్రబలింది. ఆగస్టు 26 వ తేదీని సుల్తానుపాషా డమాస్కసుపట్నంమీద దాడివెడలాడు. ఆపట్నంలో అంతక్రితమే ఏర్పడిన ప్రజాపక్షం అతనికి సాయపడింది. ప్రజాపక్షనాయకు లందరినీ ఫ్రెంచివారు అరెస్టుచేశారు. కాని ముఖ్యనాయకుడైన డాక్టరుషాబందరు కొంతమంది అనుచరులతో జెబెలు డ్రూజురాజ్యంలోకి తప్పించుకొనిపోయాడు. ఈ డాక్టరు అబ్దుల్ రహమాన్షాబందరు అదివరలో ఫైజలురాజుప్రభుత్వంలో విదేశాంగ

మంత్రిగా పనిచేశాడు. తరువాత ఫ్రెంచివారి హయాములో రాజద్రోహ-నేరంకింద ఆయనకు ఇరవై సంవత్సరాలు శిక్షవేశారు. ఆపిమ్మట రాజకీయ ఖైదీలను విడుదలచేసినప్పుడు ఆయనను కూడా వదిలిపెట్టారు. షాబందరు డ్రూజురాజ్యంలో ప్రవేశించిన తరువాత అక్కడ స్వరాజ్యప్రభుత్వం స్థాపించాడు. యావత్తు సిరియాదేశానికీ సంపూర్ణస్వాతంత్ర్యం లభించే పర్యంతమూ స్వాతంత్ర్యసమరం సాగించవలసిందని ప్రజలను హెచ్చ రించాడు. ప్రజలలో స్వాతంత్ర్యవాంఛ ప్రబలమైంది. దేశమందంతటా నూతనఉత్సాహం వెల్లివిరిసింది. ఆరునెల లయేసరికి ఒక్క లెబనను రాజ్యంతప్ప మిగిలిన సిరియాదేశమంతా విప్లవకారులకు స్వాధీనమైంది. పెద్దపెద్ద పట్నాలుకూడా వారి స్వాధీనమయేటట్టు కనపడింది. డమాస్కసు పట్నం మూడురోజులపాటు పూర్తిగా జాతీయసేనల స్వాధీనంలో ఉంది. కాని, యుద్ధనిపుణతగాని, నవీనమారణసాధనసంపత్తిగాని లేని విప్లవ కారులు ఆధునికయుద్ధరంగంలో ఎంతకాలం నిలబడగలుగుతారు? అయి నప్పటికీ, ముందుగా దేశంలో ఏర్పాటులన్నీ కట్టుదిట్టంచేసుకొనిఉండి, యుద్ధం సాగించిఉండేటట్టయితే ఫ్రెంచిపరిపాలన పూర్తిగా రూపుమాసి పోయేదే. ఫ్రెంచివారు ముప్పతిప్పలూ పడి, చివరకు ఏలాగయితేనేమి దేశం స్వాధీనంచేసుకోగలిగారు. నవీనమారణసాధనాలన్నీ ఉపయో గించారు. 1925 సం॥రం అక్టోబరు 18 మొదలు 21 వరకూ ఆకాశంలో నుంచీ, నేలమీదినుంచీకూడా డమాస్కసుపట్నంమీద అగ్నివర్షం కురి పించారు. అతిప్రాచీనమైన ఆ సుప్రసిద్ధపట్టణం ఫ్రెంచినిరంకుశపాలకుల చేతులలో నాశనమయింది. దేశంలో తాము పెంచిన మతవిద్వేషాలు సహాయంగా తీసుకొని వారు ఒకరిచేత ఒకరిని నరికించడానికి ప్రయత్నం చేశారు. మొదటినుంచీకూడా విప్లవంమాట బయటప్రపంచంలో పొక్క కుండా, అన్నిరకాల కట్టుబాట్లూ చేశారు. పత్రికలలో వార్తలు ప్రచురించ నీయలేదు. దేశంలోనివారిని బయటికీ, బయటివారిని లోనికీ పోనీయ లేదు. దేశంలోని జనులంతా ప్రశాంతంగా కాలంగడుపుతున్నారనీ, వారికీ

రాజ్యపుగొడవలు ఏమీ అక్కరలేదనీ, కొద్దిమంది ఆందోళకులూ, దుండగీడులూ ప్రేరేపించిన అల్లరులుగాని మరేమీ ముప్పులేదనీ ప్రకటించారు. నిరంకుశత్వదాహకమైన విప్లవాగ్నిహోత్రాన్ని అప్రకటనమూలంగా కప్పిపుచ్చాలని చూచారు. యావచ్ఛక్తినీ వినియోగించి, సకలవిధయత్నాలూ సలిపి, ఘడియలమీద విప్లవం అణిచివేసి, దేశంలో వచ్చిన అపాయమేమీ లేదని చూపించడానికి నానాతంటాలూ పడ్డారు. కాని సాధ్యంకాలేదు. రెండుసంవత్సరాలు పట్టింది, విప్లవం పూర్తిగా అణిగిపోయి, పరాసు ప్రభుత్వం సిరియాలో తిరిగి స్థిరపడడానికి. 1927 సం॥రం జూన్ నెలలో సుల్తానుపాషాఅత్రాషీ కొందరు అనుచరులతో మధ్యఅరేబియాలోకి తప్పించుకొనిపోయాడు. అంతవరకూ యుద్ధరంగంగానే ఉంది సిరియాదేశం.

1925 సం॥రం ఆఖరున సర్రెయిలును ఉద్యోగంలోనుంచి తొలగించి, అతనిస్థానే, ఫ్రెంచివారు, హెన్రీడీజౌవలును పంపారు. ఈ నూతనహైకమిషనరు సైనికసంప్రదాయంలోనివాడు కాడు. దేశంలో ప్రబలిన అశాంతి, అల్లరీ మూకలచేతలు కావని గ్రహించాడు. పారతంత్ర్యపీడితులైన మానవులలో స్వాతంత్ర్యవాయువులు పీల్చి జీవించడానికి ప్రబలిన విప్లవకల్లోలమని గుర్తించాడు. జాతీయవాదులతో సంప్రతించి శాంతి స్థాపించాలని ఉద్దేశించాడు. అతను రావడంతోనే, ముందుగా లెబననులో ప్రజాస్వామ్యపద్ధతులను ప్రవేశపెడతానని ప్రకటించి, హడావడిగా, ఒక రాజ్యాంగవిధానము, శాసనసభలు, మంత్రివర్గమూ సృష్టించాడు. ఆయువుపట్టుమాత్రం తన చేతులలో ఆట్టే పెట్టుకొన్నాడు. ఆమాదిరిగానే, మసిబూసి నేరేడుకాయజేసి, సిరియాను సంతోషపెట్టాలని ప్రయత్నించాడు. ప్రజాపక్షానికి చెందిన ప్రముఖులను విడుదలచేసి, వారిని కూడగట్టుకోవాలని చూచాడు. కాని వారు షరతులుపెట్టారు. రాజకీయ ఖైదీల నందరినీ విడుదలచేసి సిరియాదేశపు సంపూర్ణస్వాతంత్ర్యం అంగీకరించా లన్నారు. సంపూర్ణస్వాతంత్ర్యసూత్రంమీద సిరియాతో ఫ్రాన్సు

సంధిచేసుకొని, అంతర్జాతీయసమితిలో సిరియాకు సభ్యత్వం లభించే ఏర్పాటు చేయా లన్నారు. పూర్వపు లెబనను ఒక్కటిమినహాగా మిగిలిన సిరియానంతనూ ఏకంచేయా లన్నారు. ఫ్రెంచిప్రతినిధికి ఈ షరతులు అంగీకారంకాలేదు. ఫ్రెంచివారే కొంతకాలం స్వయంగా పరిపాలన సాగించారు. తరువాత అహమదునామీబే అనే తురుష్కుని ప్రధాన మంత్రిగా నియమించారు. కాని అతను పెట్టిన షరతులైనా, పై వాటికి ఆట్టే తీసిపోలేదు. ఆరునెలల కాపురంతో, ముఖ్యవిషయాల్ల సందర్భంలో సిరియనుజాతీయవాదులలో భేదాభిప్రాయం లేకపోవడం డిజౌవల్ గారికి విశదమైంది. దేశంలోని నిజస్థితి ఫ్రాన్సుప్రభుత్వానికి తెలియజేశాడు. 1926 సం॥రం వేసవిలో కొందరు సిరియను జాతీయవాదప్రముఖులతో పారిసునగరంలో సంప్రతింపులు జరిపాడు. కొద్దిలోనే సమాధానం కుదిరి, శాంతి సమకూరేటట్టే కనపడింది. కాని అంతలో ఫ్రెంచి గవర్నమెంటు అడ్డపడి సంధిసంప్రతింపులకు స్వస్తిచెప్పారు. డిజౌవలు రాజీనామా ఇచ్చాడు. హెన్రీపోన్సో అనేఆయన హైకమిషనరుగా నియమితు డయాడు.

నూతనహైకమిషనరు విప్లవం అణిగిపోయేవరకూ మాటాడకుండా ఊరుకొన్నాడు. 1927 సం॥రం జూలై 26 వ తేదీని సంస్కరణాలు కొన్ని ప్రకటించాడు. కాని అవి ఎవరికీ అంగీకారంకాలేదు. కొద్దిలోనే నిజస్థితి గ్రహించాడు హైకమిషనరు. ప్రజాభిప్రాయం మన్నించక తప్పదని, పారిసునగరంలోని ఫ్రెంచిసామ్రాజ్యపాలకులకు నచ్చజెప్పాడు. సిరియనుజాతీయవాదులలో మితవాదులు కొందరు బెయిరూటులో సమావేశమై హైకమిషనరుతో సంప్రతించారు.

1928 సం॥రం ఫిబ్రవరిలో అహమదునామీబే మంత్రివర్గం రాజీనామా దాఖలుచేసింది. టాజ్ఎడ్దీను అనే ఆయన మితవాదప్రముఖులు కొందరితో మంత్రివర్గం ఏర్పాటుచేశాడు. చాలాకాలంనుంచి దేశంలో అమలులోఉన్న సైనికశాసనమూ, పత్రికానిర్బంధమూ తొలగించి, కొద్ది

మంది ప్రముఖులు మినహాగా మిగిలిన రాజకీయఖైదీల నందరినీ విడుదల చేశారు. ప్రజాభీష్టానుసారం సిరియాదేశానికి స్వతంత్రరాజ్యాంగవిధానం తయారుచేసుకోడానికి అసెంబ్లీ ఒకటి ఏర్పరచి, దానికి ప్రతినిధులను ఎన్నుకోవలసిం దన్నారు (1928 సం॥రం మార్చి 10). తమ అదుపాజ్ఞలకు లోబడరని తోచిన జాతీయవాదుల నెవరినీ ఎన్నుకోకుండాచేయడానికి ప్రభుత్వంవారు సాధ్యమైన ప్రయత్నమంతా చేశారు. ఎన్నికలు జరిగాయి. శాసనసభ పూర్తిగా జాతీయవాదుల వశమైంది. జూన్ 9 వ తేదీని సభ డమాస్కసులో సమావేశమైంది. రాజ్యాంగవిధానం తయారుచేయడానికి ఉపసంఘం ఒకటి నియమించారు. రాజ్యాంగవిధానం ఆగస్టు 2 తేదీకి తయారైంది. సిరియాదేశం సంపూర్ణంగా స్వతంత్రమైన దేశమనే మూల సూత్రం ఆధారంగా చేసుకొని సిద్ధంచేశారు రాజ్యాంగవిధానం. ఫ్రెంచి వారి మాటగాని, వారికి ఉందనే పోషణహక్కుమాటగాని అందులో ఎత్తలేదు. తుర్కీసామ్రాజ్యకాలంనుంచీ ఏకరాజ్యంగా ఉండి, ఆసామ్రాజ్యం విచ్ఛిన్నమయినపుడు ఏకరాజ్యంగానే విడిపోయిన దేశం ఇప్పటికీ ఏక దేశమే అనీ, ఇటీవల అంతర్దేశాలు సృష్టించి దేశాన్ని ముక్కముక్కలుగా చేసిన చట్టాలన్నీ రద్దనీ తీర్మానించారు. రిపబ్లికు ప్రెసిడెంటుకు రాజకీయ ఖైదీలనందరినీ విడుదలచేయగల అధికార మిచ్చారు. విదేశాలతో ఒడంబడికలు చేసుకోవడము, ఆదేశాలలో సిరియాదేశపు రాయబారులను నియమించడము, ప్రధానమంత్రిని నియమించడము, సైనికశాసనం ప్రకటించడము, దేశసంరక్షణకు సైన్యం అభివృద్ధిచేయడము ఈమొదలైన అధికారాలన్నీ ప్రెసిడెంటుకు ఇచ్చారు. ఈవిధంగా సిద్ధంచేసిన రాజ్యాంగవిధానం ఫ్రెంచివారికి ఎలా అంగీకారమవుతుంది ? ఫ్రెంచి వారి సర్వాధికారం గమనించి, తదనుసారంగా పై అంశాలన్నీ మార్చవలసిందని హైకమిషనరు ఉత్తరువుచేశాడు. ఉత్తరువు అంగీకరిస్తే బాగుంటుం దన్నాడు ప్రధానమంత్రి. ప్రతినిధులుమాత్రం ఎవరూ వినలేదు. దానిమీద ఆగష్టు 11 వ తేదీని, మూడునెలలవరకూ

అసెంబ్లీ నిలుపుచేయడమైందని హైకమిషనరు హుకుము జారీచేశాడు. కొందరితో సంప్రతించి చూచాడు. లాభంలేదని గ్రహించి, కాలనియమం లేకుండా, అసెంబ్లీని నిలుపుచేశానన్నాడు. చివరకు ఒకమాట చెప్పాడు. కాన్‌స్టిట్యూషనులో మార్పులేమీ చేయనక్కరలేదుగాని. చివరమట్టుకు "సిరియాదేశాన్ని రక్షించే భారం ఫ్రెంచివారిమీద ఉండే పర్యంతమూ, వారి రక్షణబాధ్యతకు భంగకరమయేరీతిగా కాన్‌స్టిట్యూషనులోని ఏఅంశమూ ఉపయోగపడకూడదు" అని మాత్రం వ్రాయమన్నాడు. ప్రజాప్రతినిధులు సమ్మతించలేదు. సభను రద్దుచేశా నన్నాడు హైకమిషనరు. ఈలోగా ఫ్రెంచివారు పుట్టెడాస పెట్టుకొన్న లెబనను రాజ్యంలోకూడా జాతీయాందోళన తీవ్రమైంది.

చివరకు 1930 సంవత్సరం మే 22వ తేదీని ఫ్రెంచివారు సిరియను ప్రజాప్రతినిధులు తయారుచేసిన రాజ్యాంగవిధానం హైకమిషనరు సూచించిన పైషరతుతో కలిపి అమలులోకి తెచ్చారు. వారు కలిపిన షరతు సిరియాస్వాతంత్ర్యానికి ప్రతిబంధకమే అనడం నిస్సంశయం.అయినప్పటికీ ఈరాజ్యాంగవిధానంవల్ల ఫ్రెంచివారికి సిరియాదేశపు సంపూర్ణస్వాతంత్ర్య మాత్రం అంగీకరించక తప్పిందికాదు. రాజ్యాంగవిధానపత్రంలో సిరియాదేశం సంపూర్ణస్వాతంత్ర్యం గల ప్రజాస్వామ్యరాజ్య మన్న అంశం మొదటిది. సిరియారిపబ్లికుప్రెసిడెంటు మహమ్మదీయుడై ఉండాలని ఏర్పాటు. అరబుజాతీయపతాకమే దేశపతాకం. సర్వాధికారమూ ప్రజది. ప్రజాప్రతినిధుల సభ ఒక్కటేగాని దానిపైన పెద్దలసభ పెట్టుకోలేదు సిరియావారు. ఇరవై సంవత్సరాల వయస్సుకు పైబడ్డ ప్రతిపురుషునికీ వోటింగుహక్కు ఉంది. రిపబ్లికుప్రెసిడెంటును అయిదుసంవత్సరాల కొకసారి ప్రజాప్రతినిధుల సభలోనుంచి ఎన్నుకొంటారు. ప్రెసిడెంటుకు పరిపాలనలో జోక్యంకలుగజేసుకొనే అధికారం లేదు. మంత్రివర్గం శాసనసభాతీర్మానానికి బద్ధమైఉండాలి. వ్యాపారాదివిషయాల కిచ్చే ప్రోత్సాహ్యాలూ, దేశఋణాలూ మొదలైనవాటి కన్నింటికీ శాసనసభలో అనుజ్ఞ

పొందాలి. స్త్రీ పురుషవిచక్షణ లేకుండా యావన్మంది సిరియనులకూ ప్రాథమికవిద్య నిర్బంధం; ఉచితం. సిరియాలో ఈ కాన్‌స్టిట్యూషను ప్రవేశపెట్టడంతోపాటు ఫ్రెంచివారు సృష్టించిన ఇతరరాజ్యాలలోకూడా నూతనరాజ్యాంగవిధానాలు ప్రవేశపెట్టారు. కాని వాటికీ, సిరియనురాజ్యాంగ విధానానికీ ఎక్కడా పోలికలేదు. చిరకాలంనుంచీ తమ్మాశ్రయిస్తూఉన్న లెబననువిషయంలో అంగీకరించకపోయినప్పటికీ, కత్తికట్టి దెబ్బలాడిన సిరియనుల స్వాతంత్ర్యంమాత్రం అంగీకరించక తప్పిందికాదు.

ఫ్రెంచివారు తమకై తయారుచేసిన నామమాత్రపు రాజ్యాంగ విధానంవల్ల లెబననువాసులు సంతృప్తి చెందలేదు. వారిలో జాతీయాందోళన హెచ్చింది. పరాసువారు అది సహించక, అసలు రాజ్యాంగ విధానమే తీసివేసి, నిరంకుశపరిపాలన సాగించారు.

సిరియనుజాతీయవాదులు మొదటినుంచీ ఫ్రెంచివారి పోషణ హక్కును ప్రతిఘటిస్తూనేఉన్నారు. సిరియాను సంపూర్ణస్వాతంత్ర్యం గల దేశంగా అంగీకరించి, దానితో ఫ్రాన్సుదేశం ప్రత్యేకపు ఒడంబడిక ఒకటి చేసుకోవాలనీ, సిరియాదేశానికి అంతర్జాతీయసమితిలో సభ్యత్వం లభించేటట్లు చేయాలనీ వారి కోరిక. పయిని వివరించిన రాజ్యాంగవిధానం అంగీకరించిన పరాసువారికి ఈ షరతులు అంత కటువుగా ఉండవనడం నిశ్చయం. ఇది కాక సిరియాలో ఫ్రెంచివారి చర్య ఇరాకులో బ్రిటిషవారి చర్యను అనుసరించి ఉండకతప్పదు. ఇరాకుదేశం ఇటీవలనే సంపూర్ణ స్వతంత్రరాజ్యంగా వెలిసి అంతర్జాతీయసమితిలో సభ్యత్వం సంపాదించ గలిగింది. దీనితో సిరియాలో ఆందోళన అధికమైంది.

1933 సం॥రం ఆఖరున పాతహైకమిషనరు హెన్రీపోన్సో వెళ్ళిపోయి, ఆయనస్థానే ఎమ్ డి మార్టెల్ అనేఆయన వచ్చాడు. ఈయన వచ్చినతరువాత, ఈమధ్యనే (1934 ఫిబ్రవరి), సిరియాదేశంతో తాము నూతనంగా ఒక సంధి చేసుకొంటామని ప్రకటించాడు. సిరియా సంపూర్ణంగా స్వతంత్రమై అంతర్జాతీయసమితిలో ప్రవేశించడానికి నాలుగు

సంవత్సరాలు గడుపుపెట్టారు. సిరియనుజాతీయాశయాలను ఫ్రెంచివారు చాలావరకు ఆమోదించవలసి వచ్చినప్పటికీ, ఒక్క ముఖ్యవిషయంలో మాత్రం సిరియనుజాతీయాదర్శం వారి ఆమోదం పొందలేదు. సిరియావారం దరికీ వారి దేశమంతా ఏకరాజ్యం కావడం ముఖ్యాశయం. 1930 రాజ్యాంగ విధానంలో సిరియాలో అదివరకు జరిగిన విభాగాలన్నీ రద్దని ఉదాహరించారు. కాని ఫ్రెంచివారు దానిని తొలగించి 'సిరియాదేశం అవిభాజ్యమైన ఏకరాజ్యము' అనే సంశయాస్పదమైన మాటలు చేర్చారు.

ఈమధ్య తయారుచేసిన కొత్త ఒడంబడికలో కూడా సిరియాదేశం పూర్తిగా ఏకంకాలేదు. ఇందుచేత సిరియనుజాతీయవాదులు ఈ కొత్త ఒడంబడికను ఆమోదించలేదు. సిరియను పార్లమెంటులో ఒడంబడికను త్రోసిపుచ్చడానికి ప్రయత్నం చేశారు. దానితో హైకమిషనరు ఒడంబడికను ఉపసంహరించుకొని, పార్లమెంటుసభను నిలుపుచేశాడు. ప్రధానమంత్రి అయిన హక్కియాబేను కూడగట్టుకొని, ప్రజాభిప్రాయం సుముఖంగా చేసుకోడానికి ప్రయత్నంచేస్తున్నాడు.

సిరియాదేశం సంపూర్ణంగా స్వతంత్రంకావడానికి మరికొంతకాలం పట్టవచ్చు. సిరియాదేశమంతా ఒక్క రాజ్యంగా ఐక్యమయితేనేగాని సిరియనుల ముఖ్యాశయం సఫలంకాదు. దానితోపాటు ఫ్రెంచివారి రక్షణ అనే దాస్యచిహ్నం పూర్తిగా మాసిపోవాలి. దేశంలో జాతీయాభిమానం గాఢమైనకొద్దీ ఈ పరిణామం కలుగకతీరదు.

# పాలస్తీను

పాలస్తీను సిరియాదేశంలో అంతర్భాగమనీ, దానిని సిరియానుంచి విడదీయకూడదనీ సిరియనుజాతీయవాదులు వాదించినప్పటికీ, పాశ్చాత్య ప్రభుత్వాల రాజతంత్రంవల్ల ఇది స్వతంత్రరాజ్య మైంది. ఇది చాలా చిన్న దేశం. జనసంఖ్య మొత్తం పదిలక్షలకు లోపు. పూర్వకాలంలో, క్రీస్తు పుట్టిననాడు యూదులకు (జ్యూలకు) జన్మస్థానం. సుమారు రెండు వేలసంవత్సరాలకిందట జీససుజీవితచరిత్రతో, ఈ చిన్న దేశంలో క్రైస్తవ మతం ఉద్భవించింది. మహమ్మదీయమతప్రాబల్యం హెచ్చినతరువాత పూర్తిగా మహమ్మదీయుల వశమైంది. యూదుమతానికీ, క్రైస్తవమతానికీ కూడా జన్మస్థానమైన ఈ చిన్నదేశం అప్పటినుంచీ నేటివరకూ మహమ్మదీయుల స్వాధీనంలోనే ఉంది. క్రమంగా మహమ్మదీయులకు కూడా పుణ్యస్థాన మైంది. క్రైస్తవులకు పవిత్రభూమి అయిన ఈ దేశం మతాంతరులైన ముసల్మానుల చేతులలోనుంచి తప్పించడంకోసం మధ్యశతాబ్దులలో, యూరపుఖండంలోని క్రైస్తవరాజ్యాలవారందరూ విశ్వప్రయత్నం చేశారు. ఈ భూమికోసం ముసల్మానులకూ, క్రైస్తవులకూ నిరంతరంగా యుద్ధాలు జరిగాయి. జీససుప్రేమామృతవృష్టిచేత పునీతమైన భూమి ద్వేషక్రౌర్యవిషపాతంవల్ల రక్తసిక్తమైపోయింది. తోడిమానవులను-ఒక్క మానవులనేకాదు, యావత్తు సృష్టినీకూడా తన కౌగిలిలో ఇముడ్చుకోవడానికి పరితపించే పవిత్రప్రేమకు ఆలవాలము మతం. ఇంతే కాదు. ఈ ప్రేమకు మినహాగా, మతమనేది మరొకటి ఏమీ లేదు. కాని విపరీత పరిస్థితులవల్ల, మామూలుగా, మత మనే ప్రతిదానిలోనూ లోపించేదే ఇది. కనుకనే, మతంపేరిట మానవుడు మూఢుడై, అహంకారపూరితుడై, రక్తపిపాసితుడైన రాక్షసు డవుతాడు. ఈ ప్రపంచంలో, మతంపేరుమీదుగా, పవిత్రమైన మానవరక్తం ఎంత ప్రవహించింది! ఎంత ప్రవహిస్తోంది! శుష్కించి, నిర్జీవమై, శల్యప్రాయమైపోయిన, అర్థవిహీనమైన ఛిన్నభిన్న

ఆచారకర్మకాండాదులే మతాలై, మానవుని పట్టి పీడించి, మన్నలుపెట్టారు. అతని మనస్స్వాతంత్ర్యం నశింపజేస్తూన్నంతకాలమూ తప్పక్రకటన దురవస్థ. ఈ రాక్షసక్రీడ. మా

పాశ్చాత్యరాజనీతివేత్తల దేశాలపంపకంలో పాలస్తీను బ్రిటిషువారి వాటాకు వచ్చింది. బ్రిటిషువారి సామ్రాజ్యతృష్ణకు యూదుల జాతీయవాంఛ పురస్కృతమైంది. యూరపు యుద్ధానికి పూర్వంనుంచీ ప్రపంచంలో వివిధదేశాలలో ఉన్న యూదులలో, వారికి ఆదిమనివాసస్థానమైన పాలస్తీనును తిరిగి తమ దేశంగా చేసుకోవాలనే ఉద్యమం ఒకటి బయలుదేరింది. ఈ ప్రపంచంలో మొత్తం సుమారుగా 1,30,00,000 మంది యూదు లున్నారు. ఇందులో 40 లక్షలు రష్యాలోనూ, 20 లక్షలు పోలండులోనూ, ఒక పదిలక్షలు పూర్వపు హంగరీరాజ్యంలోనూ ఉన్నారు. లండను, బెర్లిను, న్యూయార్కు మొదలైన పెద్దపట్నాలలో చాలామంది యూదు లున్నారు. ఒక్క న్యూయార్కుపట్నంలో 17 లక్ష లున్నారు. యూదులు ఏదేశంలో ఉన్నా, ఇంతవరకూ ఒక ప్రత్యేకజాతిగానే నిలిచిపోయారు. వెళ్ళినచోటల్లా, వారు వ్యాపారాదివిషయాలలో ప్రాముఖ్యత వహించారు. ప్రస్తుతంలో ప్రపంచవిఖ్యాతి గన్న కోటీశ్వరులలో అనేకులు యూదులు. మతసాంఘికాది వివిధకారణాలవల్ల వీరు అనేక దేశాలలో అనేకఇక్కట్టులు పడ్డారు. ఈ మధ్య జర్మనీలో జరిగిన విషయం దీనికి తార్కాణం.

యూరపుయుద్ధానికి పూర్వమే అనేకమంది యూదులు అనేకదేశాలనుంచి పాలస్తీనుకు ప్రయాణమైపోయి, అక్కడ భూవసతి సంపాదించి, వ్యవసాయకులై, స్థిరనివాసం ఏర్పరుచుకోవడం మొదలుపెట్టారు. అనేక యూదుగ్రామాలూ, పట్టణాలూ ఏర్పడడం ఆరంభమైంది. ప్రారంభంలో థియొడోర్ హెర్జల్ అనేఆయన ఈ ఉద్యమానికి (జయొనిస్టుఉద్యమం) నాయకుడు. గతశతాబ్దంఆఖరున బస్లేపట్టణంలో సమావేశమైన ప్రథమ జయొనిస్టుకాంగ్రెసులో "పాలస్తీనులో యూదులకు శాసనసమ్మతమైన

# పాలస్తీను

పాలస్తీను సిరియాదేశంలో అంతర్భాగమనీ, దానిని సిరియానుంచి విడదీయకూడదనీ సిరియనుజాతీయవాదులు వాదించినప్పటికీ, పాశ్చాత్య ప్రభుత్వాల రాజతంత్రంవల్ల ఇది స్వతంత్రరాజ్య మైంది. ఇది చాలా చిన్న దేశం. జనసంఖ్య మొత్తం పదిలక్షలకు లోపు. పూర్వకాలంలో, క్రీస్తు పుట్టినినాడు యూదులకు (జ్యూలకు) జన్మస్థానం. సుమారు రెండు వేలసంవత్సరాలకిందట జీససుజీవితచరిత్రతో, ఈ చిన్న దేశంలో క్రైస్తవ మతం ఉద్భవించింది. మహమ్మదీయమతప్రాబల్యం హెచ్చినతరువాత పూర్తిగా మహమ్మదీయుల వశమైంది. యూదుమతానికీ, క్రైస్తవమతానికీ కూడా జన్మస్థానమైన ఈ చిన్నదేశం అప్పటినుంచీ నేటివరకూ మహమ్మదీయుల స్వాధీనంలోనే ఉంది. క్రమంగా మహమ్మదీయులకు కూడా పుణ్యస్థాన మైంది. క్రైస్తవులకు పవిత్రభూమి అయిన ఈ దేశం మతాంతరులైన ముసల్మానుల చేతులలోనుంచి తప్పించడంకోసం మధ్యశతాబ్దులలో, యూరపుఖండంలోని క్రైస్తవరాజ్యాలవారందరూ విశ్వప్రయత్నం చేశారు. ఈ భూమికోసం ముసల్మానులకూ, క్రైస్తవులకూ నిరంతరంగా యుద్ధాలు జరిగాయి. జీససుప్రేమామృతవృష్టిచేత పునీతమైన భూమి ద్వేషక్రౌర్యవిషపాతంవల్ల రక్తసిక్తమైపోయింది. తోడిమానవులను- ఒక్క మానవులనేకాదు, యావత్తు సృష్టినీకూడా తన కౌగిలిలో ఇముడ్చుకోవడానికి పరితపించే పవిత్రప్రేమకు ఆలవాలము మతం. ఇంతే కాదు. ఈ ప్రేమకు మినహాగా, మతమనేది మరొకటి ఏమీ లేదు. కాని విపరీత పరిస్థితులవల్ల,' మామూలుగా, మత మనే ప్రతిదానిలోనూ లోపించేదే ఇది. కనుకనే, మతంపేరిట మానవుడు మూఢుడై, అహంకారపూరితుడై, రక్తపిపాసితుడైన రాక్షసు డవుతాడు. ఈ ప్రపంచంలో, మతంపేరుమీదుగా, పవిత్రమైన మానవరక్తం ఎంత ప్రవహించింది! ఎంత ప్రవహిస్తోంది! శుష్కించి, నిర్జీవమై, శల్యప్రాయమైపోయిన, అర్థవిహీనమైన భిన్నభిన్న

ఆచారకర్మకాండాదులే మతాలై, మానవుని పట్టి పీడించి, మహత్తరమైన అతని మనస్స్వాతంత్ర్యం నశింపజేస్తూన్నంతకాలమూ తప్పదు ఈ దురవస్థ, ఈ రాక్షసక్రీడ.

పాశ్చాత్యరాజనీతివేత్తల దేశాలపంపకంలో పాలస్తీను బ్రిటిషువారి వాటాకు వచ్చింది. బ్రిటిషువారి సామ్రాజ్యతృష్ణకు యూదుల జాతీయవాంఛ పురస్కృతమైంది. యూరపు యుద్ధానికి పూర్వంనుంచీ ప్రపంచంలో వివిధదేశాలలో ఉన్న యూదులలో, వారికి ఆదిమనివాసస్థానమైన పాలస్తీనును తిరిగి తమ దేశంగా చేసుకోవాలనే ఉద్యమం ఒకటి బయలుదేరింది. ఈ ప్రపంచంలో మొత్తం సుమారుగా 1,30,00,000 మంది యూదు లున్నారు. ఇందులో 40 లక్షలు రష్యాలోనూ, 20 లక్షలు పోలండులోనూ, ఒక పదిలక్షలు పూర్వపు హంగరీరాజ్యంలోనూ ఉన్నారు. లండను, బెర్లిను, న్యూయార్కు మొదలైన పెద్దపట్నాలలో చాలామంది యూదు లున్నారు. ఒక్క న్యూయార్కుపట్నంలో 17 లక్ష లున్నారు. యూదులు ఏదేశంలో ఉన్నా, ఇంతవరకూ ఒక ప్రత్యేకజాతిగానే నిలిచిపోయారు. వెళ్ళినచోటల్లా, వారు వ్యాపారాదివిషయాలలో ప్రాముఖ్యత వహించారు. ప్రస్తుతంలో ప్రపంచ విఖ్యాతి గన్న కోటీశ్వరులలో అనేకులు యూదులు. మతసాంఘికాది వివిధకారణాలవల్ల వీరు అనేక దేశాలలో అనేకఇక్కట్టులు పడ్డారు. ఈ మధ్య జర్మనీలో జరిగిన విషయం దీనికి తార్కాణం.

యూరపుయుద్ధానికి పూర్వమే అనేకమంది యూదులు అనేకదేశాలనుంచి పాలస్తీనుకు ప్రయాణమైపోయి, అక్కడ భూవసతి సంపాదించి, వ్యవసాయకులై, స్థిరనివాసం ఏర్పరుచుకోవడం మొదలుపెట్టారు. అనేక యూదుగ్రామాలూ, పట్టణాలూ ఏర్పడడం ఆరంభమైంది. ప్రారంభంలో థియొడోర్ హెర్జల్ అనేఆయన ఈ ఉద్యమానికి (జయోనిస్టుఉద్యమం) నాయకుడు. గతశతాబ్దంఆఖరున బస్లేపట్టణంలో సమావేశమైన ప్రథమ జయోనిస్టుకాంగ్రెసులో "పాలస్తీనులో యూదులకు శాసనసమ్మతమైన

వసతి కల్పించడం ఉద్దేశము" అని నిర్ణయించుకొన్నారు. ఈ ఉద్దేశ సాఫల్యంనిమిత్తం ప్రపంచమందంతటా వేరువేరు దేశాలలో విడిపోయిన యూదులందరిలోనూ సంఘీభావం కలిగింది. దీనితోపాటు వారిలో ఒక నూతన జాతీయ ఉత్సాహమూ, వికాసమూ కలిగాయి. నశించిపోనున్న యూదుభాష పునర్జీవితమైంది. సర్వవిషయాలలోనూ యూదుల ప్రత్యేక విశేషం వ్యక్తంకాదొడగింది. యూదుజాతీయత అభివృద్ధికావడానికి పాల స్తీను వారి దేశం కావడం అవసరమన్న నిశ్చయం కలిగింది.

యూరపుయుద్ధకాలంనాటికి సుమారు 12 వేలమంది యూదులు కొత్తగా దేశంలో స్థిరపడ్డారు. వెళ్ళినకొత్తలో వారు నానాకష్టాలూ పడ్డారు. అంతా వ్యవసాయవృత్తినే అవలంబించారు. వ్యవసాయంవల్ల జీవితం గడపడం దుస్తరమయేదే. కాని రాత్సుఛైల్డువంటి సుప్రసిద్ధకోటీశ్వరులు పుష్కలంగా ధనసహాయం చేసి, ఉద్యమాన్ని పోషించారు. యుద్ధానికి పూర్వంపాలస్తీనులో ఉన్న మొత్తంయూదుల సంఖ్య ఒకలక్షకు మించిలేదు.

గతయూరపుయుద్ధంతో, ప్రపంచంలోని ఇతరపారతంత్ర్య ప్రజల తోపాటుగానే, యూదులలోకూడా తమ ఆశయాలు సఫలమయే కాలం ఆసన్నమైందనే ఆశ కలిగింది. యూదుప్రముఖులు తమ ఉద్యమాన్ని గురించి పాశ్చాత్యదేశాలలో విస్తారంగా ప్రచారంచేశారు. అంతక్రితం, ఇరవై ఏళ్ళనుంచి ప్రచారంచేస్తూఉన్నప్పటికీ వారి ఉద్యమం సఫలమయే మార్గం కనపడలేదు. కాని, యూరపు యుద్ధంపుణ్యమా అంటూ, యూదు రసాయనశాస్త్రజ్ఞుడైన డాక్టరు వైజుమను పరిశోధనానిపుణశమూలంగా, పరుల సొమ్ము ధారపోయడంలో బ్రిటిషుమంత్రిపుంగవులు చూపిన ఔదార్యంవల్ల యూదుల ఆశయాలు ఒక్కసారి సఫలంకావడానికి మార్గం దొరికింది.

యూరపుయుద్ధం జరిగిన మొదటిలో జర్మనీవారు ప్రచండంగా విజృంభించారు. అప్పట్లో మిత్రమండలివారు ఓడిపోవడం తప్పదన్ననిరాశ బ్రిటనుదేశంలోకూడా ప్రబలింది. యుద్ధరంగంలో, ఇంగ్లీషువారి సేనలకు

మందుగుండుసామగ్రి చాలా తక్కువైంది. ఆకొరత తీర్చడానికి, సుప్రసిద్ధుడైన లాయడుజార్జి ప్రత్యేకమంత్రిత్వం వహించి, సర్వశక్తులూ ధారవోసి పుష్కలంగా యుద్ధసామగ్రి తయారుచేయించడానికి పూనుకొన్నాడు. మందుసామగ్రి తయారుచేయడంలో యాసిటోను అనే ఒక పదార్థం ముఖ్యావసరము. దీని ఉత్పత్తికి విస్తారంగా కలప కావలసిఉంటుంది. యుద్ధానికి పూర్వం ఇంగ్లీషువారికికావలసిన కలప విదేశాలనుంచి దిగుమతి చేసుకొనేవారు. కాని యుద్ధసమయంలో ఇతరదేశాలనుంచి తెప్పించుకోవడం అసాధ్యమైంది. ఇంగ్లాండుదేశంలో ఇందుకు కావలసిన కలప తక్కువ. ఇందుచేత యాసిటోను ఉత్పత్తిచేయడానికీ, మందుసామాను తయారుచేయడానికీగొప్పఆటంకం కలిగింది. లాయడుజార్జి ఒక మిత్రుని సలహా అడిగాడు. ఆయన మాన్‌ఛెస్టరు విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా ఉన్న డాక్టరు వైజుమనుతో ఆలోచించవలసిందని సలహా ఇచ్చాడు. డాక్టరు వైజుమను యూదుప్రముఖుడు. వెంటనే ఆయనను పిలిపించి, యాసిటోను ఉత్పత్తి చేయడానికి కలిగిన అభ్యంతరం ఆయనకు తెలియజేశాడు. కలపతో సంబంధం లేకుండా, యాసిటోను తయారుచేసే ఉపాయం ఆలోచించమన్నాడు. ఆయన పరిశోధన చేయడానికి కొన్నిరోజులు గడువుకోరాడు. రాత్రింబవళ్లు పరిశోధనలుచేసి, కొద్దిరోజులలోనే వైజుమను కృతార్థుడయ్యాడు. కలపఅవసరం లేకుండా యాసిటోను ఉత్పత్తిచేయడానికి నూతనపద్ధతి ఒకటి కనుగొని లాయడుజార్జి తెలియజేశాడు. పుష్కలంగా మందుసామగ్రి తయారుచేయడానికి సాధ్యమైంది.

ఆపత్సమయంలో సహాయపడిన వైజుమనుకు లాయడుజార్జి దేశపు కృతజ్ఞత వెల్లడించి, గొప్పబిరుదు స్వీకరించాలని కోరాడు. బిరుదులూ, పతకాలూ ఆ యూదుప్రముఖుడు ఆశించలేదు. ఏదోవిధంగా దేశపు కృతజ్ఞత వెల్లడించడానికి అవకాశం చూపించవలసిందని లాయడుజార్జి అడిగాడు. అయితే, పాలస్తీను విషయంలో యూదుల ఆశయం సఫలంకావడానికి తగిన సహాయం చేయవలసిందని కోరాడు వైజుమను.

బ్రిటిషుమంత్రి సరే అన్నాడు.

అదివరకే పాలస్తీనుమీద బ్రిటిషువారి కన్ను పడింది. సైక్సు-పికో వాటాలపంపకంలో పాలస్తీనువిషయం ఆవరకే కట్టుదిట్టంచేసుకొన్నారు. ఇప్పుడు యూదుల జాతీయవాంఛ ఒకటి సమయానుకూలంగా దొరికింది. 1917 సం॥రం నవంబరు 2 వ తేదీని బ్రిటిషుగవర్నమెంటు తరఫున బాల్ఫరుమంత్రి యూదులకు పాలస్తీనులో వసతికల్పించడం అవసరమని ప్రకటించాడు. దీనితో యూదుల ఆశయాలు పూర్తిగా సఫలమయేటట్టుగానే కనపడింది.

అదివరకు జయొనిస్టుఉద్యమం ఆరంభంనుంచీ తమ జాతీయోత్సాహంలో యూదుప్రముఖులకు ఉద్యమంయొక్క నిజస్థితి వ్యక్తంకాలేదు. పదిపదునైదువందల సంవత్సరాలకిందట యూదులు దేశం వదిలిపెట్టవలసి వచ్చినప్పటినుంచీ ఆ దేశం వారి దేశం, ఆవిధంగానే నిర్మానుష్యంగా, ఒట్టి ఎడారిగా ఉన్నదనే వారు ఊహించారు. దేశంలేని మనుష్యులకు మనుష్యులులేని దేశం లభిస్తుందనుకొన్నారు. ఆ దేశంలో, వారికి ప్రియతమమైన ఆ దేశంలో—ఇతరప్రజలూ, ఇతరమతాలూ అభివృద్ధిఅయి, నివసిస్తూ ఉండవచ్చు నన్న భావం లేశమైనా వారి ఊహాప్రపంచంలో పొడగట్టలేదు. పరాయిదేశాలలో నానా ఇక్కట్టులూ పడుతూఉన్న లక్షల కొద్దీ యూదుప్రజలను, పాలస్తీను, వికసితవదనంతో ఆహ్వానిస్తుం దను కొన్నారు. ప్రపంచంలో ప్రజలందరూ ఎవరిమట్టుకు వారు వారివారి దేశాలలో, సుఖంగా కాలక్షేపంచేస్తూన్నట్టుగానే, ఇకముందు వారుకూడా వారిదేశంలో సుఖంగా కాలంగడుపవచ్చునని ఉవ్విళ్ళూరారు. ఆ దేశపు ఆదిమనివాసులైనవారు అనేకవందల సంవత్సరాల అజ్ఞాతవాసంనుంచి ఇంటికి తిరిగివస్తే, ఆలోగా అక్కడ మకాముచేసిన ఆరబ్బులు శుభప్రదంగా తమను ఆశీర్వదించడానికి బదులు శాపనార్థాలు పెట్టడం ఏమిటని నిర్ఘాంతపడ్డారు. వికసితవదనంతో ఆహ్వానము ఇస్తుందనుకొన్న జన్మభూమి ధుమధుమలాడుతూ ప్రత్యక్షంకావడంతోనే ఆశోపహతు లయారు.

పాశ్చాత్యప్రముఖులనూ, ప్రభుత్వాలనూ దూరడం మొదలుపెట్టారు. బ్రిటిషువారు అన్నమాట తప్పిపోయా రన్నారు. బాల్ఫరుమంత్రిప్రకటన అర్థాన్ని గురించి వ్యాఖ్యానాలు బయలుదేరాయి. మీ రనుకొనే అర్థం మా మాటలలో లేదన్నారు బ్రిటిషువారు. మా మాటలు మీకు ఆలా స్ఫురించడము మీదోషమే అన్నారు. మేము అనుకొనే అర్థం కాకపోతే, మరొక అర్థం ఏమి ఉంది మీమాటలకు అని యూదుప్రముఖులు ప్రత్యుత్తరం చెప్పారు. ఈవిధంగా శరపరంపరగా విమర్శలు బయలుదేరాయి. ఈలోగా బ్రిటిషువారు తమ ప్రకటనకు తాము ఉద్దేశించిన అర్థం ఆచరణలోకి తీసుకొనివచ్చేనిమిత్తం పాలస్తీనులో పరిపాలన సాగించారు.

యుద్ధంలో విజయం కావాలనే ఆత్రతలో బ్రిటిషువారు ఒక్క పాలస్తీనువిషయంలోనే కాదు ఈలాంటి అసందర్భప్రసంగం చేసినది. యుద్ధ ఆపత్కాలంలో చేసిన ప్రసంగాలన్నీ ఈలాంటివే. ఇది సరిపడక చెప్పిన మాట కాదు. ఈ కిందివాక్యాలు చూడండి. ఇంగ్లాండులో ప్రధానమంత్రిపదవిలో ఉండిన రాంసేమాక్డొనాల్డు మహాశయుడు ఆయన కధికారపదవి లభించిన కాలంలో వ్రాసిన వాక్యాలు ఇవి :

"పాలస్తీనునుకూడా కలిపి, స్వతంత్రఆరబురాజ్యం ఒకటి స్థాపించడానికి సహాయంచేస్తామని ఆశకల్పించి, ఆరబ్బులను తుర్కీమీద తిరగబడమని ప్రోత్సహించాము. దీనితోపాటే, పాలస్తీనులో సుస్థిరంగా నివాసమేర్పరుచుకొని, వారి ప్రభుత్వం వారు స్థాపించుకొనేటందుకుగాను ఆ దేశం వారికి అప్పజెప్పుతామని వాగ్దానం చేసి, వారు మనకు సహాయం చేసేటట్టుగా యూదులను ప్రోత్సహించాము. ఇదే సమయంలో అరబ్బులకు అప్పజెప్పుతామని బహిరంగంగా ప్రకటించిన దేశాన్నే, రహస్యంగా, మనమూ ఫ్రెంచివారూ పంచుకొని, పంపకపు ఒడంబడికలు వ్రాసుకొన్నాము. ఈవ్యవహారమంతా కేవలం కృత్రిమము. న్యాయంగా తత్ఫలితమైన అపఖ్యాతి మనకు తప్పదు. ఈవిషయం ఆరబ్బులు మరిచారనికాని, మన్నించారనికాని, నీతిబాహ్యమైన ఈ దోషం వెంటనే మాసిపోయి,

ఫలితం లేకుండాపోతుందనికాని ప్రాచ్యదేశాలలో ప్రజాభిప్రాయం సంగతి తెలిసినవారెవరూ అనుకోలేరు. ముసల్మానుల విషయంలో మన ప్రవర్తన కేవలం ఉన్మత్తత" "యూదుల వసతివిషయంగురించి చేసిన బాల్ఫరు ప్రకటన అవ్యక్తం, అసాధ్యవిషయం అయినట్టయితే, దానిని మరుమాట లేకుండా వదలుకోవాలి."

ఈవిషయాన్నిగురించే టాయిన్‌బీ అనే గ్రంథకారుడు ఈకింది మాటలు వ్రాశాడు: "బాల్ఫరుప్రకటనలో వివరించిన యూదులవసతి అనే పదంయొక్క అర్థం దురవగాహం. యుద్ధసమయంలో వాగ్దానాలు చేయ వలసివచ్చినప్పుడు ఇది లాభప్రదమైనప్పటికీ, ఇప్పుడు వాగ్దానం నెరవేర్చ వలసిన కాలం రావడంతోనే, పాలస్తీనులో విషమముగా పరిణమిస్తోంది"

ఆరబ్బులలో జాతీయసంచలనం అధికమయినకొద్దీ బాల్ఫరు ప్రకటనవల్ల బ్రిటిషువారికి మరింత విషమస్థితి ప్రాప్తించింది. అరబుదేశాల స్వాతంత్ర్యం విషయంలో మీరు చేసిన ప్రసంగాలకే విరుద్ధమని ఆరబ్బులూ, మీబాల్ఫరు ప్రకటనకు అర్థమేమీ లేనట్టుగా ఉందని యూదులూ ఆరడి చేయడం మొదలుపెట్టారు. బ్రిటిషువారు, యథాప్రకారం, కర్రవిరగ కుండా, పాము చావకుండా వ్యాఖ్యానాలుచేసి ఆరబ్బులనూ, యూదులనూ కూడా ఊరడించాలని చూచారు. 1921 సంగరం జూన్ 3 వ తేదీని, పాలస్తీనులో మొదటి బ్రిటిషుహైకమిషనరు సర్ హెర్బర్టు సామ్యేలు బాల్ఫరుప్రకటననుగురించి ఈవిధంగా ప్రసంగించాడు: "బాల్ఫరుప్రకటనలో 'పాలస్తీనులో యూదుప్రజలకు జాతీయవసతి ఏర్పరచడము' అనే మాట లనుగురించి అనేకతావులలో కలిగిన అపోహలను పోగొట్టడం అవసరం. వారి భూములూ, పుణ్యస్థానాలూ, వారి దేశమూ వారివద్దనుంచి లాగుకొని పరులకు అప్పజెప్పడానికి పాలస్తీను ఆరబ్బులు ఎంతమాత్రమూ అంగీక రించరని అనుకోవడం విన్నాను. దేశంలో అధికసంఖ్యాకులైన ముసల్మా నులూ, క్రైస్తవులూ, కొద్దిమంది యూదుల పరిపాలనలో కట్టుబడిఉండ డానికి ఎన్నడూ సమ్మతించరని చెప్పడం విన్నాను. న్యాయప్రియులని

యావత్ప్రపంచంలోనూ ప్రఖ్యాతిగాంచిన బ్రిటిషువారు ఇంత అక్రమమైన చర్యకు పూనుకోవడం ఆశ్చర్యమని అనుకోవడం విన్నాను. ఈ విధంగా అనుకొనేవారు బాల్ఫరు ప్రకటనఅర్థం గ్రహించలేదు. బ్రిటిషు వారికి సర్వవిషయాలకంటే న్యాయమే ప్రధాన మనడం నిస్సంశయం. అక్రమచర్యలకు వారు ఎప్పుడూ అంగీకరించరు. ఈ ప్రపంచంలో ఎక్కడెక్కడ చెల్లాచెదరై ఉన్నప్పటికీ వారి హృదయాలుమాత్రం పాలస్తీనులో లగ్నమైఉండే యూదులకు స్వస్థలం ఒకటి కనబరచడం అవసరం. ప్రస్తుతం ఈ దేశంలో ఉన్న ప్రజల క్షేమానికి భంగం లేనంతలో, తమ ధనం, శక్తీ వినియోగించి దేశాన్ని అంతనీ అభ్యున్నత స్థితికి తెచ్చేనిమిత్తం యూదులలో కొంతమంది, ఈ దేశవాసుల క్షేమానికి భంగంలేనంతలోనే పాలస్తీనులో వసతికల్పించుకోవడం అవసరం, ఇదీ బాల్ఫరుప్రకటనకు అర్థం. దేశంలోని ముసల్మానులకూ, క్రైస్తవులకూ వారిహక్కులకు వచ్చిన అపాయమేమీ లేదని నమ్మకం కలుగజేయడానికి చేయవలసిన కట్టుదిట్టాలన్నీ చేస్తాము. బ్రిటనుదేశం పాలస్తీను ప్రజల పురోభివృద్ధికి పూనుకొంది. ఈలాంటప్పుడు తమ మతఆర్థిక రాజకీయాదిశ్రేయస్సుకు అనర్థదాయకమని పాలస్తీనుప్రజలు భావించడానికి సావకాశం ఉండేటట్టుగా బ్రిటిషువారు ఎన్నటికీ ప్రవర్తించరు"

దేశంలో నివాసం చేయడానికి రానున్న యూదుల సంఖ్య దేశవాసుల శ్రేయోభివృద్ధికి భంగం లేనంతవరకే అని హెర్బర్టుసామ్యేలు వివరించిన విషయమే కామన్సుసభలో విదేశాంగమంత్రి చర్చిలు బలపరిచాడు. అప్పటినుంచీ, బ్రిటిషుప్రభుత్వంవారు తమ చర్యలన్నింటికీ దీనినే ఆధారంగా చేసుకొన్నారు. దీనివల్ల యూదులకు సంతృప్తీ కలుగలేదు; అరబ్బులకు సందేహమూ నివృత్తికాలేదు.

"ప్రపంచంలో ఎక్కడా, 'నా' అన్న దేశం—భిన్నజాతుల అటంకమేమీ లేకుండా తమ పురోభివృద్ధికి అనుకూలమైన పద్ధతులన్నీ అవలంబించడానికి తగిన దేశం—యూదులకు లేని కారణంచేతనే, పాలస్తీనులో

నివాసం ఏర్పరుచుకొని, అది తమ దేశంగా చేసుకొందామనే ఉద్దేశం వారికి కలిగింది. స్వర్గానికి పోయినా విడాకులు తప్పవన్నట్లు, గంపె డాస పెట్టుకొన్న పాలస్తీనులోకూడ, ప్రపంచంలోని అన్ని ఇతరదేశాలలో వలెనే, వారు మైనారిటీలోనే ఉండడం తప్పకపోయేటట్టయితే, ఉన్న దేశాలనుంచి లేచిపోయి, అష్టకష్టాలూ పడి, పాలస్తీనులో, కొత్త ప్రదే శంలో, కొత్త పరిస్థితులలో నివాసం ఏర్పరుచుకోవడంలో వచ్చిన విశే షం ఏమిటి? ప్రపంచమంతలోనూ, ఒక్క పాలస్తనులోమాత్రం, యూదులు అధిక సంఖ్యాకులుగా ఉండి, వారు స్వరాజ్యం అనుభవించేటట్టు చేయడమే కాకపోయినట్లయితే, ఇంక, బ్రిటిషువారి ప్రకటనలకు అర్థ మేమిటి? దేశంలో యూదులు అధిక సంఖ్యాకులుగా ఉండాలని అన్నంత మాత్రంచేత, అల్పసంఖ్యాకులయే ఆరబ్బులు అణిగిపోతారని ఊహించ కూడదు. ప్రపంచంలో అన్నిదేశాలలోనూ మైనారిటీలకు ఏవిధమైన సంపూర్ణరక్షణ ఉంటుందో, ఆ విధమైన రక్షణ యావత్తూ ఆరబ్బులకూ ఉంటుంది. పాలస్తీను ఒక్కటే దేశం కాదు, ఆరబ్బులకు. సిరియా ఉంది, ఇరాకు ఉంది. ఇంకా ఇతరదేశా లున్నాయి వారికి. ఏవిధమైన ఆటంకమూ లేకుండా ఆ దేశాలలో వారు పూర్తిగా అభ్యున్నతి పొంద వచ్చు. ఇక యూదులకో? ఒక్కటే దేశం—పాలస్తీను. అది మిన హాగా ఈ ప్రపంచంలో వారికి ఇంకొక దేశంలేదు. "ఇదీ మాదేశము, మా జాతీయఆశయాలకు అనుగుణంగా ఇందులో మేము అభివృద్ధిపొందు తాము" అని చెప్పదగిన దేశము వారికి ఇంకొకటిలేదు. అందుకనే యూదుల ఆశలూ, ఆశయాలూ, సర్వం పాలస్తీనుమీద ఆధారపడి ఉన్నాయి. అందుకనే, అష్టకష్టాలూ పడి, ఉన్న దేశాలన్నీ వదలిపెట్టి, పాలస్తీనులో కాపురంచేద్దామన్న గాఢవాంఛ. ఇటువంటప్పుడు బ్రిటిషు వారు, దేశం ఉన్నది ఉన్నట్టుగానే ఉండాలి అనడంలో అర్థంలేదు; వారి వాగ్దానాలు నెరవేరడమూ కాదు; యూదుల ఆశయాలు సఫలంకావడమూ కాదు. ఇదీ యూదుల వాదం.

ఇంక అరబ్బులో? "మా తాత ముత్తాతలనాటినుంచీ కాపురం చేస్తూఉన్న మా దేశంలో మాకు తావు లేకుండాజేసి, మరొకరిని తెచ్చి కాపురంపెడితే మేము ఎలా ఊరుకొంటాము? మేమే కాదు; ప్రపంచంలో ఏదేశంలోనైనా, ఎవరైనా ఊరుకొంటారా? దేశం మాది కావడం ఏమిటి; దేశంలో కాపురంచేస్తూ ఉన్నవాళ్ళము మే మవడం ఏమిటి; ఏవిధమైన సంబంధమూ లేని ఇంగ్లీషువారు, సందేహం లేకుండా, ధారపోయడం ఏమిటి; ఇంతకంటే అన్యాయం, అక్రమం మరొకటి ఉంటుందా? ప్రత్యక్షంగా ఈ అన్యాయం జరుగుతూఉంటే, చేతులు కట్టుకొని ఎలా ఊరుకొంటాము? మేమే కాదు, ఎవ్వరూ ఊరుకోరు, ఈలాంటి పరిస్థితులలో. ఈ దేశంలో అరబునాగరకత అభివృద్ధిజెందింది. అరబుదేశాలలో ఇది ఒకటి. ఇంతేకాదు; అసలు సిరియాలో భాగం ఈ దేశం. సిరియానుంచి దీనిని విడదీయడం సామ్రాజ్యతృష్ణ తీర్చుకోవడంకోసం చేసిన కార్యం. సామ్రాజ్యపాలకులు పాలస్తీనును హస్తగతం చేసుకోవడానికి యూదుల జాతీయత ఒకటి సాకుగా దొరికింది. ఇండియాదేశంమూలంగా వచ్చింది మా కీముప్పు. అరబ్బుల హక్కులన్నీ సురక్షితంగా ఉండేటట్టు చేస్తామంటే వచ్చిన లాభం ఏమిటి? ధనికులూ, బుద్ధిశాలులూ, వ్యాపారనిపుణులూ అయిన యూదులతో పోటీపడి మేము ఆగగలమా? ఎన్ని రక్షణలు ఉంటేమాత్రం ఏమి లాభం? యూదులు ధనవర్షం కురిపిస్తూఉంటే అరబు బీదరైతు పొలం అమ్ముకోకుండా ఉండగలడా? ఈపద్ధతిగనుక కొన్నాళ్ళు సాగితే, దేశమంతా యూదుల వశం కావడం నిస్సంశయం. మా దేశంలో మాకు అస్కారంలేకుండా పోవడం నిశ్చయం. అరబు జాతీయతకూ, ఐకమత్యానికీ భంగకరమైన పరిస్థితులు కలుగజేస్తోంటే అరబ్బులు ఊరుకోరు. ఇంకొకరి ముల్లె ఏమీ వారు తెచ్చిపెట్టమనడం లేదు. స్వతహాగా వారికి ఉన్న హక్కులకు భంగం కలుగజేయవద్దంటున్నారు. విసుగూ విరామం లేకుండా, మిత్రమండలివారు ప్రపంచమంతటా ప్రకటించిన స్వరాజ్యస్వయంనిర్ణయసూత్రాలు అనేకఇతర పిల్ల

పిల్లజాతులకు వర్తించినట్టే తమకూ వర్తించా లంటారు." ఇదీ ఆరబ్బుల వాదం; దీని ననుసరించే నడిచింది, యూరపు యుద్ధానంతరం పాలస్తీనులో అరబుజాతీయ ఉద్యమం.

## 2

అరేబియాదేశమం వంతటా వ్యాపించిన జాతీయభావాలు పాలస్తీను ఆరబ్బులలోనూ వ్యాపించాయి. బ్రిటిషువారు జయించిన కొత్తలో, కొంత కాలం దేశంలో సైనికప్రభుత్వమే సాగింది. బ్రిటిషువారి రక్షణఅధికారం ఆరబ్బులు మొదటినుంచీ ప్రతిఘటిస్తూనే ఉన్నారు. 1919 సం॥రం ఆరంభంలో పాలస్తీనుఆరబ్బుల ప్రథమకాంగ్రెసు జరిగింది. 1921 సం॥రం మేనెలలో జరిగిన కాంగ్రెసులో నలుగురు మహమ్మదీయులనూ, ఇద్దరు క్రైస్తవులనూ ఒక సంఘంగా ఏర్పరిచి, లండను నగరానికి పోయి బ్రిటిషుప్రభుత్వంతో మాండేటువిషయం సంప్రతించిరావలసిం దన్నారు. ఈ ప్రతినిధివర్గానికి నాయకుడు మూసాకసీమ్‌పాషా. బాల్ఫరు ప్రకటన రద్దు చేయించాలనీ, దేశంలో సక్రమమైన ప్రజాస్వామిక ప్రభుత్వం స్థాపించేటట్టు చేయాలనీ వారు ప్రయత్నించారు, కాని విఫలులయారు.

అదివరలో అమలులో ఉన్న సైనికపరిపాలన తొలగించి, 1921 సం॥రం జూలై 1 వ తేదీనుంచి, సర్ హెర్బర్టుసామ్యేలు ఆధిపత్యంకింద బ్రిటిషువారు మామూలుగా సివిలుపరిపాలన ఆరంభించారు. అక్టోబరు నెలలో సర్‌సామ్యేలు సలహాసంఘం ఒకటి ఏర్పరిచాడు. అందులో పదిమంది బ్రిటిషుఉద్యోగులూ, ఏడుగురు ఆరబ్బులూ, ముగ్గురు యూదులూ సభ్యులు. దేశశ్రేయస్సును గురించిన విషయాలు చర్చించ డానికిమట్టుకు ఈ సంఘానికి అభ్యంతరం లేదు. 1921 సం॥రం మే నెలలో ఉద్రేకపూరితులైన ఆరబ్బులు కొందరు అక్కడక్కడ యూదుల మీద తిరగబడ్డారు. అల్లరులను గురించి విచారణచేయడానికి గవర్నమెంటువారు యథావిధిగా విచారణసంఘం ఒకటి నియమించారు. దేశ

మంతా యూదుమయమైపోయి, తమ క్షేమానికి చేటువస్తుందన్న అరబ్బుల భయమే కొట్లాటలకు కారణమని సంఘంవారు నిర్ణయించారు. రెండు జాతులలోని పెద్దలూ ముఖాముఖీని ముచ్చటించుకొంటే పరస్పర సందేహాలు నివృత్తికావచ్చునని సూచించారు. కాని ఈ ముచ్చటింపులు మాత్రం జరగనేలేదు.

1922 సం॥రం జూలై 24 వ తేదీని అంతర్జాతీయ సమితివారు పాలస్తీనును బ్రిటిషువారి ఆధీనంలో రక్షణపొందే రాజ్యంగా స్థిరపరిచారు. ఈ రక్షణపొందే రాజ్యాలు 'ఏ' మాండేట్లూ, 'బీ' మాండేట్లూ అని రెండు రకాలు. ప్రజాస్వామిక ప్రభుత్వం వర్ధిల్లుతుం దన్న రాజ్యాలు మొదటిరకం; రక్షించడానికి పూనుకొన్న ప్రభుత్వానికి, వీటిల్లో శాసనసభలూ, ఎన్నికలూ మొదలైన తతంగమంతా అమలులోకి తెచ్చి, క్రమక్రమంగా స్వపరిపాలనాశక్తి దేశీయులకు అలవరచవలసిన బాధ్యత ఉంది. ప్రజాస్వామిక పద్ధతులు సాధ్యంకానట్టివీ, వాటి పరిపాలనలో ప్రజాభిప్రాయానికి ప్రాధాన్యం ఇవ్వనక్కరలేనట్టివీ రెండవరకం. వీటిల్లో సర్వాధికారమూ రక్షణబాధ్యత వహించిన ప్రభువులదే. శాస్త్రరీత్యా పాలస్తీను 'ఏ' మాండేటే. కాని ఆచరణలోమాత్రం బ్రిటిషువారు వారి చిత్తంవచ్చినట్టు రాజ్యంచేయడమే సంప్రదాయమైంది. యూదుల క్షేమం గమనించి అలా చేయకతప్ప దన్నారు. బ్రిటిషువారు నిరంకుశత్వానికి ప్రజానురంజకవేషం వేయడంలో నిపుణులు. 1922 సం॥రం అగస్టు 10 తేదీని పాలస్తీనురాజ్యానికి ఆర్భాటంగా రాజ్యాంగవిధానం ఒకటి సృష్టించారు. దేశంలో శాసనసభ ఒకటి వెలిసింది. ఇందులో 10 మంది ఉద్యోగులూ, 12గురు ప్రజాప్రతినిధులూ సభ్యులు. ప్రజాప్రతినిధులలో ఇద్దరు క్రైస్తవులూ, ఇద్దరు యూదులూ ఉండాలి. బ్రిటిషుఉద్యోగులూ, యూదులూ ఒకవైపైతే, అరబ్బులు శాశ్వతంగా మైనారిటీయే. శాసనసభకు హైకమిషనరు ప్రెసిడెంటు. ఆయనకు శాసనసభ ఆమోదించిన తీర్మానాలు రద్దు చేయడానికి సంపూర్ణ అధికారం ఉంది. తీర్మానాలు బ్రిటిషువారి రక్షణ

బాధ్యతకు విరుద్ధమైనట్టుంటే, అధ్యక్షుడు రద్దుచేసితీరాలి. ఇంతే కాదు. ఒక సంవత్సరంలోపున, ఏ తీర్మానమైనా సరే, ఇంగ్లాండురాజు రద్దుచేయవచ్చు. తన ఇచ్చవచ్చిన శాసనం ప్రవేశపెట్టవచ్చు.

రక్షణ పేరుమీదుగా తమకు దాస్యం స్థిరపడిందని తెలియడంతోనే దేశంలో అరబ్బులంతా రెండురోజులు హర్తాలు చేశారు. లండనులో రాయబారం జరుపుతూఉన్న తమ ప్రతినిధులను తిరిగి రమ్మన్నారు. 1922 సం॥రం ఆగష్టు 22 వ తేదీని నబ్లాసుపట్నంలో అయిదవ పాలస్తీను అరబుకాంగ్రెసు సమావేశమైంది. ఎన్నికలూ, శాసనసభలూ బహిష్కరించాలని తీర్మానంచేశారు. యూదులకు భూములు అమ్మకుండా ప్రచారంచేయా లన్నారు. అంతక్రితమే గవర్నమెంటువారు పాలస్తీను లోని నీటివసతి యావత్తూ విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేసే నిమిత్తమూ, సాగుబడి నిమిత్తమూకూడా ఒక యూదుకంపెనీకి 75 సంవత్సరాలకాలంపాటు గుత్తకు ఇచ్చారు. ఇది చాలా అక్రమమని కాంగ్రెసు ప్రతినిధులు తీర్మానించారు. దేశంలో జాతీయవిద్య వ్యాపింపజేయడానికీ, రైతుల ఆర్థికస్థితి అభివృద్ధిచేయడానికీ తగిన ప్రయత్నాలు చేయాలని నిశ్చయించారు.

1923 సం॥రం ఫిబ్రవరిలో ఎన్నికలు జరిగాయి. అరబుప్రజలంతా బహిష్కరించారు. గవర్నమెంటువారు, చేసేది ఏమీ లేక, ఎన్నికలు రద్దుచేసి శాసనసభ తీసివేయడమైనదని ప్రకటించారు. సంప్రతింపులు కొన్ని జరిపి అరబ్బులను కూడగట్టుకోవాలని చూచారు కాని కుదరలేదు. అంతటితో పాలస్తీనుపాలన పూర్తిగా హైకమిషనరు స్వాధీనంలో ఉంటుందని ప్రకటించారు. అప్పటినుంచీ ఏడెనిమిది సంవత్సరాలకాలం పాటు ప్రజాప్రతినిధుల బాధ లేకుండా యథేచ్ఛగా పరిపాలన సాగించారు. ఆతరువాత, అరబుప్రముఖులు కొందరు, శాసనసభా బహిష్కారపద్ధతి విరమించాలని ఉద్యమం లేవదీశారు. వీరికి గవర్నమెంటుమద్దతు లేకపోలేదు. దీనికి నేషనల్‌పార్టీ అని నామకరణం చేశారు. జెరూసలం పట్నానికి మేయరుగా ఉన్న రఘీబునషాషీబీ ఈపార్టీకి నాయకుడు. ఈ

పార్టీవారికీ, మిగిలినవారికీ ఆదర్శాలలో అంతగా భేదంలేదు. ఒక్క గవర్నమెంటుతో సహకారవిషయంలోతప్ప. వచ్చినంతవరకు రాబట్టాలనే సిద్ధాంతంలోనివారు వీరు.

1925 సం॥రంలో సర్ హెర్బర్టుసామ్యేలు ఉద్యోగం ఆఖరైంది. ఆయనసానే లార్డు ప్లూమరును నియమించారు. కొత్తగావచ్చినా, ఈ ప్రభుప్రు తెలివితేటలతోనే ప్రవర్తించాడు, ఆరబుయూదువివాదంలోకి దిగలేదు ఈయన. బ్రిటిషువారి లాభక్షేమాలే ప్రధానవిషయంగా పరిగణించి, మిగిలినవాటి ప్రమేయం అంతగాపెట్టుకోలేదు. బ్రిటిషువారికి ముట్టవలసిన ధనమంతా ముట్టజెప్పడం ఆరంభించాడు. పాలస్తీనుకోసం బ్రిటిషువారి ఎర్రని ఏగాని ఖర్చుగాకుండాఉండే స్థితి తీసుకొని రాగలిగాడు. పైగా పాలస్తీనులోనే 1,500,000 పౌనులవరకూ మిగిల్చాడు. ఈ మిగిల్చినడబ్బు పాలస్తీనుప్రజలకోసం పాడుచేయలేదు. క్రిందటితరంలో ఇంగ్లాండుదేశానికి పాలస్తీను ఇవ్వతేలిన పాతబాకీలకింద వసూలు పెట్టాడు. బ్రిటిషువారికి అవసరమైన హైఫాపట్నపు నౌకాశ్రయం కట్టడం ఆరంభించాడు. దేశంలోని ఖనిజసంపద యావత్తూ ఒక బ్రిటిషుయూదు కంపెనీకి గుత్తకిచ్చాడు. ఏడవ ఆరబుకాంగ్రెసులో ఆరబుజాతీయవాదులు ఈవిధమైన చర్యలన్నీ ఖండించారు. ఈకాంగ్రెసు 1928సం॥రం జూలై 10 వ తేదీని జెరూసలంనగరంలో సమకూడింది. అదివరలో అనేక విభేదాలతో చీలిపోయిన ఆరబుజాతీయవాదులందరూ ఐక్యమయారు. 300 మంది ప్రతినిధులు సమావేశమయారు. దేశశ్రేయోభివృద్ధికి సంబంధించిన విషయాలన్నింటినీ గురించి చర్చించి తీర్మానాలు చేశారు. ముఖ్యమైన ఈకింది తీర్మానం అంతర్జాతీయ సమితివారికి అందజేశారు:

"జెరూసలంలో సమావేశమయిన ఆరబు (ముసల్మాను, క్రైస్తవ) కాంగ్రెసులో ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానాన్ని అనుసరించి, మా జన్మస్వత్వమైన స్వపరిపాలన మాదేశంలో స్థాపించవలసిందని తెలియజేస్తున్నాము. ఇప్పటికి పదిసంవత్సరాలనుంచి అవిచ్ఛిన్నంగా జరుగు

తోంది నిరంకుశపరిపాలన. ఇదివరలో మిత్రమండలివారు ఆరబ్బులకు చేసిన వాగ్దానాల ననుసరించీ, అంతర్జాతీయసమితివారి తీర్మానాల ననుసరించీ ఈపరికే ఈదేశంలో స్వరాజ్యం స్థాపించిఉండడం అంతర్జాతీయ సమితికి పరమధర్మం. మిగిలిన ఆరబుదేశాలతోటిదే పాలస్తీనూను. అలాంటప్పుడు మాప్రాంతదేశాలలో ఏదోఒకవిధంగా ప్రజాస్వామిక ప్రభుత్వం జరుగుతూఉండడము, మాదేశంలోమట్టుకు నిరాఘాటంగా నిరంకుశత్వం సాగుతూఉండడము అక్రమం. ఈ అక్రమం పాలస్తీను ఆరబ్బులు సహించరు. మాదేశానికి తగిన రాజ్యాంగవిధానం తయారుచేసుకొని, ప్రజాభీష్టానుసారం స్వపరిపాలన ఏర్పాటు చేసుకొనే సంపూర్ణ హక్కు కలిగిఉండే ప్రజాప్రతినిధుల సభ ఒకటి వెంటనే సమావేశపరచవలసిన దని వివరిస్తున్నాము."

కాంగ్రెసులో 48 గురు సభ్యులతో కార్యనిర్వాహకసంఘం ఒకటి ఏర్పరిచారు. వీరు లార్డుప్లూమరుకూ, ఆయనస్థానే కొత్తగా నియమితుడైన సర్ జాన్ రాబర్టు ఛాన్సెలరుకూ ఆరబుప్రజాభీష్టం తెలియచేశారు సావధానంగా విని, శ్రద్ధగా యోచిస్తా నన్నాడు కొత్త హైకమిషనరు.

ఈలోగా, పాలస్తీనులో యూదుల సంఖ్య క్రమంగా హెచ్చింది. మొదటలో, పాలస్తీనులో కాపురానికి, వివిధదేశాలనుంచి వేనకువేలుగా వచ్చారు. మొదటిలో ఉన్న ఉత్సాహం తరువాత క్రమంగా క్షీణించింది. దూరపుభూములలో ఉండి, ఊహాప్రపంచంలో వా రనుభవించిన సౌఖ్య సంపదలన్నీ నిజంగా ఊహాప్రపంచంలోనివే అన్న యథార్థం గోచరించిన తరువాత, పాలస్తీనులో నివసించడానికి వచ్చే యూదుల సంఖ్య తరిగిపోయింది. 1927 సం॥రంలో దేశంలోకి వచ్చేవారికన్న దేశంనుంచి లేచిపోయేవారి సంఖ్య అధికమైంది. వచ్చేవారి సంఖ్య ఆతరువాత తిరిగి ఎక్కువైంది. 1919 సం॥రం నుంచి 1930 వరకూ దేశంలోకి వచ్చినవారి మొత్తంసంఖ్య 1,09,000. లేచిపోయినవారు 29,000. దేశంలో నిలిచిపోయిన యూదులు అనేకవిషయాలలో నూతనమార్గదర్శకు లయారు.

వ్యవసాయంలో ఆధునికశాస్త్రీయపద్ధతులన్నీ ప్రవేశ పెట్టారు. యూదు లలో సహకారఉద్యమం విస్తారంగా వ్యాపించింది. ఆరోగ్య పారిశుద్ధ్యాది విషయాలలోనూ, విద్యావిషయాలలోనూ ఆశ్చర్యకరమైన అభివృద్ధి కలి గింది. వారిలో అదివరకు ఎన్నడూ లేని నూతనజాతీయఉత్సాహం ప్రబలింది. నశించిపోనున్న హీబ్రూభాషకు తిరిగి జీవకళ కలిగింది. హీబ్రూవాఙ్మయం అద్భుతంగా అభివృద్ధిజెందింది. యూదుల పురోభి వృద్ధికి నూతనపాలస్తీను కేంద్రస్థానమైంది.

యూదులలో ఈ పరివర్తన కలగడానికి గవర్నమెంటు పడపాటు ఏమీ లేదు. దేశంలో వసతి ఏర్పరుచుకోవడానికి వచ్చే యూదుల మూలంగా గవర్నమెంటుకు వచ్చే ఆదాయం చాలా పెరిగింది. కాని ఈ అధికాదాయంలో యూదుల పురోభివృద్ధికి ఖర్చయినది ఏమీ లేదు. ఈ అదనపురాబడి ఇంగ్లాండుదేశం పాతబాకీలకింద జమకట్టుకోడానికే చాలలేదు. ప్రపంచంలోని వివిధదేశాలలో కాపురంచేస్తూఉన్న యూదు లందరూ పుష్కలంగా ధనసహాయం చేసి, యూదుజాతీయ ఉద్యమాన్ని ప్రోత్సహించారు. మొత్తం పదిసంవత్సరాలలో ఈ బాపతుసహాయం సుమారుగా 30,000,000 పౌనులని లెక్కవేశారు.

దేశంలోని యథార్థస్థితి బోధపడినతరువాత యూదుప్రముఖులలో పూర్వకాలంనాటి వెర్రివెర్రిఊహలు మాయమయాయి. పరిస్థితులకు అను గుణంగా ప్రవర్తించవలసిన అగత్యం వ్యక్తమయింది. ప్రపంచంలో ఉన్న యూదులందరూ వచ్చి, పాలస్తీనులో కాపురంపెట్టడం సాధ్యమూ కాదు, అభిలషణీయమూ కాదన్నసంగతి విశదమైంది. దేశంలో యూదుల సంఖ్య వెంటవెంటనే పెరగడంకంటే, ఉన్నవారు సకలవిధాలుగానూ అభివృద్ధిజెంది, ఆమూలంగా దేశపురోభివృద్ధికి కూడా కారకులు కావడం ప్రాముఖ్యమన్న విషయం బయల్పడింది. కాని అనేకులలో పాలస్తీను పూర్తిగా యూదుల దేశం కావాలనే ఆశ నశించలేదు. ఆ స్థితి చేకూర వంతవరకూ యూదుజాతీయఉద్యమం సఫలంకానట్టే వారు భావిస్తారు.

ఆ ఉద్దేశం యూదులకు ఉన్నంతవరకూ ఆరబ్బుల ప్రతిఘటనం ఎక్కువ కావడం సహజం.

యూదుల ఉద్యమం తమ క్షేమానికి భంగకర మనే భావం మూలంగానే 1929 సం॥రంలో ఆరబ్బుల తిరుగుబాటు ఆరంభమైంది. ఇది మొదట మతరూపంగా అంకురించింది. జెరూసలంపట్నంలో పూర్వం హీరుడుదేవాలయమని ఒక యూదుఆలయం ఉండేది. అది పూర్తిగా శిథిలమైపోయిందికాని చుట్టూ ఉండే గోడలో కొంతభాగంమాత్రం నిలిచి ఉంది. దుఃఖకుడ్య మనే పేరుమీదుగా పవిత్రరూపం దాల్చింది ఈగోడ. అయితే వచ్చిన అసందర్భం ఏమిటంటే, ప్రస్తుతంలో ఈగోడ అక్కడ ఉన్న మహమ్మదీయుల ఎల్‌అక్సారు అనే ప్రాముఖ్యమైన మసీదుగోడలో కలిసిఉంది. గోడ ఉన్న స్థలం ముసల్మానులది. యథాపూర్వంగా ఈ పవిత్రకుడ్యసాన్నిధ్యంలో ప్రార్థనచేసుకొనే హక్కు మాకు ఉండాలి అంటారు యూదులు. మాస్థలంలో మీరు పాదంపెట్టడానికి వీలులేదు అంటారు ముసల్మానులు. హక్కు వదలుకొంటే మతానికి ముప్పు అని యూదులూ, అడుగుపెట్టనిస్తే మసీదు మైలపడుతుందని ముసల్మానులూను. ఈ తగవు తెగడము ఏలాగు? పురాతనమైపోయీకూడ, ఈ గోడ, మతంపేరుమీదుగా మానవరక్తం చవిజూచింది. నిర్జీవమైన ఈ శిథిలచిహ్నం పురస్కరించుకొని, అణిగివున్న రాజకీయవిద్వేషం రగులుకొంది. అంకురించిన కొద్దిలోనే, తిరుగుబాటుకు, మతసాంఘికరూపం మాసిపోయింది. జాతీయరూపం దాల్చి, బ్రిటిషు నిరంకుశత్వంమీదకు తిరిగింది. ముసల్మానులూ, క్రైస్తవులూ అనే విచక్షణ లేకుండా, అందరూ ఉద్యమంలో పాల్గొన్నారు. ఆరబుక్రైస్తవులలో కొందరు జాతీయ ఉద్యమంలో నాయకు లయారు. అక్టోబరు 27 వ తేదీని జెరూసలంపట్నంలో ఆరబునేషనలుఅసెంబ్లీ సమావేశమైంది. సమావేశానికి హాజరైన 600 మంది ప్రతినిధులలోనూ నాలుగవవంతుకుపైగా క్రైస్తవులు. క్రైస్తవస్వాములూ, గురువులూకూడా ప్రతినిధులుగా హాజ

రయారు. క్రైస్తవప్రముఖులు అధ్యక్షత వహించారు. దేశంలో జరిగిన హర్తాలులన్నింటిలోనూ ముందంజవేశారు క్రైస్తవులు. ఇంతే కాదు. ఈ జాతీయభావోద్వేగంలో ఆరబుస్త్రీల అంతఃపురబంధం అంతరించింది. అక్టోబరు 25 వ తేదీని ప్రథమఆరబుస్త్రీ సమావేశము జరిగింది. క్రైస్తవ ముసల్మానుభేదం లేకుండా, ఆరబుస్త్రీలందరూ సమావేశమయారు. ఆరబుయువకులు ముందంజవేశారు. ఆరబుకృషికులూ, వర్తకులూ, వీరు వా రనడం ఎందుకు, ఆరబ్బులు యావన్మందీ పాల్గొన్నారు జాతీయస్వాతంత్ర్యంకోసం జరిగిన ఈ సమరంలో.

బలసమన్వితులైన బ్రిటిషువారికి ఈ చిన్నచిన్నవిప్లవాలు అణిచివేయడము ఒక లెక్కలోపని కాదు. కొద్దికాలంలోనే, పాలస్తీనులో, బ్రిటిషుసైనికబలం ప్రత్యక్షమయింది. పోలీసుశాఖ అంతా బ్రిటిషుమయమైంది. విప్లవం అణిగిపోయింది; కాని కేవలం బాహ్యరూపంమాత్రమే. విప్లవబాహ్యరూపం కనపడకపోవడంతోనే, అణిచివేశామని నిరంకుశులు ఆశాపూరితు లవుతారు. ప్రజల భావప్రపంచంలో కలిగే కల్లోలం వారికి కనపడదు. విప్లవం అణిచివేశా మనుకొన్నతరువాత న్యాయదృష్టి గల బ్రిటిషువారు విచారణసంఘం ఒకటి నియమించారు. సర్‌వాల్టరుషా అనే ఆయన దానికి అధ్యక్షుడు. జాతీయఉద్యమం నడిపిన ఆరబునేషనలు కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంవారిని ఆరబ్బులకు ప్రతినిధులుగా ప్రభుత్వంవారు అంగీకరించక తప్పిందికాదు. విచారణలో వీరు ఆరబ్బుల తరపునసాక్ష్యమిచ్చారు. జరిగిన అల్లకల్లోలమంతా గవర్నమెంటు అశక్తత వల్ల నన్నారు యూదులు. బ్రిటిషునిరంకుశత్వం దీనికంతకూ మూలమన్నారు ఆరబ్బులు. సంఘంవారు విచారణ పూర్తిచేసి, నివేదిక ప్రచురించారు. దేశంలోని నిజస్థితి సంఘసభ్యులకు అవగాహన అయింది. బాల్ఫరు ప్రకటన దీనికంతకూ మూలమని తీర్పుచెప్పారు. దేశమంతా యూదులతో నిండిపోయి ఆరబ్బుల భూవసతులన్నీ ధనికులైన వారికి, వశమై, ఆరబుజాతి అంతరిస్తుందన్న భయమే ఆరబుఉద్రేకానికి కారణ

మన్నారు. బాల్ఫరుప్రకటన ప్రధానంగా ఉన్నంతవరకూ ఆస్థితి తప్ప దన్నారు. ఆ ప్రకటనలోనూ, దానిని అనుసరించిన మాండేటులోనూ విద్వేషబీజం స్వతహాగా అంతర్భూతమైఉంది అన్నారు. ఒక సభ్యుడు మాత్రం, అన్నిటికీ ఒప్పుకొన్నప్పటికీ, అరబ్బులలో ఉండే అనుమానం పోగొట్టే ఉపాయం చూస్తే, బాల్ఫరుప్రకటనవల్ల వచ్చిన బాధ లేదన్నాడు.

పాలస్తీనులోకి యూదుల ప్రవేశం గురించి, సంఘంవారు వివరంగా ఆలోచించారు. ప్రతి సంవత్సరము 20,000మంది యూదులు దేశాంతరం నుండి వచ్చి దేశంలో స్థిరపడే సందర్భంలో, 1956వ సంవత్సరంనాటికి. పాలస్తీనులో మిగిలినవారికంటే యూదులు ఎక్కువ అవుతారని లెక్క తేల్చారు. అన్ని విషయాలూ ఆలోచించి, 10,000 మంది చొప్పున మాత్రం వచ్చేటట్టయితే, అరబ్బులకు వచ్చే ఆపద అంతగాఉండ దన్నారు. ఈ లెక్కను 1974 సం॥రంనాటికి పాలస్తీనులో అరబ్బులు 17 లక్షల మందీ ఉంటారని తేలింది.

1931 సంవత్సరం జనాభానుబట్టిచూస్తే, సంఘంవారు నిశ్చయించిన విషయాలకు కొంత ఆధారం కనపడుతుంది. ఈ జనాభాలెక్కను బట్టి పాలస్తీనులో యూదులు 1,75,006 మంది ఉన్నారు. 1922లో వీరి సంఖ్య 83,794. మహమ్మదీయులు 1922లో 5,90,890, 1931 సం॥రంలో 7,59,952. క్రైస్తవులు 1922లో 73,024 మందీ, 1931లో 90,607 మందీని. అరబ్బులు (క్రైస్తవులూ ముసల్మానులూకూడా కలిసి) జనాభాలో సుమారుగా నూటికి 83 గురు. 1922 సం॥రం నుంచీ వీరు 1,85,645 మంది ఎక్కువయారు. అంటే సంవత్సరానికి 20,000 మంది చొప్పున ఎక్కువయా రన్నమాట. ప్రస్తుతంలో యూదులు నూటికి 17గు రున్నారు. 1922 సం॥రం నుంచీ దేశంలో పుట్టుకలవల్లా, దేశాంతరాలనుంచి కాపురంరావడంవల్లా మొత్తం 91,212 మంది అధికమయారు. అంటే సంవత్సరానికి 10,000 మంది హెచ్చుతున్నా రన్నమాట.

ఈ సమస్యతోపాటే బంజరుగా ఉండి కొత్తగా సాగుబడికి పనికి

వచ్చే భూమి ఏమాత్రం ఉంది అనే విషయంకూడా షాసంఘంవారు ఆలోచించారు. అప్పటి పరిస్థితులలో అనేకమంది ఆరబురైతులు భూమిని కోల్పోయి, నిర్వ్యాపారులుగా తయారయే అపాయం ఉంది అని నిరూపించారు. వ్యవసాయంలో తాతలనాటి పద్ధతులు మార్పుజెందనిది అప్పటికి ఉన్నవారికంటే ఎక్కువమందికి వ్యవసాయంవల్ల పోషణ జరగడం అసాధ్యమని నిశ్చయించారు. ఉన్న వ్యవసాయకులలోనే అంతకంతకు జనసంఖ్య హెచ్చుతోం దన్నమాట మరిచిపోకూడ దన్నారు. భూములు క్రయపరచడంతోనే, అంతకుపూర్వంనుంచీ ఆభూములు సాగు చేసుకొని జీవిస్తూఉన్న రైతులకు సాగుబడిహక్కు పోవడము కూడ దన్నారు. రైతుల పరపతివిషయం యోచించా లన్నారు.

షాకమిషనువారి నివేదికలో విషయాలన్నీ బ్రిటిషువారు చాలావరకు ఆమోదించారు. అదివరలోవలెనే ఆరబు ప్రతినిధులు కొందరు మూసా కసీంపాషానాయకత్వంకింద లండనుపట్నానికిపోయి, ప్రజాభిప్రాయం బ్రిటిషుగవర్నమెంటుకు వ్యక్తంచేశారు. షాసంఘంవారి తీర్మానాలన్నీ గమనించి, దేశాంతరాలనుంచి యూదులు కాపురంవచ్చే పద్ధతి వెంటనే ఆపుదలజేయవలసిందనీ, ప్రజాస్వామ్యపద్ధతులు ప్రవేశపెట్టవలసిందనీ కోరారు. ఆరబ్బుల వాదం బ్రిటిషువారు పూర్తిగా అంగీకరిస్తే, యూదుల విషయం వారు వహించిన బాధ్యతకు భంగము. అందుచేత ఆరబుప్రజాభిప్రాయం వారికి సమ్మతంకాలేదు. కాని, సాధ్యమైనంతవరకు తాము వహించిన బాధ్యతకు ప్రతికూలంగా లేనంతవరకు, షాసంఘంవారి సూచనలూ, ఆరబు ప్రజాభిప్రాయమూకూడా గమనించి తగిన చర్య తీసుకొంటా మన్నారు. 1930 సం॥రం మేనెలలో బ్రిటిషుప్రభుత్వంవారు పాలస్తీనును గురించి ఒక ప్రకటన చేశారు. ఇందులో వారు కొత్తగా చెప్పిన విషయమేమీ లేదు. పదేళ్ళనుంచీ పాడుతూఉన్న పాట మళ్ళీ వినిపించారు. ఆరబుప్రతినిధులు రిక్తహస్తాలతో ఇంటికి ప్రయాణమయారు.

బ్రిటిషువారు బాల్ఫరుప్రకటన రద్దుచేయకపోవడము పాలస్తీనులో

ఉన్న విషమసమస్య తెలియక కాదు. యూదుల ప్రతిఘటనం ఎక్కువ కాకుండాఉండే ఉపాయంకోసం ఆలోచించారు. కూలినాలి చేసుకొనే యూదులుమాత్రం ఇంక పాలస్తీనులోకి కాపురం రాకూడదని సాహసించి ఉత్తరువుచేశారు. 1930 సంగరం జూన్ నెలలో అంతర్జాతీయ సమితితాలూకు మాండేటులసంఘంవారు పాలస్తీను వ్యవహారంగురించి యోచించి, బ్రిటిషుపరిపాలకులను తీవ్రంగా విమర్శించారు.

పాలస్తీనులోకి యూదులను రాకుండాచేసే పద్ధతి కొంతవరకు అమలులోకిరావడంతోనే, యూదులలో ఆందోళన హెచ్చింది. కొంత వరకైనా అరబుప్రజాభిప్రాయం గమనించి, తదనుసారంగా బ్రిటిషు ప్రభుత్వం వర్తించేటట్టుగా తోచడంతోనే యూదులు తీవ్రంగా విమర్శించడం ఆరంభించారు. ఈసమయంలోనే బ్రిటిషుప్రభుత్వంవారు, సర్ జాన్ సింప్సనును, దేశంలో వ్యవసాయాదివిషయాలనుగురించి యోచించి నిజస్థితి తెలియజేయవలసిందని పంపించారు. ఈయన పూర్తిగా యోచించి నివేదిక వ్రాశాడు. అదివరకు వారివలెనే ఈయనా వ్రాశాడు. ఆ తరువాత (1930 సంగరం అక్టోబరు 20) బ్రిటిషుగవర్నమెంటు పాలస్తీనుపరిపాలననుగురించి శ్వేతపత్రం ఒకటి ప్రకటించారు. ఇది అరబుప్రజాభిప్రాయానికి రవంత అనుకూలగా ఉంది. దీనిమూలంగా యూదులకు పూర్తిగా ఆశాభంగమైంది. బ్రిటిషుప్రభుత్వాన్ని అతితీవ్రంగా విమర్శించారు. దేశమందంతటా ఆందోళన చేశారు, అందుమీద శ్వేతపత్రం కొంత సవరించి యూదులను ఊరుకోపెట్టాలని బ్రిటిషువారు ప్రయత్నించారు.

ఆమధ్య జర్మనీలో హిట్లరు హయాము వచ్చినతరువాత అక్కడ ఉన్న యూదులను లేవగొట్టడంతోనే, పాలస్తీనులో అలజడి కలిగింది. జర్మనీలో వారికి కలిగిన ఇక్కట్టులమూలంగా,అదివరలోకంటె ధారాళంగా యూదులకు పాలస్తీనులో నివాసం చూపించవలసిందని యూదుజాతీయ సంఘంవారు బ్రిటిషుప్రభుత్వంవారిని అడిగారు. సంవత్సరానికి 25000

మందికి ప్రవేశమం ఇవ్వవలసిందని వారు కోరారు. బ్రిటిషువారు శ్రద్ధగా ఆలోచించి 5500 మంది రావడానికి సమ్మతించారు. ఈవ్యాపార మేమీ అరబ్బులకు నచ్చలేదు. తీవ్రమైన తమ అసమ్మతిని తెలియజేశారు. అసమ్మతులవల్ల కార్యం లేదని గ్రహించి, గత అక్టోబరులో తిరగబడ్డారు. అల్లరులు తీవ్రమయాయి, యూదుల జోలికిమాత్రం పోలేదు. తమ కష్టాలన్నింటికీ బ్రిటిషువారు మూలమని నమ్మి వారిమీదా, వారి ప్రభుత్వం మీదా తిరగబడ్డారు. యథాప్రకారం బ్రిటిషువారు సైనికబలం ప్రదర్శించి తిరుగుబాటు అణిచివేశారు. అక్టోబరు నెలాఖరున బ్రిటిష కాలనీలమంత్రి పూర్వపు బాల్ఫరుప్రకటనను తిరిగి ఒక పర్యాయం సమర్థించాడు. అరబ్బులు కొంతకాలం హర్తాలుజరిపారు. ఆతరువాత హైకమిషనరుతో సంప్రతించి హర్తాలు ఆపుచేశారు. హైకమిషనరు వాచోప్పు, ప్రభుత్వంవారి ఎరుక లేకుండా చాటుదారులలో యూదులు దేశంలోకి ప్రవేశించకుండా కట్టుదిట్టం చేశాడు. యూదులకు కోపంవచ్చింది. ఈ సంవత్సరం ఆరంభంలో వారు తిరగబడ్డారు.

ఈవిధంగా జరుగుతోంది, పాలస్తీనులో బ్రిటిష పరిపాలన ఆరంభంలో ఆ బాల్ఫరు ప్రకటన ఏనాడు చేశారో, ఆనాటినుంచీ వారికి ప్రశాంతంగా కాలంగడవడం లేదు. ఏపని చేసినా, ఒక పక్కని అరబ్బులూ, ఒకపక్కని యూదులూ గగ్గోలుపెడతారు. ఇద్దరికీ కన్నీళ్ళు తుడవాలని ప్రయత్నించి ఎవరినీ సంతృప్తిపెట్టలేకపోతున్నారు. ఈవిషమ స్థితినుంచి బయటబడగలిగేవారే, సామ్రాజ్యతృష్ణ ఒకటి వారిని బాధించక పోతే. అసలు పాలస్తీనులో పాదంపెట్టడమే, బ్రిటిషసామ్రాజ్యం అంటే భారతదేశం దృష్టిలో పెట్టుకొని పెట్టారు. పెట్టినపాదం వారంతట వారు మళ్ళీ తీయడం వారికి ఇష్టమూ లేదు, అలవాటూ లేదు. పాలస్తీనులో అరబుజాతీయత పూర్తిగా విజృంభించి, అరబ్బులబలం ఎక్కువకావడమూ వారికి క్షేమం కాదు. యూదులనే పూర్తిగా కూడగట్టుకొని అరబ్బులను పూర్తిగా చెడనాడుకోవడము అసలే క్షేమంగా కనపడదు. అందుచే

అరబ్బుల సంఖ్యాధిక్యతహక్కుకూ భంగం రానియ్యమంటారు; యూదుల జాతీయవసతికీ భంగం రానియ్యమంటారు. ఆర్థికంగా, రాజకీయంగా యూదుల ప్రాముఖ్యం ఎక్కువ కావాలి. అరబుజాతీయతకు అడ్డుపడాలి. శాశ్వతంగా పాలస్తీనురక్షణకు బ్రిటిషువారు బాధ్యులై ఉండాలి. ఈ విధానం అనుసరించే పాలస్తీనులో బ్రిటిషురాజతంత్రం నడుస్తోంది. ఇందులోనుంచి విముక్తిజెందాలంటే, పాలస్తీను వాసులలో పరస్పరంగా ఐకమత్యం, సౌహార్దం అభివృద్ధిఅయి, మతసాంఘికాది విభేదాలన్నీ నూసి పోయి నిష్కళంకమైన జాతీయత ప్రబలంకావాలి.

# ట్రాన్సు జార్డను

ప్రస్తుతంలో పాలస్తీనుకు తూర్పున, జార్డన్ నదికి ఇవతలగా ఉన్న రాజ్యం మొదటలో ఫైజలురాజుఅధిపత్యంకింద ఏర్పడిన అరబు సిరియను రాజ్యంలో భాగంగా ఉండేది. సిరియాలో ఫైజలురాజుప్రభ అంతమై, ఆ దేశం ఫ్రెంచివారి స్వాధీనమైన తరువాత జార్డనునదికి తూర్పుగా ఉన్న ఈభాగం బ్రిటిషువారి చేతులలోకి జారింది. బ్రిటిషు సామ్రాజ్యశ్రేయస్సుకు ఈ భూభాగం అవసరం. పాలస్తీనునుంచి ఇరాకుమీదుగా ఇండియాకు మార్గం కలపాలంటే ఈప్రాంతం బ్రిటిషువారి అదుపాజ్ఞలలో ఉంటేనే గాని సాగదు.

పూర్వం, 1915 సం॥రంలో అరబురాజ్యం ఒకటి కల్పించి అతనిని అందలం ఎక్కిస్తామని హుసెయినుతో బ్రిటిషువారు చేసుకొన్న ఒడంబడిక ప్రకారం ఈభాగం హుసెయిను రాజ్యంలో చేరవలసిఉంది. మొదట ఇది ఫైజలు, సిరియారాజ్యంలో భాగంగా ఉండడానికి బ్రిటిషు వారు అభ్యంతరపెట్టలేదు. కాని, ఆ రాజ్యం పోయినతరువాత బ్రిటిషు వారే దీనికి ధర్మకర్త లయారు. 1920 సం॥రం సెప్టెంబరు 1 వ తేదీని ట్రాన్సుజార్డను అనే పేరుతో ఇది ఒక కొత్తరాజ్యంగా వెలిసింది. 1921 సం॥రం ఫిబ్రవరినెలలో ఫైజలురాజు అన్నగారు అబ్దుల్లా తమ్ముని దుర దృష్టానికి దుఃఖించి తగిన సహాయం చేయాలనే ఉద్దేశంతో ఈప్రాంతంలో మకాంచేశాడు. ఈ అదను కనిపెట్టి, ఇంగ్లీషువారు, పారిపోయిన ఫైజలుకు ఫరవాలేదని ధైర్యంచెప్పి, అబ్దుల్లానుకూడా రాజపీఠం ఎక్కిస్తామన్నారు. మార్చిలో అమీరుఅబ్దుల్లా ట్రాన్సుజార్డను రాజుగా మారాడు. పాలస్తీను విషయంలో వర్తించిన బాల్ఫరుప్రకటనా, తదనుసారమైన ఏర్పాటులూ ట్రాన్సుజార్డను రాజ్యానికి వర్తించవని బ్రిటిషువారు విశదంచేశారు. 1923 సం॥రం ఏప్రిలునెలలో బ్రిటిషుగవర్నమెంటు తరఫున పాలస్తీను హైకమిషనరు ఈ కిందివిధంగా వివరించాడు: "అమీరు అబ్దుల్లా పరి

పాలించే ట్రాన్సుజార్డనురాజ్యం స్వతంత్రరాజ్యమని బ్రిటిషుప్రభుత్వం అంగీకరిస్తోంది. దీనికి అంతర్జాతీయ సమితివారి అనుమతికూడా పొంద వలసి ఉంటుంది. అయితే, ట్రాన్సుజార్డను ప్రజలు తమ దేశంలో సక్రమ పరిపాలన స్థాపించుకొని బ్రిటిషువారికి ఉన్న అంతర్జాతీయ బాధ్యతలను నెరవేర్చడానికి సావకాశం ఉండేరీతిని వారితో ఒడంబడిక ఒకటి చేసు కోవలసి ఉంటుంది." ట్రాన్సుజార్డనును గురించి అంతర్జాతీయ సమితి వారి మాండేటుసంఘం సమక్షంలో బ్రిటిషు ప్రతినిధి ఈవిధంగా చెప్పాడు: "అది పాలస్తీనులో భాగంకాదు. కాని అంతర్జాతీయ సమితివలన బ్రిటిషు వారు పొందిన పాలస్తీను మాండేటుపత్రంలోని షరతులను అనుసరించి, వారు పరిపాలించవలసిన దేశంలో భాగం." 1923 సం॥రం మే 25 వ తేదీని యథావిధిగా ట్రాన్సుజార్డను స్వతంత్రరాజ్యమని ప్రకటించారు. ట్రాన్సుజార్డనుకూ ఇంగ్లాండుదేశానికీ ఒడంబడిక అమలులోకి వచ్చిన తరువాత ట్రాన్సుజార్డనుకు ప్రత్యేకంగా హైకమిషనరుపదవి ఒకటి కల్పించామన్నారు. పాలస్తీను హైకమిషనరుకే ఈ పదవికూడా ప్రసా దించారు. ఆరంభంలో ట్రాన్సుజార్డను ఖర్చులకు బ్రిటిషువారు కొంత డబ్బు పెట్టుబడిపెట్టక తప్పిందికాదు. కాని తరువాత దేశపు ఆయవ్యయాలు సరిపడేటట్టు చేయగలిగారు. ఈ దేశమంతా కలిస్తే మన ఒకజిల్లాఅంత ఉండదు. జనసంఖ్య మొత్తం మూడు లక్షలు. ఇంత చిన్నదేశానికి రాజూ, రాజ్యాంగం, బ్రిటిషు ఉద్యోగులూ మొదలైన తతంగము అంతా ఉండా లంటే ఖర్చు జాస్తీకాక తప్పదు.

అవసరమైన పక్కలను భూమి కొంత కలుపుకొని, బ్రిటిషువారు ట్రాన్సుజార్డను రాజ్యాన్ని కొంతవరకు పెంచారు. అదివరలో హెజాజు రాజ్యానికి చెందిన అకాబా, మాను అనే రెండుజిల్లాలు కలుపుకొన్నారు. ఇవి కలిస్తేనేకాని దేశానికి సముద్రపురేవు లేకపోయింది. సముద్రతీరాన్ని ఉన్న అకాబాపట్నం రేవుపట్నంగా అభివృద్ధిచేశారు. హెజాజురాజ్యం నెజ్దుపాలకుడైన ఇబున్‌సౌదురాజ్యంలో కలిసినతరువాత ఈ జిల్లాలు

రెండూ న్యాయంగా అతనికి చెందవలసి ఉంది. వీటిని బ్రిటిషువారు కలుపుకోడానికి అతను అంగీకరించలేదు. ఇదికాక నెజ్దురాజ్యానికీ, సిరియాకూ మధ్య నూరునూటఏభయిమైళ్ళ వెడల్పున కొంత భూభాగం విడదీశారు. దీనివల్ల అన్నదమ్ముల పాలనలో ఉన్న ట్రాన్సుజార్డను, ఇరాకు రాజ్యాలు రెండూ సరిహద్దు రాజ్యాలు అయాయి. ఇందుమూలంగా బ్రిటిషువారు పాలస్తీనునుంచి ఇరాకులోకి వేయదలచిన రైలుమార్గానికి నెజ్దుసిరియాలవారి ఆటంకం లేకుండాపోయింది. దీనికి ప్రతిఫలంగా ట్రాన్సుజార్డనులో చేరిఉండే కొంతభాగం నెజ్దుసుల్తానుకు ఈయక తప్పింది కాదు. 1925 సం॥రంలో ట్రాన్సుజార్డను నెజ్దుపాలకులు ఈ పరివర్తనదస్తావేజు వ్రాసుకొన్నారు. హెజాజురాజ్యం హుసెయినుఆలీ పాలనలో ఉన్నకాలంలో హెజాజు, ట్రాన్సుజార్డను, ఇరాకురాజ్యాలు మూడూ తండ్రి కొడుకుల స్వాధీనంలో ఉండేవి. ఈ మూడురాజ్యాలకూ రాజకీయంగా కూడా సంబంధం కల్పించాలని ప్రయత్నాలు జరిగాయి. ఈ విషయం గురించి 1923-24 సం॥రాలలో బ్రిటిషువారికీ, హుసెయిను రాజుకూ సంప్రతింపులు జరిగాయి. కాని గ్రహబలం చాలక, కొద్దిలోనే హుసెయిను పదభ్రష్టుడు కావడంవల్ల కుదరలేదు. సోదరుల పాలనలో ఉన్న ట్రాన్సు జార్డను ఇరాకురాజ్యాల విషయంలోమాత్రం ఈ అభిలాష గాఢంగా ఉంది. ఇరాకురాజు ఫైజలు 1923 సం॥రంలో అన్నగారి రాజధానిఅయిన అమ్మానునగరానికి వెళ్ళినప్పుడు ఒక సమావేశంలో బ్రిటిషువారూ, తదితరులూకూడా ఉండగా ఈవిధంగా మాటాడాడు: "మిమ్మల్ని తమలో వారినిగానే భావించే ఇరాకుప్రజలకు మీదేశపు అభివృద్ధి సంతోషదాయకం. అరబుదేశాలు స్వతహాగా అన్నీ ఒకటి. అన్ని అరబుదేశాలతోనూ ఐక్యమయే పర్యంతమూ ఇరాకుదేశం సంతృప్తిజెందదు. అరేబియాదేశసేవ ఒక్కటే నాకుఆదర్శం. ఈఆదర్శం సఫలమయేవరకూ నాకుశాంతికలుగదు. అరబుదేశాలు ఈమధ్య అనేకవిధాలుగా అభివృద్ధిచెందినప్పటికీ ప్రధానమైన ఈవిషయంలోమాత్రం ఏమీ జరగలేదనడం నిశ్చయం. అరబుదేశాలలోని

ప్రస్తుతపరిస్థితులు కేవలం అసహజం. అసహజమైన ఈ పరిస్థితులు స్థిరంగా ఉండడం అసంభవం. అచిరకాలంలోనే ఈపరిస్థితులు మారి. ఆరబ్బులందరూ అభిలషించే ఆదర్శస్థితి, ఆరబుదేశాలన్నీ ఐక్యమై అభివృద్ధిజెందే స్థితి చేకూరుతుందన్న గాఢనమ్మకం ఉంది నాకు''

తన తండ్రి హుసెయినుఆలీకి అరేబియారాజ్యాధిపత్యంతోపాటు ముసల్మానుమతాధిపత్యంకూడా పట్టంకట్టడానికి ప్రయత్నించాడు అమీరు అబ్దుల్లా. హుసెయినురాజు 1924 సం॥రం జనవరిలో పెద్దకొడుకును చూడడానికి వెళ్ళాడు. అప్పటికి అతని ప్రభ మహోచ్చదశలో ఉంది. అక్కడ ఉండగానే హుసెయిను ముసల్మానుమతాధిపత్యం వహించానని ప్రకటించాడు. కాని దుష్టగ్రహాల చూపు ఎక్కువయింది. కొద్దిలోనే ఇబున్‌సౌదునాయకత్వంకింద వాహబీలు హెజాజురాజ్యం జయించి ఆ తండ్రికొడుకుల ఆశలన్నీ అడుగంటేటట్టు చేశారు.

అమీరుఅబ్దుల్లాపరిపాలన సాగినకొద్దిలోనే ట్రాన్సుజార్డనులో ప్రజాస్వామికపరిపాలనకోసం ఆందోళన ఆరంభమైంది. 1927 సం॥ రం లో ప్రజాపక్ష మన్న పేరుతో ఒక పార్టీ ఏర్పడింది. అప్పట్లో, ట్రాన్సుజార్డను బ్రిటనుప్రభుత్వాలకు ఒడంబడిక ఒకటి స్థిరపరచుకొనేనిమిత్తం లండనులో సంప్రతింపులు జరుగుతున్నాయి. ప్రజాపక్షంవారు ఈ సంప్రతింపులలో ప్రజాభిప్రాయానికి ప్రాధాన్యం ఇవ్వాలన్నారు. పార్లమెంటు ఒకటీ, దానికి వశమైన మంత్రివర్గం ఒకటీ వెంటనే స్థాపించా లన్నారు. వార్తాపత్రికలు స్థాపించి ప్రజలలో ప్రచారం మొదలుపెట్టారు.

ట్రాన్సుజార్డనుకు రాజ్యాంగవిధానం ఒకటి తయారుచేసేనిమిత్తం గవర్నమెంటు దేశంలోని ప్రముఖులను కొందరిని సమావేశపరిచారు. కాని, వారు తయారుచేయడానికి బదులు గవర్నమెంటువారే ఒక రాజ్యాంగ విధానం సిద్ధంచేసి, దానిని ప్రతినిధులు ఆమోదించా లన్నారు. అందుకు వారు సమ్మతించలేదు. సమాధానం కుదరక, సమావేశం నిలుపు చేశారు. బ్రిటిషుగవర్నమెంటూ, ట్రాన్సుజార్డను గవర్నమెంటూ సంధి చేసుకొని,

సంధిపత్రం ప్రకటించారు (1928 సం॥రం లో).

ఈసంధిపత్రంలో బ్రిటిషువారు, ట్రాన్సుజార్డను స్వపరిపాలన గల రాజ్యమని అంగీకరించినప్పటికీ, సంపూర్ణస్వతంత్ర రాజ్యమనిమాత్రం ఒప్పుకోలేదు. సిరియా, ఇరాకుదేశాల రాజ్యాంగవిధానాలలో ప్రజలే సర్వాధికారానికీ మూలం అన్న విషయము ప్రథమఅంశం. ట్రాన్సుజార్డనులో మట్టుకు అమీరుదే సర్వాధికారమూను. ఇది అయినా బ్రిటిషువారు అనుమతించినంతలో. విదేశవ్యవహారాలలోనూ, ముఖ్యమైన ఆర్థికవిషయాలలోనూ పెత్తనం బ్రిటిషువారిది. ట్రాన్సుజార్డనులో బ్రిటిషుసైన్యాన్ని కాపురంపెట్టడానికీ, శాంతిసంరక్షణకు అవసరమని బ్రిటిషువారికి తోచినంత సైన్యం దేశంలో తయారుచేసి, వారి అదుపాజ్ఞలలో అట్టేపెట్టుకోడానికీ బ్రిటిషువారికి హక్కు ఉంది. సైన్యానికి అయే ఖర్చుమాత్రం ట్రాన్సుజార్డనుదే. సైనికశాసనం ప్రయోగించి, దేశంలో సైనికపరిపాలన సాగించే అధికారంకూడా ఉంది బ్రిటిషువారికి. బ్రిటిషుసైన్యాల రాకపోకలకు తగిన సౌకర్యాలు కలుగజేయవలసిన బాధ్యతమాత్రం ట్రాన్సుజార్డనుది. వ్యాపారాదిసౌకర్యాలు కలుగజేసేవిషయంలోనూ, రైళ్లనిర్మాణం, పరిపాలనా విషయంలోనూ, అప్పులుచేయడం విషయంలోనూ ట్రాన్సుజార్డను ప్రభుత్వం బ్రిటిషువారి సలహాప్రకారం నడవాలి. ఇదీ బ్రిటను-ట్రాన్సుజార్డనుఒడంబడిక. ఒడంబడికకు ఇన్నాళ్లు అన్న గడువులేదు, పరిస్థితులు మారి, మార్పు అవసరమని తోచినప్పుడుమట్టుకు మార్పుచేసుకోవచ్చునన్న షరతుమాత్రం ఒకటి ఉంది. ఈమాదిరిగా ఉన్న సంధిపత్రానికి ప్రజాభిప్రాయం సుముఖంగా లేకపోవడం ఆశ్చర్యం కాదు. దేశపు రాజ్యాంగ విధానమూ ఇదేవిధంగా ఉంది. అమీరుకు ఒక కార్యనిర్వాహక వర్గం ఏర్పరిచారు. ప్రధానమంత్రీ, మరిఅయిదుగురు మంత్రులూ ఇందులో సభ్యులు. మూడుసంవత్సరాలకు ఒకసారి శాసనసభకు ఎన్నికలు. శాసనసభకు ప్రధానమంత్రి ప్రెసిడెంటు. సభలో చేసిన తీర్మానానికి మంత్రివర్గం కట్టుబడి ఉండనక్కరలేదు. శాసనసభలో 16 గురు సభ్యులు. ఇందులో 13

గురు ముసల్మానులూ, 3 గురు క్రైస్తవులూను. 18 సంవత్సరాలకు పైబడిన ప్రతిపురుషునికీ వోటింగుహక్కు. 1928 సంవత్సరంలోనే శాసనసభ సమావేశమయ్యే యత్నం చేశారు. కాని ప్రజాప్రతినిధుల ప్రతిఘటనంవల్ల సాగలేదు. మొదటలో, ఈ ఆందోళన అణిచివేయాలని గవర్నమెంటువారు ప్రయత్నించారు. పత్రికలకూ, ప్రముఖులకూకూడా నిర్బంధం కలుగజేశారు. జాతీయనాయకులను కొంతమందిని దేశాంతరం వెడలగొట్టారు, కాని ఈచర్యలవల్ల ఆందోళన అణిగిపోలేదు.

1928 సంవత్సరం జూలై 25 వ తేదీని అమ్మానుపట్నంలో హుసెయిన్‌పాషాఎల్‌తర్వానా నాయకత్వంకింద నేషనలుకాంగ్రెసు ఒకటి సమావేశమైంది. యుద్ధకాలంనాటి ఆరబు - బ్రిటిషుసఖ్యం ఆలోచించమన్నారు బ్రిటిషువారిని కాంగ్రెసుప్రతినిధులు. ఇంగ్లాండు చేసిన వాగ్దానాలూ, అంతర్జాతీయసమితివారి నిబంధనలలో 22 వ అంశమూ (స్వయం నిర్ణయసూత్రం ఆధారంగా దేశాలకు స్వాతంత్ర్యం కలుగజేయడము), ప్రెసిడెంటువిల్సనుయొక్క పదునాలుగు అంశాల పత్రమూ, ఈమొదలైనవన్నీ మరిచిపోకూడదన్నారు. పాలస్తీనువిషయంలో బాల్ఫరుప్రకటన ఖండించారు. ట్రాన్సుజార్డనువిషయంలో ఈ విధంగా తీర్మానించారు; "ట్రాన్సుజార్డను సంపూర్ణంగా స్వతంత్రమైన ఆరబురాజ్యం. ఈ రాజ్యం అమీరుఅబ్దుల్లాఆధిపత్యంకింద స్వతంత్రమైన, సక్రమమైన పరిపాలనలో ఉండాలి. దేశస్వతంత్రానికి లేశమాత్రమైనా భంగం లేకుండా, దేశానికి అవసరమైన సందర్భంలో సహాయంపొందడం మినహాగా రక్షణ అనే విషయం మేము అంగీకరించము. సరియైన ప్రజాప్రాతినిధ్యం లేకుండా కల్పించిన శాసనసభతీర్మానాలు ఏవీ దేశాన్ని బంధించేవి కావు. మంత్రివర్గం శాసనసభకు లోబడిఉండనంతవరకు ప్రజాస్వామికప్రభుత్వం కాదు, ఈలాంటి సందర్భంలో శాసనసభ అని పేరుపెట్టినసభలో చేసిన తీర్మానాలన్నీ రక్షణబాధ్యత వహించామన్న ప్రభుత్వం నిర్బంధించి తన ఇష్టానుసారం చేయించిన తీర్మానాలే అవుతాయికాని, ప్రజాభిప్రాయం వ్యక్తంచేసే

తీర్మానాలుమాత్రం కాజాలవు. ట్రాన్సుజార్డనువిషయంలో బ్రిటిషువారు ఏవిధంగానైనా డబ్బు ఖర్చుచేస్తూఉంటే, అది కేవలం, తమ సామ్రాజ్య రక్షణకోసం చేసుకొన్న ఖర్చే కాని మరొకటి కాదు. ఈఖర్చుపేరు పెట్టి, ఈదేశపు ఆర్థికవిషయాలన్నీ బ్రిటిషువారి వశంలో పెట్టుకోడానికి వారికి ఏమాత్రమూ హక్కులేదు." ఈతీర్మానాలను అనుసరించి ప్రజలు ఎన్నికలను బహిష్కరించారు. చాలాకాలం ఎన్నికలు జరగలేదు. ట్రాన్సుజార్డను బ్రిటనుఒడంబడికను శాసనసభ ఆమోదించినట్టయితే, ఒడంబడిక ట్రాన్సుజార్డనుకు మరింత అనుకూలంగా ఉండేటట్టు మార్పుచేయడానికి సావకాశం ఉంటుందని బ్రిటిషువారు ఆశపెట్టారు. 1929 సం॥ రం ఫిబ్రవరినెలలో ఎన్నికలు జరిగాయి పేరుకు. చాలామంది బహిష్కరించారు. గవర్నమెంటును సమర్థించే పదిమందీ శాసనసభలో ప్రవేశించారు.

1929 సం॥ ఏప్రిలు 2 వ తేదీని యథావిధిగా శాసనసభాకార్యక్రమం ఉపక్రమించారు. తన ప్రారంభోపన్యాసంలో అబ్దుల్లారాజు ట్రాన్సుజార్డనుకు స్వాతంత్ర్యం సిద్ధించిందనీ, బ్రిటను - ట్రాన్సుజార్డను ఒడంబడిక ఆమోదించవలసిందనీ మాటాడాడు. జూన్ 4 వ తేదీని శాసనసభలో ఒడంబడిక ఆమోదించారు. ఇంగ్లాండురాజుకూడా ఒడంబడికను ఆమోదించారని ట్రాన్సుజార్డనుహైకమిషనరు తెలియజేశాడు.

ఆతరువాత సమావేశమైన ట్రాన్సుజార్డనుపార్లమెంటులో అబ్దుల్లారాజు బ్రిటిషువారి సఖ్యతకు కృతజ్ఞత వెల్లడించాడు. తన రాజలక్షణంగా 21 తుపాకులు పేల్చుకొనే అధికారం ఇంగ్లాండురాజు తనకు ప్రసాదించారని సంతోషించాడు. ట్రాన్సుజార్డను పరిపూర్ణస్వాతంత్ర్యం పొందడానికి తన యావచ్ఛక్తి వినియోగిస్తానన్నాడు. పాలస్తీను ఇరాకులతో తమకున్న సంబంధం స్పష్టంచేశాడు. ట్రాన్సుజార్డను ఇరాకుల సఖ్యం స్థిరపరుస్తూ, ఒడంబడిక ఒకటి జరుగుతుందని సూచించాడు. పాలస్తీను అరబ్బుల స్థితికి సానుభూతి వెల్లడించాడు.

బ్రిటిషుసామ్రాజ్య రక్షణవిధానంలో ట్రాన్సుజార్డను ఒక

ముఖ్యాంగం. (బాగ్దాదు, హైఫాలను కలిపే రైలుమార్గం ఈదేశంలో నుంచే పడుతుంది.) తమ ఆపత్కాలంలో అరబ్బులకు వారుచేసిన వాగ్దానాలు నెరవేరుస్తున్నాము అన్న మాట దక్కించుకోడానికి బ్రిటిషువారు పన్నిన ఉపాయం. ఈరెంటికీ కలిసివచ్చేటట్టుగా తయారుచేశారు బ్రిటిషువారు ట్రాన్సుజార్డను రాజ్యాంగవిధానం. దేశమేమో స్వతంత్ర మన్నారు. పరిపాలన దేశీయులదే అన్నారు. అయువుపట్టులుమాత్రం తమ గుప్పిటిలో పెట్టుకొన్నారు. ఆవిధంగా తమకు అక్కరలేని చాకిరీ అంతా దేశీయులకు అప్పగించి, స్వపరిపాలన అన్నమాట దక్కించుకొన్నారు.

ట్రాన్సుజార్డనురాజుకు బ్రిటిషువారు అండ. ఆయనకూ, కేవలం ప్రజాస్వామికప్రభుత్వమే ఆదర్శంగా పెట్టుకొన్న జాతీయవాదులకూ దేశ స్వాతంత్ర్యం విషయంలో ఏకాభిప్రాయం ఉండడం పొసగదు. ఈమధ్య (1933) రాజుగారూ, ఆయనను ఆశ్రయించిన ధనికులు కొందరూ తమ భూములను యూదులకు విక్రయించాలని ప్రయత్నించారు. ఈప్రయత్నం ప్రజాపక్షంవారికి ఎవరికీ ఇష్టములేదు. యూదులను దేశంలో ప్రవేశపెట్ట కూడదని వారి అభిప్రాయం. ఈ ప్రత్యేకసమస్యమాట ఏలా ఉన్నా, ఈ విధమైన భిన్నాభిప్రాయంతో ట్రాన్సుజార్డను పూర్తిగా స్వతంత్రంకావడం కష్టమనడం నిశ్చయం.

# ఇరాకు

ఇరాకురాజ్యం సిరియాకూ, ట్రాన్సుజార్డనుకూ సరిహద్దు. దీనినే మెసొపొటేమియా అనికూడా అంటారు. ఇది చాలా ఫలవంతమైన దేశం. మూడునాలుగువేల సంవత్సరాలకిందటే, ఈ ఫలవంతప్రదేశంలో ప్రశంసనీయమైన నాగరకత వర్ధిల్లింది. మానవచరిత్రలో మొట్టమొదటి అంకాలు కొన్ని ఈప్రాంతంలోనే ప్రదర్శితమయాయని శాస్త్రజ్ఞులు చెపుతారు. అతి ప్రాచీనకాలంలో ఒక వెలుగు వెలిగి, ఈదేశపు మంటిలో పూడిపోయిన నాగరికతచిహ్నాలు తవ్వి బయటబెట్టారు. చరిత్రప్రసిద్ధమైన బాబిలను నగరం ఈదేశంలోనిదే. ప్రపంచంలోకంతకీ అతిప్రాచీనమైన నాగరికత ఈభూమిలోనే వెలిసిందని కొందరు శాస్త్రజ్ఞుల వాదం.

పురాతనకాలంలో పూడిపోయిన ఈనాగరికతకూ, ఇరాకులో ప్రస్తుతమున్న ప్రజలకూ సంబంధం లేదు. మహమ్మదీయమతవిజృంభణంతో ఈ ప్రాంతంకూడా ఆమతంలో కలిసింది. దేశంలో నివసించే జనమంతా అరబ్బులు. మొత్తంజనసంఖ్య సుమారు 30 లక్షలు. ఇందులో పాతిక లక్షలకుపైగా ముసల్మానులు. వీరిలో రెండుశాఖలు : షియాలూ, సున్నీలూను. ఈ రెండుతెగలవారూ ఇంచుమించు సరిసమానంగా ఉంటారు, పలచపలచగా క్రైస్తవులూ, యూదులూ ఉన్నారు.

తుర్కీవారి ఆరబురాష్ట్రాలలో ఇరాకు ఒకటి. గత యూరపుయుద్ధకాలంలో బ్రిటిషువారు భారతదేశపు సేనలతో ఈ దేశం జయించారు. ఆ కాలంలో మన పల్లెటూళ్లలో జనానికికూడా పరిచయమైన బస్రాపట్టణం ఈ దేశంలోనే ఉంది. ఈ దేశానికి జీవం టైగ్రిసు, యూఫ్రటీసునదులు. ఈ నదుల నీటివల్ల సాగుకాదగిన భూమి సుమారుగా ఒక కోటియకరాలవరకూ ఉంటుంది. దేశంలో గోధుమలూ, యవలూ, వరిధాన్యం పండుతాయి. పత్తిపంట ఈ మధ్య వ్యాపించింది. ప్రపంచంలో ఉత్పత్తిఅయ్యే ఖర్జూరంలో

అత్యధికభాగం ఈదేశంలోనే పండుతుంది. వీటన్నింటికంటే, ఇరాకురాజ్య చరిత్రలో ప్రాముఖ్యత వహించినది కిరసనాయిలు. ఇరాకుఇక్కట్లు కొంతవరకు దీనిమూలంగానే అని చెప్పవచ్చు. యుద్ధానంతరం పాశ్చాత్య ప్రభువుల దృష్టి ఇరాకుమీద ప్రసరించడానికి గల ముఖ్యకారణాలలో ఇది ఒకటి. తుర్కీవారి హయాములో ఉండగానే (1904 సం॥ రం నుంచీ) ఈ దేశపు నూనెనూతులకోసం పాకులాట ఆరంభమైంది. అప్పట్లో తుర్కీతో సఖ్యంగా ఉండి, జర్మనీవారు, నూనెపడే భూములకోసం వెద కడం ఆరంభించారు. ఈ ప్రాంతంలో ఉన్న పర్షియాలో కిరసనాయిలుభూములు అప్పటికే బ్రిటిషువారు సంపాదించారు. ఈ రెండుదేశాల ధనికులకూ పోటీపడింది మొదట. కాని, 1912 సం॥ రం లో సమాధానపడి టర్కీషుపెట్రోలియంకంపెనీ అనే పేరుతో ఒక జాయంటుకంపెనీ స్థాపించుకొన్నారు. దీని మూలధనంలో నూటికి 5 వాటాలు ఒక ఆర్మీని యను దేశస్థునివీ, 47½ బ్రిటిషువారివీ, 22½ డచ్చివారివీ, 25 జర్మనీవారి వీని. జర్మనీయుద్ధం ముగిసినతరువాత జర్మనీవారి వాటా ఫ్రెంచివారికి దక్కింది. ఈ వాటాలపంపకానికి అమెరికనుధనికులు కొంత అభ్యంతరం చెపితే, బ్రిటిషువారి వాటాలో సగం వారి కిచ్చి ఊరుకోబెట్టారు. ప్రస్తుతంలో ఈకంపెనీధనం బ్రిటిషుఫ్రెంచిఅమెరికను డచ్చివారికి ఒక్కొక్కరికి 23¾ వాటాలు ఉంది 1925 సం॥ రంలో ఈకంపెనీ ఇరాకుపెట్రోలియంకంపెనీ అనే పేరుతో ఒకటిరెండు జిల్లాలుతప్ప మిగిలిన దేశంలో ఉన్న నూనెగనులన్నింటికీ కంట్రాక్టు సంపాదించింది. వీరికి మినహాయించిన జిల్లాలు ఆవరకే బ్రిటిషుసాహుకార్ల తాలూకు ఆంగ్లోపర్షియను ఆయిలుకంపెనీకి వాగ్దానమయాయి. 1926 సం॥ రం లో ఆకంపెనీ ఈజిల్లాల కంట్రాక్టు స్థిరపరుచుకొంది. పర్షియాలో స్థిరపడిన ఈ బ్రిటిషు కంపెనీ, ఇరాకులో సంపాదించిన ఆస్తి అభివృద్ధిచేసేనిమిత్తం ఖనాక్టిన్ ఆయిలుకంపెనీ అనే పేరుతో ఒక పిల్లకంపెనీని ఏర్పరిచింది. 1927 సం॥ రంలో బ్రిటిషుధనికుల యాజమాన్యంకిందే బ్రిటిషుఆయిల్ డెవలప్‌మెంటుకంపెనీ అనే మరొక కంపెనీ ఏర్పడింది.

ఇరాకురాజ్యం బ్రిటిషువారు జయించిన కొత్తలో కొంతకాలం సైనికపరిపాలనే సాగింది. ఆరంభంలో, సిరియారాజ్యం, ఫైజలురాజు పాలనలో ఉన్నప్పుడు (1920, మార్చి) ఇరాకులో ఒక తిరుగుబాటు వచ్చింది. ఫైజలు సిరియారాజ్యంలో ఇరాకుదేశీయులు చాలామంది ఉద్యోగులుగా ఉండేవారు. వీరు డమాస్కసుపట్నంలో మెసొపొటేమియను కాంగ్రెసు ఒకటి సమావేశపరిచారు. మెసొపొటేమియా స్వతంత్రరాజ్యంగా ప్రకటించి ఫైజలుఅన్నగారైన అబ్దుల్లాకు పట్టంగట్టాలని ఉద్దేశించారు. కాని వీరి ఉద్దేశం సఫలంకాలేదు. సాన్‌రీమోసంప్రతింపుల ఫలితంగా ఇరాకురక్షణబాధ్యత బ్రిటిషువారిమీఁద పడింది. బ్రిటిషురక్షణ పొందడానికి ఇష్టంలేకనే తిరుగుబాటు కలిగింది. దేశంలో సక్రమమైన స్వపరిపాలన స్థాపించడమే తమ కర్తవ్యమనీ, స్వరాజ్యం చేసుకొనే సామర్థ్యం దేశీయులకు సమకూరేవరకే తమ రక్షణ ఉంటుందనీ వివరించి, బ్రిటిషువారు ప్రజాభిప్రాయం కొంతవరకు తమకు సుముఖంగా చేసుకొందామని చూచారు. కాని లాభంలేకపోయింది. సైనికబలంచేత విప్లవం అణిచివేశారు. ఇటువంటి కార్యాలకు అందుబాటులో ఇండియాదేశపు సైన్యం ఉందిగా !

1920 సం॥రం అక్టోబరులో సర్ పెర్సీ కాక్సు అనేఆయన బ్రిటిషు హైకమిషనరుగా వచ్చాడు. రావడంతోనే, దేశీయులు జాతీయప్రభుత్వం సాపించుకొనే సందర్భంలో తగిన సహాయంచేయడమే బ్రిటిషువారి ఉద్దేశమనీ, ఆఉద్దేశం నెరవేర్చడమే తను రావడానికి కారణమనీ ప్రకటించాడు. తాత్కాలికమంత్రివర్గం ఒకటి నియమించాడు. బాగ్దాదునగరానికి నకీబుగా ఉన్న అబ్దుల్‌రహమాను అనేఆయన మంత్రివర్గానికి ఆధిపత్యంవహించాడు. బస్రాపట్టణపు నకీబుకుమారుడు సయ్యదు తలీబుపాషా అనేఆయన ఒక మంత్రి. ఇతను విద్యావంతుడూ, ప్రజల గౌరవం పొందినవాడూను. ఈ నకీబులు చాలా ప్రాచీనమైన గౌరవకుటుంబాలకు చెందినవారు.

దేశానికి స్వరాజ్యవిధానం తయారుచేయడానికి ప్రజాప్రతినిధుల

సభ ఒకటి సమావేశపరచడం మంత్రివర్గానికి ప్రథమకార్యం. మంత్రులు ఇందుకు వలసిన కృషి చేయడం ఆరంభించారు. కాని వీరి కృషి కొనసాగ లేదు. అప్పట్లో బ్రిటిషుకాలనీలమంత్రిగా ఉన్న చర్చిలు అడ్డపడ్డాడు. చర్చిలుకు అంతరంగికోద్యోగి అయిన లారెన్సుకు ఫైజలురాజు ఆప్తుడు. సిరియారాజ్యంనుంచి ఫ్రెంచివారు లేవగొట్టినతరువాత ఫైజలు బ్రిటిషు వారి పంచనే కాలంగడిపాడు. లారెన్సుపుణ్యమా అంటూ, చర్చిలు శుభదృష్టి ఫైజలుమీద ప్రసరించింది. ఇరాకురాజపీఠంమీద అతనిని కూర్చోబెట్టడానికి బ్రిటిషుమంత్రులు నిశ్చయించారు. మెసొపొటేమియా లోని హైకమిషనరుకు ఈవర్తమానం తెలియబరిచి తగిన సన్నాహం చేయవలసిం దన్నారు. మంత్రిగా ఉన్న తలీబుపాషా అంటే ప్రజలకు చాలా గౌరవం. దేశానికి రాజంటూ ఒక డుండవలసివస్తే, ఆపదవి తలీబుపాషాకు తప్పనట్టుగా కనపడింది. అందుచేత అతను దేశంలో ఉండడం బ్రిటిషుమంత్రుల ఎత్తుకు ప్రతిబంధకమైంది. ఏదోవిధంగా ఈ తలీబుపాషా ఆటంకం తొలగించాలని నిశ్చయించారు. హైకమిషనరు భార్య విందొకటి ఏర్పాటుచేసి తలీబుపాషాను ఆహ్వానించింది. పాషా, సందేహమేమీ లేకుండా విందారగించడానికి వెళ్ళాడు. అక్కడ కులాసాగా కాలక్షేపం చేసి, ఇంటికి వెళ్ళడానికి బయలుదేరే సమయంలో తలీబు పాషాను అరెస్టుచేసి ఆదారినే సింహళద్వీపానికి ప్రవాసం పంపించారు. ఈ ఆటంకం తొలగడంతోనే ఫైజలుకు రాజపదవి స్థిరపడింది. జిడ్డా పట్నంనుంచి బ్రిటిషుయుద్ధనౌకమీద సురక్షితంగా ప్రయాణంచేసి, జూన్ నెలాఖరుకు ఫైజలు బాగ్దాదునగరానికి వేంచేశాడు. ఇరాకులో ప్రభువులేని ప్రజాస్వామ్యం (రిపబ్లికు) పనికిరాదని బ్రిటిషువారు ముందుగా శాసించారు. దేశానికి సర్వవిధాలా తగిన రాజు ఫైజలు అని ప్రకటించారు. మంత్రివర్గపు ప్రముఖులు మరుమాట లేకుండా సమ్మతించారు. ప్రజాభీష్టం తెలుసుకొనే నిమిత్తం ఎన్నికలు జరుగుతా యన్నారు. ఫైజలుకు అనుకూలమయ్యే రీతిగా ఎన్నికలుజరిపి అధికసంఖ్యాకులు ఆమోదించా రన్నారు. 1921

సం॥రం ఆగస్టు 23 వ తేదీని ఫైజలు ఇరాకురాజపీఠం అధిష్ఠించాడు. అంత వరకూ కృషిచేసిన తాత్కాలికమంత్రివర్గం రాజీనామా ఇచ్చినతరువాత, నకీబు ప్రధానమంత్రిగా మరొక మంత్రివర్గం ఏర్పడింది.

కాని దేశంలో అలజడిమాత్రం తగ్గలేదు. ఇరాకుదేశానికి రాజ పీఠం ఒకటి లభించినప్పటికీ, ఇరాకుబ్రిటనుదేశాల కున్న పరస్పర సంబంధం స్పష్టంకాలేదు. దేశీయులకు మాండేటు అనే మాట పనికి రాలేదు. మాండేటు రద్దుచేసి దానిస్థానే ఇరాకుదేశం స్వతంత్రరాజ్యమని ఒప్పుకొంటూ, బ్రిటిషువారు కొత్తగా సంధిచేసుకోవా లన్నారు. రాజుకూ, మంత్రివర్గానికీకూడా ఇదే ఉద్దేశం. షియాముసల్మానులకు ముఖ్యమైన పుణ్యక్షేత్రాలు (కర్బాలా, నజాపుపట్నాలు) ఇరాకులో ఉన్నాయి. వీటి తాలూకు మౌల్వీలు బ్రిటిషుగవర్నమెంటు రక్షణకు వ్యతిరేకంగా ఆందోళన ఆరంభించారు. షియాసున్నీభేదం లేకుండా దేశవాసులంతా ఏకమై బ్రిటిషు వారి రక్షణఅధికారం ఖండించారు. వారి రక్షణఅధికారం ఆధారంగా చేసుకొని బ్రిటిషువారు తయారుచేసిన చిత్తుఒడంబడికకు బలవంతంవల్ల మంత్రివర్గంమాత్రం తలఊపింది. కాని ప్రత్యేకంగా ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులు సమావేశమై ఆమోదిస్తేనేకాని ఒడంబడిక అమలులోకి రాకూడదని మంత్రులు షరతుపెట్టారు. హైకమిషనరు ఈ షరతు తీసివేయమన్నాడు. వారు వినలేదు. జాతీయభావం అణిచివేయడానికి బ్రిటిషువారు నిర్బంధచర్యలు ఆరంభించారు. జాతీయాశయాలు గల ఆరబు ఉద్యోగులను తొలగించి వారిస్థానే బ్రిటిషువారిని నియమించారు. పత్రికలకు నిర్బంధం ఎక్కువచేశారు. సభలూ, సమావేశాలూ నిషేధించారు. జాతీయ వాదుల పార్టీలను అణిచిపెట్టి తమ కనుకూలమైన మితవాదపార్టీనిమాత్రం ప్రోత్సహించారు.

నకీబుమంత్రివర్గం రాజీనామా దాఖలుచేసింది. ఆగస్టు 21 వ తేదీని జాతీయవాదులంతా కలిసి, బ్రిటిషువారి నిర్బంధచర్యలు ఖండిస్తూ ఒక ప్రకటన చేశారు. ఆగస్టు 23 ఫైజలురాజు సింహాసనమెక్కిన రోజు.

రాజుగారిని అభినందించడానికి హైకమిషనరు ఆస్థానానికి వెళ్ళాడు. ప్రజలు ఆయనచుట్టూ గుమిగూడి బ్రిటిషువారి చర్యలు అక్రమమని గోల చేశారు. దేశం తమ చేతుల్లోనుంచి జారిపోతోం దనే తోచింది హైకమిష నరుకు. దేశశాంతికి ఉపద్రవం సంభవించిందని బ్రిటిషువారే బహిరంగంగా పరిపాలన సాగించారు. పత్రికలేవీ ప్రచురించకూడదన్నారు. జాతీయవాదుల పార్టీలు రద్దుచేశామన్నారు. నాయకులను దేశంలోనుంచి వెడలగొట్టారు. ఆపరిస్థితులలో ఇరాకు బ్రిటనుప్రభుత్వప్రతినిధులు సంధిపత్రంమీద సంత కాలుపెట్టారు (1922, అక్టోబరు 10). ఇరాకుకు సత్వరంగా స్వాతంత్ర్యం సిద్ధించే ఏర్పాటు చేస్తామని, సంధిపత్రంతోపాటుగానే, బ్రిటిషుగవర్న మెంటు మరొక ప్రకటన చేసింది.

ఈసంధివల్ల బ్రిటనుదేశం ఇరాకురాజు కోరినప్పుడల్లా దేశస్వాతం త్ర్యానికి భంగంలేకుండా, సలహాఇచ్చి సహాయంచేయడానికి పూచీపడింది. ఇంగ్లీషువారిని మినహాయించి మరేవిదేశీయులనూ మెసొపొటేమియాలో ఉద్యోగులుగా నియమించకూడదు. ఒడంబడిక చెల్లినంతకాలమూ, ఆర్థికఅంతర్జాతీయవిషయాలన్నింటిలోనూ ఆధిపత్యం బ్రిటిషువారిది. సాధ్య మైనంత త్వరలో ఇరాకు అంతర్జాతీయసమితిలో ప్రవేశించడానికి వారు తమ పలుకుబడి ఉపయోగించి సహాయంచేస్తా మన్నారు. తమకున్న అంతర్జాతీయబాధ్యతలకు భంగంలేనంతవరకు వ్యాపారాదివిషయా లలో ఇరాకు ఇతర అరబురాజ్యాలతో కలిసిమెలిసి ఉండడానికి అభ్యంతర పెట్టమన్నారు. ఒడంబడిక వాయిదా 20 ఏళ్లు. ఇరాకు ప్రజాప్రతినిధులు ఆమోదిస్తేనేగాని ఒడంబడిక అమలులోకి రాకూడదని. షరతు బ్రిటిషు-ఇరాకు ఒడంబడికను ఆశీర్వదించినవాళ్లెవరూ ఇరాకులో కనపడలేదు. దేశమందంతటా తీవ్రంగా విమర్శించారు. ఈసమయంలోనే తుర్కీ-కమాల్‌పాషానాయకత్వంకింద పాశ్చాత్యరాజ్యతంత్రజ్ఞుల పాశాలలోనుంచి బయటబడగలిగింది. తుర్కీకికలిగిన విజయంఇరాకుకు ఉత్సాహప్రదమైంది. ప్రజాప్రతినిధుల సభకు 1922 సం॥ రం ఆఖరున జరుగవలసిన ఎన్ని

కలు, ప్రజలంతా బహిష్కరించడంవల్ల, ఆగిపోయాయి. అంతక్రితం లండనుపట్నానికి పోయిన హైకమిషనరు ఏప్రిలునెలలో తిరిగివచ్చి, ఒడంబడికవాయిదా 20 ఏళ్లనుంచి నాలుగేళ్లకు తగ్గించడమైందని ప్రకటించాడు. ఆలోగానే ఇరాకుకు అంతర్జాతీయసమితిసభ్యత్వం లభించే సందర్భంలో అంతటితోనే బ్రిటిషువారి మాండేటు ఆఖరవుతుం దన్నాడు. అసలు ఒడంబడికలో, విదేశీయులు సంబంధమున్న దావాలన్నీ బ్రిటిషుజడ్జీలే విచారించాలన్న షరతు ఒకటి ఉంది. ఈ షరతుకూడా మాండేటుతో పాటుగానే రద్దవుతుం దన్నాడు. ఈ మార్పులతో ప్రజాభిప్రాయం కలిసివస్తుం దని హైకమిషనరు ఆశించాడు. కాని లాభంలేకపోయింది. అసలు, మాండేటుకే ఒప్పుకోని జాతీయవాదులకు నాలుగేళ్లగడు వయినప్పటికీ అది రుచించలేదు. ఒడంబడికలో ఈసవరణలు సూచించినప్పుడే సర్ పెర్సీ కాక్సు ఉద్యోగం ఆఖరైంది. ఆయనస్థానే సర్ హెన్రీడాబ్సు వచ్చాడు. సవరణచేసిన ఒడంబడిక ఆమోదించేనిమిత్తం ఎన్నికలుజరిపి ప్రజాప్రతినిధుల సభ సమావేశపరచబోతే అప్పుడూ సాధ్యంకాలేదు. మెసొపొటేమియాలో ప్రముఖులైన షియామతగురువులందరూ కలిసి, ఎన్నికలు బహిష్కరించవలసిందని ప్రకటించారు. వారిలో ప్రధానుణ్ణి అధికారులు అరెస్టుచేసి దేశాంతరం వెడలగొట్టారు. కొంతమంది అసమ్మతి తెలియజేస్తూ వారంతటవారే పర్షియాదేశానికి లేచిపోయారు. ఆతరువాత ఏదోవిధంగా జరిగాయి ఎన్నికలు. 1924 సం॥రం మార్చిలో ప్రజాప్రతినిధిసభ సమావేశమైంది. రాజుగారి ప్రారంభోపన్యాసంలో మెసొపొటేమియాయొక్క ప్రాచీనఔన్నత్యం నుతించాడు. స్వాతంత్ర్యదేశంగా వర్ధిల్లిన అప్పటి మహోచ్ఛదశకూ, పారతంత్ర్యంలో సంభవించిన ఇటీవలి నీచదశకూ తారతమ్యం చూపించాడు. ఇరాకు తిరిగి పూర్వౌన్నత్యం పొందుతుందని ఆశించాడు. ఇస్లాముమతోపదేశానుసారం పదిమంది పెద్దలూ సంప్రతించి కార్యం కొనసాగేపద్ధతి అవలంబించవలసిందని సలహాఇచ్చాడు. దేశానికి ముఖ్యమైన సమస్యలు మూడున్నా యన్నాడు. విదేశవ్యవహారాలలో

బ్రిటిషు ఇరాకుఒడంబడిక, స్వదేశంలో రాజ్యాంగవిధానం, ఎన్నికల శాసనమూను. గవర్నమెంటు ఆశించినంత అణకువ ప్రజాప్రతినిధులు కనబరచలేదు. మొట్టమొదటనుంచీ మొదలుపెట్టారు విమర్శన. బ్రిటిషు-ఇరాకు ఒడంబడికా, తత్సంబంధమైన సవరణా ప్రచురించడంతోనే మరింత అలజడి హెచ్చింది. ఒడంబడిక తోసిపుచ్చవలసిందన్న ప్రచారం ప్రబలమైంది. ప్రజలంతా ఏకమయారు. ఒడంబడికకు నాలుగుసంవత్సరాల గడువు కాగితంమీదనేగాని బ్రిటిషువారికి కాదనీ, ఈలాంటి ఒడంబడికలు ఈజిప్టులో చేయలేదా, బ్రిటిషువారు అక్కడనుంచి లేచిపోయారా, వారిని నమ్మడ మేలాగనీ ప్రజ లనుకొంటూన్నట్టు లండనుపైమ్సుపత్రిక విలేఖరి ఇరాకునుంచి వ్రాశాడు. సంధినిగురించిన సంప్రతింపులు ఆఖరయేటట్టు కనపడలేదు. ఎంతకాలం ఆలోచించినా సమాధానం కుదరలేదు. చివరకు బ్రిటిషుప్రధానమంత్రి మాక్డొనాల్డు "ఒడంబడికకు ఒప్పుకోకపోతే మాకు వచ్చిన లోటు లేదు. ఒడంబడికా, ఒప్పుకోవడం ఈతంతు అంతా కట్టిపెట్టి, మా రక్షణబాధ్యత మేము స్వయంగా నెరవేర్చుకొంటాము" అని కబురుచేశాడు. ఇరాకు మంత్రివర్గానికి ఖంగారు ఎక్కువైంది. హడావిడిగా చేతికి దొరికినంతమంది ప్రజాప్రతినిధులను తెచ్చి సభాభవనంలో కూర్చోబెట్టారు. నూరుమంది సభ్యులకూ 69 గురు మాత్రం సమావేశంకాగలిగారు. ఒడంబడిక అంగీకరించడమా, మానడమా అనేవిషయం వోటుకుపెట్టారు. 39గురు అంగీకరించామన్నారు. 24 గురు పనికిరాదన్నారు. ప్రభుత్వంవారు రాజ్యాంగవిధానం ఒకటీ, ఎన్నికల శాసనం ఒకటీ ఆసమయంలోనే సభలో ఆమోదింపజేశారు. ఇంతటితో ఆ అసెంబ్లీపని తీరింది. దాన్ని రద్దుచేసి కొత్తగా ఎన్నికలు జరిపి 1925 సం॥రం నవంబరు 1 వ తేదీని కొత్తపార్లమెంటు సమావేశపరిచారు. ఇరాకురాజ్యాంగవిధానం ప్రశంసనీయంగానే తయారుచేశారు. ఇరాకు సర్వాధికారం గల సంపూర్ణస్వతంత్రరాజ్యమని కాన్స్టిట్యూషనులో ఉదహరించారు. ఆరాజ్యానికి మతం ఇస్లాము; భాష అరబ్బీ. ప్రజాప్రతి

నిధుల సభ, పెద్దల సభ ఈ రెండూ కలిసి పార్లమెంటు. 20,000 మంది ప్రజలకు ఒక్కొక్క ప్రతినిధిచొప్పున 88 గురు ప్రజాప్రతినిధిసభలో సభ్యులు. పెద్దలు 20 మంది; రాజుగారు స్వయంగా ఏరుకొన్నవాళ్లు. పార్లమెంటు ప్రతిసంవత్సరం నవంబరు 1 వ తేదీని సమావేశంకావాలి. పార్లమెంటులో రెండుపార్టీలు ఏర్పడ్డాయి. గవర్నమెంటుపక్షాన్ని సహకార వాదులు 52 రు. జాతీయవాదులు గవర్నమెంటుకు వ్యతిరేకం.

## 2

ప్రథమ మెసొపొటేమియను పార్లమెంటు 1925 సం॥రం జూలై 16 వ తేదీని సమావేశమైంది. సమావేశంకాగానే క్లిష్టసమస్య ఒకటి తటస్థించింది. ఇరాకుకు ఉత్తరప్రాంతంలో, తుర్కీసరిహద్దున మోసలు అనే జిల్లా ఒకటి ఉంది. ఇది కుర్దులనే ఒక తెగవారికి నివాసం. ఈ కుర్దులు తుర్కీసామ్రాజ్యకాలంలోనే స్వతంత్రంకోసం తిరగబడ్డారు. కాని సాధ్యంకాలేదు. మోసలులో కిరసనాయిలు పుష్కలంగా ఉంది. అంతర్జాతీయసమితికి కుర్దులక్షేమం ఆలోచించడం అవసరమైంది. కుర్దులంతా కలిసి పాతికముప్ఫయిలక్షలవరకూ ఉంటారు. ఇందులో 15లక్షలు తుర్కీలోనూ, 7 లక్షలు పర్షియాలోనూ, అయిదారులక్షలు మోసలులోనూ ఉన్నారు. తమకుజాతీయస్వాతంత్ర్యం సమకూర్చవలసిందని కుర్దుప్రముఖుడైన షరీపుపాషా వర్సెయిల్సుసంధి సమావేశంలో వాదించాడు. తుర్కీపంపకపు ఆత్రతలో మిత్రమండలి ప్రముఖులు కుర్దుస్వాతంత్ర్యసిద్ధాంతం అంగీకరించారు. అప్పట్లో తయారుచేసిన సెవర్సుసంధిపత్రంలో కుర్దుల రాజ్యానికి సరిహద్దులుకూడా సూచించారు. కాని కమాలుపాషా కత్తి దెబ్బతో సెవర్సుసంధీ, దానితోపాటు కుర్దురాజ్యం అంతరించింది. 1923 సం॥రంలో తుర్కీకీ, మిత్రమండలికీ కొత్తగా సంధిజరిగింది (లాసను సంధి). ఈ ఒడంబడిక ననుసరించి, తుర్కీఇరాకు సరిహద్దు తుర్కీబ్రిటనుదేశాలు సమాధానపడి నిర్ణయించుకోవాలి. తొమ్మిదినెలలలోపుగా ఇది సాధ్యంకాకపోయినట్లయితే, లీగ్ఆఫ్ నేషన్సుకౌన్సిలు చెప్పినట్టు

ఒప్పుకోవాలని నిర్ణయం. లీగుకౌన్సిలులో తుర్కీకికూడా సరిసమాన ప్రతిపత్తితో సభ్యత్వం ఉంటుందనీ, కౌన్సిలుతీర్మానం ఏకగ్రీవంగా ఉంటేనే చెల్లదగిఉంటుందనీ బ్రిటిషుప్రతినిధి కర్జన్‌ప్రభువు తుర్కీవారికి నచ్చజెప్పాడు. తుర్కీ-బ్రిటనుదేశాలకు మోసలును గురించి సంప్రతింపులు జరిగాయి. అదివరలో లేని షరతులు కొన్ని అదనంగా సూచించారు బ్రిటిషురాజతంత్రజ్ఞులు. సమాధానం కుదరలేదు. 1924 ఆగస్టులో ఈ సమస్య లీగ్‌ఆఫ్‌నేషన్సు కౌన్సిలు సమక్షంలోకి వచ్చింది. లీగుకౌన్సిలువారు మోసలుజిల్లాలో పరిస్థితులు పరిశీలించి తెలియజేయడం నిమిత్తం సంఘం ఒకటి నియమించారు. ఆసంఘనివేదిక తయారయేలోగా, తుర్కీ-ఇరాకుసరిహద్దు యథాపూర్వంగానే ఉండా లన్నారు. పూర్వపుసరిహద్దు ఏది అన్నవిషయాన్ని గురించి తగాదావచ్చి కత్తులుదూసుకొనేపర్యంతం వచ్చేటట్టు కనపడింది. లీగుకౌన్సిలు హడావడిగా బ్రసెల్సునగరంలో సమావేశమై తాత్కాలిక సరిహద్దు ఒకటి ఏర్పరిచారు (బ్రసెల్సుహద్దు). ఆ తరువాత మోసలు విచారణసంఘంవారు బ్రసెల్సుహద్దుకు దక్షిణంగా ఉన్న భాగమంతా ఇరాకుకే ఇయ్యవలసిందని సలహాచెప్పారు. ఇరాకు 25 సంవత్సరాలపాటు బ్రిటిషురక్షణలో ఉండేటట్టూ, కుర్దుల జాతీయతకు భంగం కలుగజేయకుండా ఉండేటట్టూ షరతులుపెట్టా లన్నారు. 1925లో సంఘంవారి సలహా లీగుకౌన్సిలులో చర్చించారు. అదివరలో అనుకొన్న ప్రకారం తీర్పు ఏకగ్రీవంగా ఉంటేనే ఒప్పుకొంటా మన్నారు తుర్కీవారు. తుర్కీవారి ప్రతినిధి హాజరుగా లేనిసమయం చూచి, బ్రసెల్సుహద్దే స్థిరమైన సరిహద్దుగా చేయడమైందని లీగుకౌన్సిలులో తీర్మానించారు. బ్రిటిషురక్షణలో ఉండాలన్న 25 సంవత్సరాల గడువులోగానే, ఇరాకు రాజ్యానికి అంతర్జాతీయసమితిసభ్యత్వం లభించే సందర్భంలో బ్రిటిషు మాండేటు అంతవరకే ఉంటుందన్నారు. మోసలునుగురించిన ఈతీర్పు తుర్కీవారికి నచ్చలేదు. మోసలుఅవసరం ముఖ్యంగా బ్రిటిషువారి కన్న మాట వా రెరుగుదురు. బ్రిటిషువారు ఈజిల్లాను తుర్కీ-రష్యాలకు అడ్డుగా

పెట్టుకొన్నారు. మోసలులో తమకు బ్రిటిషుపొరుగు తప్పనిసరి అయేసరికి తుర్కీవారురష్యావారి ఒడిలో పడ్డారు. మోసలునుగురించి తీర్పుచెప్పిన రోజునే తుర్కీరష్యాలు కలిసి ఒడంబడిక ఒకటి చేసుకొన్నాయి. దీనికి ప్రత్యుత్తరంగా ఇంగ్లీషువారు ఇటలీతో సంధిచేసుకొన్నారు. అరేబియాలో ఒకరి పొరుగున ఒకరు నివసించవలసి ఉండడంచేత ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ అదివరకే ఒడంబడిక జరిగింది. ఈ సంధిపత్రాలతో రష్యా తుర్కీల ఉపద్రవం రాకుండా కాచుకోవాలని బ్రిటిషువారి యత్నం. ఆ తరువాత బ్రస్సెల్సుహద్దుకు ఒకవిధంగా అంగీకరించక తప్పిందికాదు తుర్కీకి. 1926 లో ఈవిషయాన్నిగురించి తుర్కీఇరాకుగ్రేటుబ్రిటనులు కలిసి సంధిచేసుకొన్నాయి. మోసలు నూనెగనులమూలంగా ఇరాకు రాజ్యానికి లభించే రాబడిలో నూటికి 10 చొప్పున తుర్కీకి 25 సంవత్సరాలపాటు ఇవ్వడానికిగాని, లేక సంవత్సరంలోగా తుర్కీవారు ఒక్కసారిగా ప్రతిఫలం కోరేటట్టయితే 500,000 పౌనులు ఇవ్వడానికిగాని నిర్ణయించుకొన్నారు. మోసలుజిల్లా తమకు కలిపినందులకుగాను, ఇరాకు ప్రభుత్వం ఇంగ్లాండుతో ఒడంబడికగడువు పాతికసంవత్సరాలకింద మార్చుకొంది. అంతర్జాతీయసమితిలో ఇరాకుకు సభ్యత్వం కలుగజేయడం విషయం 1928 సం॥రం ఆగస్టులోనూ, అప్పుడు కుదరకపోతే ఆ తరువాతనాలుగేసిసంవత్సరాల కొక్కొక్కసారీఆలోచించవలసిందన్నారు.

1927 సం॥రం ఆరంభంలో అంతర్జాతీయసమితిసభ్యత్వం ఇప్పించడంకోసమూ, పాతఒడంబడిక మార్చుకొనేనిమిత్తమూ ఇరాకు బ్రిటిషుప్రభుత్వాలకు మళ్ళీ సంప్రతింపులు ఆరంభమయాయి. హైకమిషనరు డాబ్సు ఇరాకుఆశయాలకు సుముఖంగానే ఉన్నాడు. దగ్గిరా, దాపూ కాని పరాయిదేశాలలో బ్రిటిషువారి క్షేమం దేశీయులసుహృద్భావంమీదే ఆధారపడిఉండాలికాని బ్రిటిషుఆయుధబలంమీద కాదన్న రహస్యం కనుగొన్నాడీయన. ఈ విషయంగురించి ఆయన వ్రాసిన వాక్యాలు ఈకిందివి: "దేశంలో బ్రిటిషుపెత్తనం లేకుండాఉండేటట్టుగా, ఇరాకుతో కొత్త

ఒడంబడిక ఒకటి చేసుకొంటే ఇరాకుకు కాని, బ్రిటిషువారికి కాని వచ్చే ముప్పు ఏమీ ఉండదనే నా ఉద్దేశం. ఇరాకుప్రభుత్వం నిజంగా స్నేహభావంతో వర్తించడం నాకు మొదటినుంచీ స్పష్టమయింది. అధికారరీత్యా కానట్టయితేమట్టుకు, వారికి మన సలహా ఇష్టమే. మాసలహా మీరు పొంది తీరాలి అనే నిర్బంధం గనుక లేకపోయినట్టయితే, వారు మరింత తరుచుగా, నమ్మకంగా మన సలహా తీసుకొంటా రనడంలో సందేహం లేదు. సంధిపత్రాలలో వ్రాతమూలంగా స్పష్టమయే స్నేహబంధం సడలిపోయినప్పటికీ, ఆమూలంగానే నిజమైన స్నేహబంధం ఏర్పడుతుందని నా నమ్మకం. ఇంత ఎందుకు ? అంతర్జాతీయసమితిలో శీఘ్రంగా సభ్యత్వమిప్పించి బ్రిటిషుపెత్తనం తీసివేసి, స్నేహపూర్వకమైన కొత్తసంధి చేసుకోవడమే ఇరాకుదేశవిషయంలో మనం నిర్ణయించుకొన్న కర్తవ్యం. (బ్రిటిషుప్రభుత్వమంటే స్నేహసౌహార్ద్రభావాలు గల స్వతంత్ర ఇరాకు ప్రభుత్వం స్థాపించడం) అచిరకాలంలో నిశ్చయంగా సఫలంకావడానికి అదిమార్గమని నాఅభిప్రాయం", ప్రశంసనీయమైన ఈఅభిప్రాయం అప్పట్లో బ్రిటిషుప్రభుత్వానికి నచ్చలేదు. ఆలోగా దేశంలో అల్లరులేమీ లేకుండా ఉంటే, 1932 సం॥రంలో అంతర్జాతీయసమితిసభ్యత్వంమాట ఆలోచిస్తామన్నారు. అంతర్జాతీయసమితిమాట ఏలా ఉన్నా పాతఒడంబడిక మార్పు చేయడంవిషయంలోమట్టుకు తమ అభ్యంతరం లేదన్నారు. దానిమీద సర్ హెన్రీ డాబ్సు, ఫైజలురాజు, ఇరాకుప్రధానమంత్రి జాఫరుపాషా వీరుముగ్గురూ లండనునగరానికి ప్రయాణమయారు. రెండునెలలు సంభాషణలు జరిగాయి. చివరకు 1927 సం॥రం డిశంబరులో ఒక ఒడంబడిక వ్రాసుకొన్నారు. అంతర్జాతీయసమితి సభ్యత్వంవిషయంలో అదివరలో చెప్పినమాటే ఇందులోనూ ఉదహరించారు. మిగతా అంశాలుమట్టుకు సవ్యంగానే ఉన్నాయి. "ఈ ఒడంబడిక సరిసమానప్రతిపత్తితో చేసుకొన్నాము" అని వివరించారు. 'ఇరాకు సర్వాధికారం గల స్వతంత్ర రాజ్య'మని అంగీకరించారు. కాని ఈ మాటలవల్ల ఒలికిన సౌభాగ్య

మేముంది? ఒడంబడికకు తోకలుగా, ఆర్థికసైనిక వ్యవహారాలనుగురించి వేరుగా వ్రాయించుకొన్న ఖరారునామా లున్నాయి. అవి మారాలిగాని సంధిపత్రంలో స్వతంత్రం అన్నమాట పెద్దపెద్ద అక్షరాలతో లిఖించినంత మాత్రాన్ని ఏమవుతుంది? ఆ వ్యవహారాలవిషయంలోకూడా కొత్త ఖరారునామాలు వ్రాసుకొనే పర్యంతమూ కొత్త ఒడంబడిక చెల్లకూడ దని ఇరాకుప్రతినిధులు బ్రిటిషువారిని ఒప్పించగలిగారు. కాని ఆ వ్యవహారాలలోమట్టుకు కొత్త ఏమీ కలుగలేదు. జాఫరుపాషా ఇంటికి తిరిగివచ్చేలోగా, ఏదో పొరబాటున, కొత్త ఒడంబడిక బయటబడింది. అందరూ ఒడంబడిక పనికిరాదని ఖండించారు. మంత్రివర్గంలో ఉన్న జాతీయవాదు లిద్దరూ రాజీనామా ఇచ్చారు. మంత్రివర్గం అంతా పడి పోయింది. అబ్దుల్ ముషీనుబేగు అనే మితవాదప్రముఖుడు తన పార్టీవారినే తీసుకొని కొత్తగా మంత్రివర్గం ఏర్పరిచాడు. 1928 జనవరిలో పాత పార్లమెంటు నిలుపుజేసి, కొత్త పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతాయని ప్రకటించారు. ఏదోవిధంగా ఎన్నికలలో ప్రభుత్వపక్షానికే విజయం కలిగింది. మేనెలలో కొత్తపార్లమెంటు సమావేశమైంది. ఆర్థికసైనిక వ్యవహారాలనుగురించి బ్రిటిషువారితో సమాధానం కుదరలేదు.

ఈ సమయంలో సర్ హెన్రీ డాబ్సు వెళ్ళిపోయి సర్ గిల్బర్టుక్లేటను అనే ఆయన హైకమిషనరుగా వచ్చాడు. బ్రిటిషుసామ్రాజ్యక్షేమానికి భంగంరానియ్యకపోయినప్పటికీ, అరబుజాతీయాశయాలకు సుముఖుడన్న ప్రఖ్యాతి ఉంది. క్లేటనుకు తన ఉద్యోగం ముగిసేలోగానే ఇరాకుదేశం అంతర్జాతీయసమితిలో చేరగలుగుతుందని ఆశిస్తున్నా నన్నాడు. కాని అంతకుముందుగానే కాలంచేశాడు. ఏవిధమైన షరతులూ, ఆటంకాలూ కల్పించకుండా ఇరాకు అంతర్జాతీయసమితిలో ప్రవేశించడానికి తగిన ప్రయత్నం వెంటనే చేయవలసిందని ఈయన చనిపోయేముందు వ్రాశాడు.

క్లేటనుమూలంగా ఇరాకువారికి కొంత ధైర్యం కలిగింది. అంత ర్జాతీయసమితిలో ప్రవేశించినంతమాత్రాన్ని ఇరాకురాజ్యానికి అదనంగా

కలిగే విశేషమేమీ ఉండదన్నవిషయం వారికి తెలియకపోలేదు. కాని, ఈ సభ్యత్వం లభించడంతోనే బ్రిటిషురక్షణ అనే దౌర్భాగ్యం వదలి పోతుందన్న ఆశ లీగుసభ్యత్వంకోసం వీరిని పాకులాడించింది. అసలు బ్రిటిషువారి చేతులలో పడి ఇంతవరకు రాగలగడమే అదృష్టం. "యుద్ధంలో మనం భుజబలంతో జయించినదేశం ఇరాకు. దీనికీ, అంతర్జాతీయసమితికీ, వారి మాండేటుకూ సంబంధ మేమీ లేదు. మనం శ్రమపడి జయించిన దేశం మన సామ్రాజ్యంలో కలుపుకోవడం మన హక్కు. దీనికి అభ్యంతరంపెట్టే అధికారం ఎవరికీ లేదు. ఇరాకులోని నిమ్నజాతులూ, మైనారిటీలూ మనం లేకపోతే మాడిపోతారు. ఇండియాదేశరక్షణకు ఇరాకు మనకు ముఖ్యావసరం. ఇందుచేత మాండేటూ, గిండేటూ అని వెర్రివెర్రిభావాలు పెట్టుకోక ఇరాకురాజ్యం మన సామ్రాజ్యంలో కలుపుకోవాలి" అని వాదించిన బ్రిటిషుప్రముఖులు లేకపోలేదు. వీరి వాదంలో బ్రిటిషురాజనీతికి విరుద్ధమైన దేమీ లేదు. కాని ఏ అదృష్టహేతువులవల్లనో ఈ ఆపద తప్పింది. ఇరాకుకు ఈ సందర్భంలో నిష్పాక్షికుడైన ఒక సుప్రసిద్ధపాశ్చాత్యగ్రంథకారుడు వ్రాసిన ఈ కిందివాక్యాలు గమనించ వలసినవి: "దేశం తగినంత చిన్నది కాకపోవడం, తేలికగా రక్షించు కోవడానికి వీలులేని దీర్ఘమైన సరిహద్దు లుండడం, చుట్టూ యోధులైన ప్రజలు గల రాజ్యా లుండడం— ఈ మొదలైన హేతువులవల్ల ఇరాకు దేశవిషయంలో బాధ్యత పూర్తిగా తమమీదపెట్టుకోవడం అభిలషణీయం కాదనీ, విస్తారమైన వ్యయంచేసి, సైనికబలంతో దేశం ఆక్రమించడం అనాలోచితకార్యమనీ బ్రిటిషువారికి తోచింది."

అంతర్జాతీయసమితిలో సభ్యత్వం లభించడంతో బ్రిటిషురక్షణ ఆఖరవుతుందన్న షరతు ఇంగ్లీషువారు అంగీకరించినప్పటినుంచీ, ఏవిధంగానైనా సాధ్యమైనంతత్వరలో ఆమాట కాస్తా అనిపించుకొందామని ఇరాకువారు సర్వవిధాలా కృషిచేశారు. ఈ అదృష్టంకూడా పడితే ఇంక ఇరాకుకువచ్చిన భయం లేదని వారి నమ్మకం.

బ్రిటిషువారు అదివరలో ఒక ముఖ్యవిషయంలోమాత్రం ఇరాకు కోరిక మన్నించారు. విదేశీయుల విచారణనుగురించి 1924లో చేసుకొన్న ఒడంబడిక రద్దుచేయడానికి సమ్మతించారు. స్వదేశీయవిదేశీయ భేదం లేకుండా, సర్వజనులకూ ఒకేన్యాయం, న్యాయవిచారణపద్ధతీ ఉండడానికి అంగీకరించారు. అంతర్జాతీయసమితి సభ్యత్వం విషయంలోకూడా ఇరాకు వారియత్నం కొద్దిలోనేసఫలమైంది. లేబరుప్రభుత్వం హయాములో బ్రిటిషు వారు అదివరలో క్లేటను వ్రాసిన ప్రకారం చేయడానికి సమ్మతించారు. 1930 సం॥రం జూన్ 30 వ తేదీని ఇరాకుప్రధానమంత్రి నూరీపాషా, బ్రిటిషుహైకమిషనరు సర్ ఫ్రాన్సిసుహంఫ్రీసూ కొత్త ఒడంబడిక ఒకటి చేసుకొన్నారు. పాత ఒడంబడికలన్నీ రద్దుచేసుకొన్నారు. స్వదేశవిదేశ వ్యవహారాలన్నిటిలోనూకూడా ఇరాకుదేశపు సంపూర్ణస్వాతంత్ర్యం బ్రిటిషువా రంగీకరించారు. ఒడంబడిక చెల్లినంతకాలమూ ఇండియా దేశానికి పోయేమార్గం రక్షించుకోవడానికి బస్రాపట్టణందగ్గిరా, యూఫ్రటీసు నదికి పశ్చిమంలోనూ, రెండుతావులలో విమానదళం అట్టేపెట్టుకొనే అధికారం పొందారు. ఒడంబడికవాయిదా 25 ఏళ్ళు. దేశంలో స్వదేశ సైన్యం సిద్ధమయేవరకూ, ఒక అయిదుసంవత్సరాలపాటు మోసలు, బాగ్దాదు, హెనైదీలలో తమ సైన్యం నిలుపుకొనే అధికారంకూడా ఉంది, బ్రిటిషువారికి. ఆర్థికవిషయాలలోకూడా సమాధానపడ్డారు. ఇరాకుపార్ల మెంటులో ఒడంబడిక ఆమోదించారు. తమకు రక్షణబాధ్యత తప్పించి, ఇరాకును స్వతంత్రరాజ్యంగా పరిగణించి, సభ్యత్వం ఇప్పించవలసిందని బ్రిటిషువారు అంతర్జాతీయసమితివారికి వ్రాశారు. 1932 సం॥రంలో ఇరాకుకు అంతర్జాతీయసమితిలో సభ్యత్వం లభించింది.

రక్షణపొందే స్థితి గడిచి స్వతంత్రరాజ్య మవడానికి అర్హత కలిగిందని నిర్ణయించడానికి అవసరమైన విషయా లేమిటి అన్న ప్రశ్నకు అంతర్జాతీయసమితివారు ఈకిందివిధంగా సమాధానం చెప్పారు:

"తన సరిహద్దులలోపల శాంతికి భంగంలేకుండా చూచుకోగలిగి

ఉండడం, అప్పులలో పడకుండా ఆర్థికస్వాతంత్ర్యం నిలుపుకోగలిగి ఉండడం, పరదేశాలవల్ల అపాయం కలగకుండా రక్షించుకోగలగడం, దేశంలో మైనారిటీలక్షేమానికి భంగంలేకుండా చూడడం, సక్రమమైన న్యాయవిచారణావిధానం కలిగిఉండడం, దేశపు సరిహద్దులు సరిగా చూచుకోగలగడం- ఇవీ, రక్షణఅక్కరలేని స్వతంత్రరాజ్యమని పరిగణించ డానికి అవశ్యమైన విషయాలు" ప్రస్తుతంలో ప్రాముఖ్యమైన అనేక పాశ్చాత్యదేశాల విషయంలోనే సమితివారు సూచించిన స్వాతంత్ర్య లక్షణాలు కనపడవు. కాని వాటి స్వాతంత్ర్యంగురించి సందేహించడానికి కాని, ప్రశ్నించడానికిగాని సాహసించేవా రెవరూ ఉండరు. చేతులలో చిక్కిన దేశాల విషయంలో ఈవిధమైన షరతులు పెట్టడం వింతకాదు.

ఇరాకుదేశం ఏదోవిధంగా రక్షణబంధంలోనుంచి బయటబడింది. దేశానికి సిద్ధించిన స్వాతంత్ర్యం బూటకమైనది కాకుండా ఉండాలి. సామాన్యంగా బ్రిటిషురాజతంత్రజ్ఞులు, వారు పాదంపెట్టిన ప్రదేశంతో సులువుగా సంబంధం వదలుకొనేవారు కారు. ఒకవేళ వారు వదిలిపెడదా మనుకొన్నా, వారి సామ్రాజ్యం వదిలిపెట్టనీయదు. ఇరాకుదేశంతో సంబంధం వదలుకోవడం అంత కష్టంకాకపోయినా ఆరాజ్యపు కిరస నాయిలుతో సంబంధం వదులుకోవడం వీలుకాదు. ప్రస్తుతకాలంలో బ్రిటిషు వారికి కిరసనాయిలుతో పని చాలా ఉంది. గత ఐరోపాసంగ్రామం తరువాత కిరసనాయిలువాడకం విస్తారంగా హెచ్చింది. యుద్ధనౌకలూ, మోటార్లూ, టాంకులూ మొదలయిన యుద్ధసాధనాలన్నింటిలోనూ కిరస నాయిలే ఉపయోగిస్తున్నారు. సర్వత్రా రాతిబొగ్గుబదులు కిరసనాయిలు వాడుకలోకి వస్తోంది. ఆధునిక నాగరకప్రపంచంలో బ్రిటిషుబలప్రతిష్ఠలకు భంగంలేకుండా ఉండాలంటే, కిరసనాయిలు వారికి ముఖ్యావసరం. ఇదివర దాకా, ప్రపంచంలో కిరసనాయిలుఉత్పత్తి అంతా అమెరికావారు గుత్తకు తీసుకొన్నట్టుండేది. బ్రిటిషువారికీ, అమెరికావారికీ అన్నివిషయాలలోనూ పోటీ తప్పని స్థితిలో కిరసనాయిలుకోసం వారిమీద ఆధారపడిఉండడం

అనాలోచితకార్యం. ఇక రష్యావారిని నమ్ముకొంటారంటే, వారికీ వీరికీ మొదటినుంచీ సగమెరుకే. బ్రిటిషువారి చేతులలో బర్మానూనెనూతు లున్నాయి. భారతదేశంమాట ఎటునుంచి ఎటువచ్చినా, బర్మాను విడదీసి వారి చేతులలో పెట్టుకోవడం అవసరం. కాని ఒక్క బర్మానూతులవల్ల కార్యసానుకూలం కాదు. నూనెసప్లయి సూయజుకాలవకు ఇవతల మాత్రమే ఉంటే యుద్ధసమయంలో గొప్ప చిక్కు వస్తుంది. ప్రపంచంలో బ్రిటిషువారి ఓడమార్గాలన్నిటిలోనూ, నూనెడిపోలు ఏర్పాటుచేసుకోవడం అవసరం. ముఖ్యంగా మధ్యధరాసముద్రంలో వారికి నూనెసప్లయి పుష్కలంగా ఉండాలి. ఈవిషయాల మూలంగానే మెసొపొటేమియా అంటే బ్రిటిషువారికి అంత ఇష్టమయింది. ఆదేశంలో నూనెనూతులు చాలా ప్రాముఖ్యమైనవి. మోసలునూనెనూతులలోనుంచి ప్రతిసంవత్సరం, 20,000,000 టన్నుల కిరసనాయిలు ఉత్పత్తికావచ్చునని అంచనావేశారు. ఇది మొత్తంప్రపంచంలో ఉత్పత్తిఅయే నూనెలో సుమారుగా పదోవంతు. ఈ నూనెగనులు భద్రంగా ఉంటే ఇంక బ్రిటిషువారికి వచ్చే ఇబ్బంది ఉండదు. అరేబియాదేశంలో వారు వేసిన ఎత్తులన్నీ దీనినసుసరించే. మెసొపొటేమియాను మంచిమాట చేసుకోవడం, మాటతీసివేయని రాజులకు పట్టంగట్టడం, ట్రాన్సుజార్డను అంటూ ఒకరాజ్యం కల్పించడం, పాలస్తీను పరాధీనంకాకుండా చూచుకోవడం ఈమొదలైనకార్యాలన్నీ దీనినసుసరించే.

మోసలునూనె పర్షియనుసింధుశాఖదగ్గరకు సులభంగానే చేరవేయ వచ్చుకాని అదికాదు బ్రిటిషువారికి కావలసినది. మధ్యధరాసముద్రంలో అందుబాటుకావాలి కిరసనాయిలు. ఇందుకనే వందలకొద్దీమైళ్ళ దూరమైనప్పటికీ, మోసలునుంచి తిన్నగా మధ్యధరాసముద్రందగ్గిరకి నూనె ప్రవహించడానికి తగిన ఏర్పాటులు చేశారు. పాలస్తీనులో హైఫారేవు పట్నం అభివృద్ధిచేయడం ఇందుకోసమే. మోసలునుంచి కిరసనాయిలు సరాసరిగా హైఫారేవులోకి ప్రవహించాలి. ఈమధ్యనే పాలస్తీను హైకమిషనరు ఈ ఏర్పాటులు చేసుకోవడానికి అవసరమైన అధికారాలన్నీ

బ్రిటిషువారికి ప్రసాదించాడు. ఇందులో పాలస్తీనుప్రజల ప్రమేయమేమీ లేదు. అక్రమ మని వారు ఆక్షేపించకపోలేదు. కాని ఆక్షేపణలన్నీ ఆలకించేటట్టయితే, అంత కష్టపడి బ్రిటిషువారు అక్కడ కాపురంచేయడ మెందుకు? ఈ మోసలు హైఫానూనెమార్గంతో మధ్యధరాసముద్రంలో కుళాయి విప్పితే, మోసలులోని నూనె ధారాపాతంగా ప్రవహిస్తుంది.

ఈవిధంగా నడుస్తోంది బ్రిటిషురాజనీతి. ఇటువంటప్పుడు వారు పూర్తిగా మెసొపొటేమియాను వదిలిపెడతారని ఊహించడానికి వీలులేదు. కాని బ్రిటిషురక్షణబంధంలోనుంచి బయటబడగలిగినంతవరకు ఎక్కడికక్కడికే సంతోషించాలి. బ్రిటిషువారికి ఇష్టుడైన ఫైజలురాజు కాలం చేశాడు. అతని కొడుకు రాజయాడు. రాజుగారిని సంతృప్తిపరచడంలో బ్రిటిషువారు లోటుచేయరు. రాజుగారి మాట ఏలాగున్నా ప్రజలుమాత్రం బ్రిటిషురాజనీతిరహస్యాలు అవగాహనచేసుకొని జాగ్రతగా వ్యవహరించడం అవసరం.

# మధ్య అరేబియా

ఇరాకు ట్రాన్స్జార్డనులు కొడుకుల పాలనలోనూ, హెజాజు తన పాలనలోనూ ఉండడం చూచి, అరేబియాదేశానికి తాను పట్టాభిషిక్తుడయే సుముహూర్తం ఆసన్నమవుతోందని హుసెయిను ఆలీ ఆశించాడు. ఇందుకోసం వారి పాతవాగ్దానాలు జ్ఞాపకంచేసి, కొత్తగా సంప్రతింపులు జరిపాడు. కాని వాహాబీఉద్యమంరూపంగా మధ్యఅరేబియాఎడారిలో బయలుదేరిన ప్రచండమారుతంలో హుసెయినుఆశలన్నీ ఎగిరిపోయాయి.

యూరపుఇండియాలకు భూమార్గమే ప్రధానమైన ప్రాచీనకాలంలో, మార్గమధ్యంలో ఉండడంచేత, అరేబియాదేశం చాలా ప్రాముఖ్యమైంది. ఆతరువాతకాలంలో అరేబియా ప్రపంచదృష్టిలోనుంచి తప్పిపోయినా తిరిగి యూరపుయుద్ధానంతరం ప్రాముఖ్యమైంది. ఇండియాదేశం బ్రిటిషువారికి భుక్తమైనతరువాత ఈ దేశానికి ఏప్రక్కనుంచీ కూడ ఉపద్రవంరాకుండా కాచుకోడానికి వారి రాజనీతినిపుణత అంతా వినియోగించారు. భారతదేశపు పరిసరాలన్నీ ఏదోవిధంగా కట్టుదిట్టంచేసుకొన్నారు. ఆఫ్ఘనిస్థానం తమ అదుపాజ్ఞలలో ఉండడానికి ప్రయత్నంచేశారు. పర్షియాలో తమ పలుకుబడి సాగడానికి కృషిచేశారు. తిప్పలుపడి టిబెత్తులోకూడా ప్రవేశించాలని యత్నించారు. ఈజిప్టులో నిలకడ కుదుర్చుకొని, ఎర్రసముద్రమార్గం భద్రంగా చూచుకొన్నారు. పర్షియనుసింధుశాఖప్రాంతంలో తమ మాట ప్రాధాన్యంగా ఉండేటట్టు చేసుకొని, అది పరాధీనం కాకుండా జాగ్రత పడ్డారు. మోటార్లూ, విమానాలూ ప్రధానమైన ఆధునికయుగం రావడంతోనే అరేబియామీద దృష్టిపడింది. యూరపుయుద్ధానంతరం ఇందుకోసం కృషిచేసి కృతార్థు లయారు. వాసయోగ్యంగా ఉన్న ప్రదేశమం దంతటా అల్లుకొనిపోయారు. మండుటెడారి కావడంమూలంగానూ, మరికొన్ని కారణాలవల్లా మధ్యఅరేబియాకుమాత్రం ఈమాట దక్కలేదు.

అరేబియాకు ఒకపక్క సముద్రతీరంలో, ఏడెనుప్రాంతాన్ని స్థావరం ఏర్పరుచుకొని, ఆపక్క భయంలేకుండా చూచుకోవాలని యత్నించారు. ఏడెనుచుట్టుపట్ల తమ రక్షణలో ఉండేటట్టుగా పిల్లపిల్ల

రాజ్యాలు తొమ్మిది సృష్టించారు. ఆప్రాంతంలో ఉన్న ఎమెనురాజ్యానికి ఈపిల్ల రాజ్యాలు ప్రతిబంధకమయాయి. ఎమెనుకు పశ్చిమోత్తరాన్ని ఉన్న అసీరురాజ్యంతో సఖ్యంచేసుకొని దాని స్వాతంత్ర్యం అంగీకరించామన్నారు. అదివరలో ఎమెనురాజ్యానికి రేవుపట్నమైన హొడెయిడా నగరం అసీరువారికి ధారపోశారు. ఎమెనువారి లుహయ్యా అనే మరొక పట్నంకూడా వారికి చెందేటట్టు చేశారు. ముఖ్యమైన రేవుపట్నాలు పోవడంతోనే సముద్రవ్యాపారం లేక, ఎమెనుకు వచ్చే ముఖ్యాదాయం పోయింది. కాని బ్రిటిషువారు చేసిన ఏర్పాటు ఆట్టేకాలం నిలవలేదు. 1923 సం॥రంలో అసీరుపాలకుడు కాలంచేసిన తరువాత ఎమెనువారు భుజబలంవల్ల తమ పూర్వపట్నాలు స్వాధీనంచేసుకోగలిగారు. ఎమెను రాజ్యానికీ, బ్రిటిషువారికీ అంతగా పొత్తులేదు. ఏడెనుచుట్టూ కల్పించిన పిల్లరాజ్యాలనుగురించి తగాయిదా ఇంకా పరిష్కారంకాలేదు.

పర్షియనుసింధుశాఖపైపున కూడా ఇదేవిధంగా బ్రిటిషువారు అనేక చిల్లరరాజ్యాలు సృష్టించి, వాటిని చేతులోపెట్టుకొన్నారు. ఈప్రాంతంలో పాదంనిలిచినతరువాత, అక్కడనుంచి, మధ్యఅరేబియా (నెజ్దు) పాలకుడైన అబ్దుల్‌అజీజు ఇబున్‌సౌదునుకూడా తమరక్షణలో జాగ్రతపెట్టాలని చూచారు. 1915 సం॥రం డిశంబరులో ఇబున్‌సౌదుతో సంధిచేసుకొన్నారు. నెజ్దు స్వతంత్రమైన రాజ్యమని అంగీకరించినప్పటికీ, బ్రిటిషువారి క్షేమానికి విరుద్ధంగా ప్రవర్తించకూడదనీ, మరే ఇతర పాశ్చాత్య ప్రభుత్వంతోనూ సంబంధం పెట్టుకోకూడదనీ ఒప్పించుకొన్నారు.

ఇబున్‌సౌదు యోధుడూ, దూరదృష్టిగలవాడూను. యుద్ధకాలంలో చాలా నిపుణతతో వ్యవహరించాడు. హుసెయినురీతిగా బ్రిటిషువారి బాస శిలాక్షరంగా పరిగణించలేదు. యుద్ధం జరిగినంతకాలమూ తనకూ, యుద్ధానికీ సంబంధం పెట్టుకోనన్నాడు. తెలివితేటలుగా, ఇటూ చేరకుండా అటూ చేరకుండా కాలక్షేపం చేసి, అందుకుగాను బ్రిటిషువారి వద్దనుంచి ప్రతినెలా 5,000 పౌనులచొప్పున ప్రతిఫలం పొందాడు. ఇతనికి ప్రతిస్పర్థిఅయిన హుసెయిను ఆలీకీ ఈవిధంగా కొంతడబ్బు

ముట్టింది. కాని అతను బ్రిటిషువారి మాటలు నమ్మి, తుర్కీవారిమీద తిరగబడి, సిరియాపాలస్తీనులు బ్రిటిషువారికి జయించిపెట్టాడు. చివరకు, యుద్ధం ముగిసి వాగ్దానాలు చెల్లించే సమయం వచ్చేసరికి, నిజస్థితి బయట బడి నిశ్చేష్టుడయాడు. ఇంక చేయగలిగినది ఏమీ లేక, వర్సెయిల్సుసంధి పత్రంమీద సంతకంచేయను అన్నాడు. యుద్ధకాలంలోమట్టుకు బ్రిటిషు వారు హుసెయినును కంటిని రెప్పవలె కాపాడారు. కాని, తదనంతరం, వాగ్దానాలు చెల్లించవలసిందని హుసెయిను నిష్ఠురపెట్టడంతోనే రాజనీతి కోవిదులు, వారు, చల్లగా అతని రాజ్యంలోనుంచి తప్పుకొన్నారు. నిస్సహాయుడై, హుసెయిను, ఇబున్‌సౌదుముందు నిలవలేక, కొద్దిలోనే రాజ్యం పోగొట్టుకొన్నాడు.

బుద్ధిమంతుడైన ఇబున్‌సౌదు అరేబియాదేశం జయించడంతో ఊరుకోలేదు. అరేబియావాసులలో ఉండే లోపం గ్రహించాడు. మధ్య అరేబియాలోని ఆరబ్బులకు, నిలకడగా ఒకచోట నివాసంచేసే అలవాటు లేదు. నిరంతరము సంచారంచేస్తూ ఉండడమే వారికి సహజలక్షణం. ఈ కారణంచేత వారిలో దేశభక్తి, జాతీయభావం పెంపొందడానికి సావకాశం లేదని గ్రహించాడు. అరేబియాలో సుస్థిరమైన రాజ్యం స్థాపించాలంటే, ఆరబ్బుల ఈ నిరంతర సంచారలక్షణమూ, దానితోబాటు వారిలోవారికి కలిగే నిరంతరకక్షలూ పోవాలని తెలుసుకొన్నాడు. ఆరబ్బులు సహజంగా మతావేశపరులు. మతంమీద ఆధారపడిన ఐక్యభావం వారిలో లేకపోలేదు, కాని జాతీయతమీద ఆధారపడిన ఆధునికరాజ్యం దేశంలో ఏర్పడడానికి ఇది చాలదని గ్రహించి, జాతీయభావం అభివృద్ధిచేయడానికి పూను కొన్నాడు. ఆరబ్బులనందరినీ దేశంలో స్థిరవాసం ఏర్పరుచుకొనేటట్టు ప్రోత్సహించాడు. చిరకాలంనుంచీ ఆరబ్బులలో ఉన్న వివిధమైన విరోధ భావాలు నశించి, సోదరభావం కలిగే ఉద్యమం లేవదీశాడు. అరేబియా ఇసుకపర్రలలో ఆరబుజాతీయతకు పునాదివేశాడు.

యూరపుయుద్ధానంతరం బ్రిటిషువారు ఇబున్‌సౌదుకు చుట్టూ ఉన్న రాజ్యాలు హుసెయినుకొడుకులకు పట్టంగట్టారు. హుసెయిను, ఇబున్

సౌదులకు మొదటినుంచీ విరోధమే. మహమ్మదీయమతం అంతా హుసెయిను పాడుచేశాడని ఇబున్‌సౌదు అభిప్రాయం. ఆదికాలంలో, మహమ్మదునాడు, మతం ఏవిధంగా ఉన్నదో, అదేవిధంగా పరిశుద్ధంగా ఉండనీయక, లేనిపోని ఆచారాలూ, పూజలూ పునస్కారాలూ కల్పించి, మతమంతా హుసెయిను భ్రష్టంచేశాడని అతని నమ్మిక. మతమంటే ఏమిటో తెలియని మూఢుడు ఇబున్‌సౌదు అని హుసెయినుఅభిప్రాయం. మధ్య అరేబియా ఎడారిలో, తాతలనాటినుంచీ పరప్రపంచం ఏమీ తెలియకుండా, కాపురంచేస్తూఉన్నవట్టి మోటుప్రజలు వాహబీలు అనిహుసెయినునమ్మకం.

బ్రిటిషువరప్రసాదంగా అరబురాజ్యాధిపత్యం తనకు లభిస్తుందన్న ఆశ హుసెయినులో ప్రబలమైనకొద్దీ వాహబీలలో సంచలనం అధికమైంది. హుసెయినుకు బ్రిటిషువారి అండ పోయిన కొద్దిలోనే అతనికీ, ఇబున్ సౌదుకూ పోరాటం ఆరంభమైంది. ఇబున్‌సౌదు అతినిపుణతతో విజయయాత్ర ఆరంభించాడు. తన రాజ్యంచుట్టూ ఉన్న అరబుప్రజలలో ముందుగా మతప్రచారం చేశాడు. మక్కాషరీఫుల చేతులలో పాడయిపోయిన మహమ్మదీయమతాన్ని పునరుద్ధరించడం పరమధర్మమని బోధించాడు. ఈ కార్యమే తన ఆదర్శమని వివరించాడు. వారందరినీ తన సోదర బృందంలో కలుపుకొన్నాడు. 1917 సం॥రంలో మక్కావారి తాలూకు ఖుర్మాప్రాంతంలోని ప్రజలు పాలకునితోసహా ఇబున్‌సౌదుపక్షంలో చేరారు. ఈ ప్రదేశం తిరిగి జయించుకోవాలని హుసెయిను ప్రయత్నించాడు. 1919 సం॥రంలో రెండుపక్షాలవారికీ యుద్ధం జరిగింది. హుసెయిను ఓడిపోయాడు. ఈప్రదేశం ఇబున్‌సౌదురాజ్యంలో చేరడంతోనే అతనికి మక్కాపట్నం దృష్టిపథంలో పడింది. కాని వెంటనే ఆ పట్నంమీద దండెత్తలేదు. ముందుగా మధ్యఅరేబియాలో తన అధికారం స్థిరపడేప్రయత్నం చేసుకొన్నాడు. తన రాజ్యానికి ఉత్తరంగా చిరకాలం నుంచి ప్రతిస్పర్థిగా ఉన్న జబెలుషమ్మారురాజ్యం కలుపుకొన్నాడు. దానితో మధ్యఅరేబియా అంతా అతని పాలనలో చేరింది. అతని రాజ్యం హుసెయినుకొడుకుల రాజ్యానికి పొలిమేర అయింది.

1924 సం॥రంలో ఇబున్‌సౌదు తన రాజధానిఅయిన రియాదు పట్నంలో ముసల్మానుల కాంగ్రెసు ఒకటి జరిపాడు. మతోద్ధరణం తన ఆదర్శమని వివరించాడు. తాను మక్కాపట్నం జయించడం అందరికీ సమ్మతిఅయితేనే ఆపనికి పూనుకొంటాను అన్నాడు. అది ముఖ్యమైన కార్యమన్నారు ముసల్మానులు (ముఖ్యంగా ఇండియావారు). ఆసంవత్సరం సెప్టెంబరులో వాహబీల విజయయాత్ర ఆరంభమైంది. మక్కావారి టెయిఫుపట్నం ముందుగా స్వాధీనంచేసుకొన్నారు. హెజాజురాజ్యం అంతా కలవరపడింది. హుసెయినుకొడుకు, ఆలీ అనే అతను సేనలతో జిడ్డాపట్నానికి మళ్ళిపోయాడు. జిడ్డాప్రజలు హుసెయిను రాజ్యం వదలు కోవాలన్నారు. జయించగలనన్న ఆశకూడా అంతరించింది హుసెయినుకు. బ్రిటిషువారి పుణ్యమా అంటూ అతని సేనలకు ఆయుధసామగ్రిఅయినా పూర్తిగా లేకుండాపోయింది. ఎర్రసముద్రంమీదుగానే హుసెయిను ఆయుధసామగ్రి తెప్పించుకోడానికి మార్గం. కాని అతని మిత్రులు, బ్రిటిషువారు, ఎర్రసముద్రంమీదుగా ఆయుధసామగ్రి దిగుమతిచేసుకోవడానికి వీలులేదన్నారు. ఇబున్‌సౌదుకు మాత్రం అదివరకు యుద్ధకాలంలో బ్రిటిషువారు సప్లయిచేసినవే, 30,000 తుపాకు లున్నాయి. హుసెయినుకు కష్టసమయం ఆసన్నమైంది. కష్టకాలంలో కనుక్కొన్నవాడే ఆప్తుడన్న న్యాయంప్రకారం, తనకు స్వల్పంగా సహాయం చేయవలసిందని బ్రిటిషు వారిని కోరాడు. రెండుమూడు విమానాలు పంపవలసిందని ప్రాధేయ పడ్డాడు. పంపడము అంటూ వస్తే, రెండేమిటి, ఎన్నైనా పంపిస్తాము, కాని అసలు మీయుద్ధంలో మేము కలుగజేసుకోవడం న్యాయంకాదు అన్నారు బ్రిటిషువారు. అది యూరపుయుద్ధకాలమూ కాదు; ఆయుద్ధకాలం నాటి అరేబియాదేశమూ కాదు. అలాంటప్పుడు బ్రిటిషువారికి కలుగజేసు కొనవలసిన అగత్యం ఏముంది ?

అక్టోబరు 3 వ తేదీని హుసెయిను తన పదవులూ, బిరుదులూఅన్నీ వదలుకొన్నాడు. కొడుకు ఆలీ రాజయి, ఇబున్‌సౌదుతో సంధిరాయ బారాలు జరిపాడు. హుసెయినువంశంలోనివారు ఎవరూ హెజాజులో

రాజ్యంచేయడం ప్రపంచంలో ముసల్మానుల కెవరికీ ఇష్టంలేదని ఇబున్ సౌదు కబురుచేశాడు. హెజాజురాజ్యం కలుపుకొనే ఉద్దేశం తనకు లేదన్నాడు. ఆరాజ్యం ప్రపంచంలోని ముసల్మానులందరిదీని, దాని పరిపాలనలో అందరికీ బాధ్యత ఉంది, అంతా ఏవిధంగా నిర్ణయిస్తే, ఆవిధంగా హెజాజుపరిపాలన జరుగుతుందని వివరించాడు. కొద్దిరోజులలోనే మక్కాపట్నం అతని స్వాధీనమయింది. ఆలీచేతులలో ఇంక రెండుమూడు పట్నాలుమాత్రం నిలిచాయి. డిశంబరునెల ఆఖరుఅయేలోగా అవీ వాహబీరాజుకు వశమయాయి. ఆలీ తమ్ముని దగ్గరకు, బాగ్దాదు పట్నానికి లేచిపోయాడు. హుసెయిను బ్రిటిషువారి సహాయంవల్ల దేశం వదలి, సైప్రసుదీవికి చేరి, 1930 సం॥రం వరకూ అక్కడ కాలం గడిపాడు. ఆ తరువాత వృద్ధాప్యంలో కొడుకుల పంచకు చేరాడు. అతని ఆశాసౌధాలన్నీ నిర్మూలమయాయి.

1926 సం॥రం జనవరి 8 వ తేదీని మక్కాపట్నంలోని ప్రముఖుల కోరికమీద ఇబున్‌సౌదు హెజాజురాజపదవి స్వీకరించాడు. ఆలోగానే బ్రిటిషువారు అతనితో సంప్రతించి సంధిచేసుకొన్నారు. హుసెయినుకు సహాయంచేయవలసివచ్చినప్పుడు న్యాయం కాకపోవడంచేత బ్రిటిషువారు కలుగజేసుకోవడం మానినప్పటికీ యుద్ధం అయిపోయినతరువాత తమ ఆస్తుడు హుసెయినుయొక్క రాజ్యంలో తమకు కావలసినది జాగ్రత చేసుకోవడంలోమాత్రం వారు కలుగజేసుకోకుండా ఉండలేదు. హెజాజులో ఉత్తరంగా ఉన్న జిల్లాలు మంచివి రెండు (మాను, అకాబాజిల్లాలు) ఏరుకొని, ట్రాన్సుజార్డనులో కలుపుకొన్నారు. వారి రక్షణలో ఉన్న ఇరాకు ట్రాన్సుజార్డనులు రెండూ ఇబున్‌సౌదు రాజ్యానికి సరిహద్దులు అయాయి. సరిహద్దు సమస్యలన్నిటినీగురించి సమాధానపడ్డారు. మాను అకాబాజిల్లాల విషయంమాత్రం కుదరలేదు. ఏ న్యాయంప్రకారం మీరు కలుపుకొన్నారని ఇబున్‌సౌదు బ్రిటిషువారిని అడిగాడు. కాని అప్పట్లో చేసేది ఏమీ లేక, ఈ జిల్లాలనుగురించి ప్రస్తుతంలో తగాదాపెట్టకపోయినప్పటికీ వాటి యాజమాన్యపు హక్కుమాత్రం తాను వదలుకోలేదుఅన్నాడు.

తన దిగ్విజయం పూర్తికావడంతోనే ఇబున్‌సౌదు దేశంలో సకల విషయాలలోనూ కట్టుదిట్టాలు చేశాడు. హెజాజులో అదివరకు ఎన్నడూ కనివిని ఎరుగని సౌకర్యాలన్నీ కల్పించాడు. పుణ్యక్షేత్రాలకు పోయే యాత్రికులకు ఏవిధమైన బాధలూ కలుగకుండా ఏర్పాట్లుచేశాడు. పుణ్య క్షేత్రాలలో పుష్కలంగా నీటిసౌకర్యం కలుగజేశాడు. మోటారులు ప్రవేశపెట్టి, ప్రయాణసౌఖ్యం కలుగజేశాడు. ఈవిధంగా కొద్దిలోనే ఆశ్చర్యకరమైన పరివర్తన తెచ్చి ముసల్మానుల ప్రశంసను పొందాడు. ఆ తరువాత 1926 జూన్ నెలలో ముసల్మానుల కాంగ్రెసు ఒకటి సమా వేశపరచి, తన ఉద్దేశాలన్నీ వివరించాడు. యాత్రాస్థలాలు అభివృద్ధి చేయడం విషయంలో సలహా కోరాడు. ఖిలాఫత్ విషయంలో ఇబున్ సౌదు తెలివితేటలతో ప్రవర్తించాడు. పూర్వంనుంచీ తుర్కీసుల్తానులే ముసల్మానుమతాధిపత్యంకూడా వహించేవారు. యూరపు యుద్ధకాలం వరకూ మహమ్మదు గురుపీఠం తుర్కీసుల్తానులదే. వారి ప్రభ అణిగిన తరువాత ఆధునిక జాతీయపద్ధతులమీద రాజ్యనిర్మాణానికి పూనుకొన్న కమాలుపాషా ముసల్మానుగురుపీఠంతో తనకూ, తన రాజ్యానికీ సంబంధం లేదు అన్నాడు. ముసల్మాను ప్రపంచంలో, ముఖ్యంగా ఈజిప్టు ఇండియాదేశాలలో అలజడి కలిగింది. అంతక్రితంవరకూ, ఖిలాఫతు రక్షణ నిమిత్తం కావలసినంత హడావడిచేసి, 'అది తుర్కీవారి చేతుల లోనే పూర్తిగా రూపుమాసిపోతూఉంటే, చూస్తూ కూర్చుండడం ఏలాగు? ఖిలాఫతుపీఠం లేకపోతే, ఇంక ఇస్లాముగతి ఏమవుతుంది? దీనిని గురించి తగిన కట్టుదిట్టాలు చేయాలని నిశ్చయించారు. ఇందునిమిత్తం ఈజిప్టులో ముసల్మానుల కాంగ్రెసు ఒకటి జరిగింది. కాంగ్రెసులో ఖిలా ఫతునుగురించి దీర్ఘంగా యోచించారు. కాని చివరకు తేలిన పర్యవసానం శూన్యం. ఈ ఆధునికయుగంలో మతగురువులకూ, మతపీఠాలకూ మాహాత్మ్యం మాయమవుతుం దన్నమాట మరిచిపోయారు. ఆ తతంగ మంతా మహమ్మదుయుగంలో చెల్లిందికాని, ఇపుడు సాధ్యం కాదన్న సంగతి వారికి తోచలేదు. ఈరహస్యం ఇబున్‌సౌదు గ్రహించాడు.

ప్రపంచంలో ఉన్న ముసల్మాను లందరి క్షేమమూ కాపాడగలవాడే మహమ్మదు స్థాపించిన గురుపీఠం అధిష్ఠించడానికి అర్హుడు. ఆకార్యం ఈకాలంలో అసాధ్యమన్నాడు. హెజాజుకు ఇబున్‌సౌదు రాజుకావడం కొందరు ముసల్మానులకు మొదట ఇష్టంకాలేదు. కాని కొద్దిలోనే వారంతా అతని రాజత్వం అంగీకరించక తప్పిందికాదు.

ఇబున్‌సౌదు అరేబియాలో అద్భుతమైన పరివర్తన కలుగజేశాడు. పాశ్చాత్యు లెవరికీ దేశంలో ప్రాధాన్యం లేకుండాచేశాడు. అతని రాజ్యంలో ఇస్లాముమతశాసనాలన్నీ వారికీ వర్తిస్తాయి. పెద్దదైన తన రాజ్యమంతా రెండురాష్ట్రాలుగాచేసి నెజ్దురాష్ట్రానికి పెద్దకొడుకునూ, హెజాజుకు చిన్న వానినీ రాజప్రతినిధులుగా నియమించాడు. హెజాజురాజ్యపాలనకు ఒక మంత్రివర్గం, ఒక చిన్నశాసనసభా ఏర్పరిచాడు. దేశంలో ఆరోగ్యపారిశుద్ధ్యాదివిషయాలు అభివృద్ధిచేశాడు. విద్యాభివృద్ధికి ముఖ్యపట్నాలలో పాఠశాలలు పెట్టించాడు. ఉన్నతవిద్యాభ్యాసం నిమిత్తం కొందరిని ఈజిప్టుదేశానికి పంపించాడు. మోటారులు విరివిగా ఉపయోగించడంవల్ల దేశంలో ప్రయాణసౌకర్యం అధికమయింది. ఈ రోజులలో అరేబియా ఎడారి ఈపక్కనుంచి ఆపక్కకు మోటారులో ప్రయాణంచేయవచ్చు. రేడియోమూలంగా ఎడారిలో వివిధస్థలాలకు సంబంధంకలిగింది. అరేబియా ఎడారిలోకూడా ఆధునికజీవనం అలవాటైంది.

దాదాపు పదిపదిహేనుసంవత్సరాలక్రిందట బ్రిటిషువారు ఇబున్‌సౌదుతో సంధిచేసుకొన్నప్పుడు అతని ప్రభ వారు అంతగా గుర్తించలేదు. అప్పట్లో అతను ఎడారిమధ్య కాలక్షేపం చేస్తున్నాడు. సుస్థిరంగా అక్కడే ఉంటాడని ఆశించి తదనుసారంగా అప్పటి సంధి చేసుకొన్నారు. ఒక విధంగా, నెజ్దురాజ్యంకూడా తమ రక్షణలోనిదే అన్న భావంతో అప్పుడు వ్యవహరించారు. కాని పదిపదిహేనుసంవత్సరాలలో అరేబియా ద్వీపకల్పమంతా అతని స్వాధీనమైన తరువాత పూర్వపు సంధి అర్థవిహీనంగా కనపడింది. పాత ఒడంబడిక రద్దుచేసి, 1927 సం॥రంలో కొత్తగా సంధిచేసుకొన్నారు. సకలవిషయాలలోనూ ఇబున్‌సౌదు సర్వాధిపత్యానికి

సమ్మతించక తప్పిందికాదు. అంతకుపూర్వం హుసెయినుకాలంలో ఎఱ్ఱ సముద్ర మార్గాన్ని ఆయుధసామగ్రి దిగుమతిచేసుకోకూడదన్న నిషేధం బ్రిటిషువారు తొలగించారు. బ్రిటిషువారి రక్షణలో ఉన్న రాజ్యాలమీద దండెత్తనని ఇబుౝసౌదు పూచీపడ్డాడు.

1930 సం॥రంలో ఎఱ్ఱసముద్రతీరంలో ఉన్న అసీరురాజ్యం కూడా ఇబున్‌సౌదురాజ్యంలో చేరింది. దీనితో దక్షిణంలో మూలగా ఉన్న ఒక్క ఎమెను రాజ్యంతప్ప మిగతా అరేబియాద్వీపకల్పానికి అంతకూ ఇబున్‌సౌదు ఏకచ్ఛత్రాధిపత్యం వహించాడు. ఎమెనురాజ్యపాలకుడు ఇమామ్‌ఎహ్యా అనేఅతను ముసల్మానులలో చాలా గౌరవపాత్రుడు. ఎమెనురాజ్యం ద్వీపకల్పంలోనికంతకూ ఫలవంతమైనదీ, ఎక్కువ జనసంఖ్యగలదీని. ఈరాజ్యంకూడా ఆధునికపద్ధతులలో అభివృద్ధికావల సిందే; కాని పాలకుడు పూర్వయుగంలోనివాడు. ఎమెనుపాలకుడు తనకు కూడా గౌరవపాత్రుడే అని వెల్లడించాడు ఇబున్‌సౌదు. వీరిద్దరూ మొన్న మొన్నటివరకూ సఖ్యంగానే ఉన్నారు. కాని 1934 సం. రంలో రెండు రాజ్యాలకూ యుద్ధం ప్రబలింది. ఎమెనువారి ముఖ్యపట్నాలు కొన్ని ఇబున్‌సౌదు స్వాధీనంచేసుకొన్నాడు.

ఇబున్‌సౌదు పూర్వాచారం అవలంబించేవాడైనా, ఆధునికదృష్టి లేకపోలేదు. జాతీయభావం పెంపొందించి, అరేబియాను ఆధునిక రాజ్యంగా తయారుచేయడం అతనికి లక్ష్యం. ఇందుకు తగిన ప్రయత్నాలు చేస్తున్నాడు. కాని ఈ ఆధునికభావాలు ఎడారిప్రజలకు మతవిరుద్ధంగా తోచడం తప్పదు. ఈమూలంగా కొంతమంది ప్రముఖులలో అసంతృప్తి కలిగింది. మొదటలో ఇబున్‌సౌదుకు ముఖ్యఅనుచరులైన ఫైజలు ఎడ్‌డావిష మొదలైనప్రముఖులే అతనికి ఎదురుతిరిగారు. నెజ్దుసరిహద్దులో ఉన్న ఇరాకురాజ్యంమీద వీరు దండెత్తడం ఆరంభించారు. బ్రిటిషువారితో సంధిప్రకారం ఈ అపాయం లేకుండాచేయడం ఇబున్‌సౌదుకు విధి. కొంతమందికి అసంతృప్తి కలిగిందన్నవిషయం అతను గ్రహించక పోలేదు. 1928 లో ప్రముఖుల నందరినీ సమావేశపరిచాడు. ఇబున్‌సౌదు

మీద కత్తిగట్టిన ఫైజలు, సుల్తానులు ఇద్దరూ తప్ప మిగిలిన అరబు ప్రముఖులంతా సమావేశమయారు. వీరందరినీ వశంచేసుకొన్నాడు ఇబున్ సౌదు. "నన్నుగురించి మీకు ఏవిధమైన సందేహాలు ఉన్నా, వెల్లడి చేయండి. నేను భయపడి ఈవిధంగా అడగడంలేదు. మనుష్యమాత్రుల సహాయం లేకుండా, ఒక్క భగవంతుడే సహాయంగా కాలంగడిపాను చాలాకాలం. అతని దృష్టిలో పవిత్రుడనుగా ఉండడమే నా ఆదర్శం. నిర్భయంగా, స్వతంత్రంగా మాటాడండి. శ్రద్ధగా, సావధానంగా వింటాను. మనలో మనకు అభిప్రాయభేదం ఉంటే, మతధర్మంప్రకారం బద్ధులమవుదాము. మీముందు ఏవిషయమూ దాచను. హృదయంలోభావం వెలిబుచ్చకుండా కప్పిపుచ్చినవారు భగవత్సాన్నిధ్యం చేరలేరు. మీభావాలు వెలిబుచ్చినందుకు ఎవరికీ, ఏవిధంగానూ నిర్బంధం కలుగజేయను. మనలో అభిప్రాయభేదం ఉంటే కొరాను తీర్పుచెప్పుతుంది'' అని ఆ సమావేశంలో ఉపన్యసించాడు. అందరూ పరిపూర్ణంగా వశులయారు. సందేహాలు కొన్ని చెప్పారు. వైర్‌లెస్, టెలిగ్రాపు మొదలయినవి కొరాను ఒప్పుకోలేదని కొందరు ఆక్షేపణచెప్పారు. అవి ఉపయోగించ కూడదని ఎక్కడా చెప్పలేదు అని ఉలేమాలు (పండితులు) తీర్పుచెప్పారు. రాజకీయవిషయాలలో అందరూ రాజును సమర్థించారు. ఇరాకుతో సఖ్యంగా ఉండడం ఆమోదించి, ఫైజలుఎడ్‌డావిషుయొక్క చర్యలు ఖండించారు. ఈవిధంగా ప్రజాభిప్రాయం తనకు అనుకూలంగా చేసుకొని ఇబున్‌సౌదు తిరుగుబాటు అణిచివేయడానికి పూనుకొన్నాడు. ఫైజలు ఎడ్‌డావిషు ఈసమావేశపు తీర్మానాలను లెక్కచేయలేదు. 1929 మార్చిలో యుద్ధం ఆరంభమైంది. ఆసంవత్సరం ఆఖరుకు రాజు పూర్తిగా విజయం పొందాడు.



# ఈజిప్టు




ఈ పటంవల్ల ఈజిప్టుదేశపు స్థితి బోధపడుతుంది. దేశానికి అన్నిప్రక్కలా బ్రిటిషువారి దేశాలో, వారి పెత్తనంగల దేశాలో ఉన్నాయి. నిలువుగీతలు గీసినవన్నీని ఇవి. ఈజిప్టు సూడాను సమస్యకూడా బోధపడుతుంది ఈ పటంవల్ల, నైలునదీముఖం దగ్గరనుంచి తిన్నగా కొలిస్తే, 600 మైళ్ళు దక్షిణంగా ఆరంభమవుతుంది సూడాను. అక్కడనుంచి ఇంకొక 1500 మైళ్ళవరకూ సూడానుదేశమే. దీనిపేరు మట్టుకు ఆంగ్లోఈజిప్టీయసూడాను. అధికారంమట్టుకు ఆంగ్లేయులది. ఇదీ బ్రిటను ఈజిప్టు దేశాలకు ముఖ్యమైన వివాదకారణం.




తుర్కీసుల్తానుల సామ్రాజ్యం క్షీణించిన విధం

అంకెలు సంవత్సరాలు సూచిస్తాయి. 1699 సం॥రంలో మొదలు, 1921-23 వరకూ పోగొట్టుకొంటూనే ఉన్నారు తుర్కీవారు రాజ్యం. ఆయా భాగాలు నష్టమయినకాలం అక్కడవేసిన సంవత్సరాలవల్ల తెలుస్తుంది. తుర్కీ అని వ్రాసినది మాత్రమే ప్రస్తుతపు తుర్కీ రాజ్యం. యూరపులో ఒక్క చిన్నతునకమాత్రం మిగిలింది.




సైక్సు. పికో రహస్యపు ఒడంబడిక ప్రకారం బ్రిటిషువారూ, వారి మిత్రులూ తుర్కీవారి రాజ్యం పంచుకోదలచిన విధం.

## సంస్కృతి ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సోవియట్ల దేశం * | .... | రూ. | 0- 8-0 |
| 2. | ఫ్రాన్స్ పతనం * | .... | ,, | 0- 8-0 |
| 3. | నేటి జపాన్ * | .... | ,, | 0- 8-0 |
| 4. | సోవియట్ రష్యా | .... | ,, | 0-12-0 |
| 5. | చైనాలో నూతన జీవితోద్యమం * | .... | ,, | 0- 4-0 |
| 6. | బోల్షివిజం * | .... | ,, | 0- 4-0 |
| 7. | పాకిస్థాన్ * | .... | ,, | 0- 4-0 |
| 8. | సోవియట్ సంయుక్తరాష్ట్రం—మన మిత్రరాజ్యం | | | 0- 8-0 |
| 9. | ప్రపంచ ఆర్థిక దుస్థితి | ... | ,, | 0- 4-0 |
| 10. | సోవియట్ల దేశం (రెండవ భాగం) | .... | ,, | 0-10-0 |
| 11. | నేటి చైనా | .... | ,, | 0-10-0 |
| 12. | ప్రజా యుద్ధం | .... | ,, | 0- 6-0 |
| 13. | యుద్ధకాలపు చైనా * | .... | ,, | 0- 4-0 |
| 14. | సోవియట్ రష్యాలో | .... | ,, | 0- 8-0 |
| 15. | లెనిన్ | .... | ,, | 0- 8-0 |
| 16. | గాంధీజీ * | .... | ,, | 0- 8-0 |
| 17. | హిందూ పద్ పాదుషాహి | ... | ,, | 2- 8-0 |
| 18. | డాక్టర్ కొట్నీస్ * | .... | ,, | 1- 0-0 |
| 19. | ఇండియా స్వాతంత్ర్య సమస్య | .... | ,, | 0- 8-0 |
| 20. | ప్రపంచ పరిణామము (జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరకు వ్రాసిన లేఖలు) | .... | ,, | 1- 8-0 |
| 21. | సుభాస్‌బోస్ అంతర్ధానగాథ | .... | ,, | 1- 8-0 |
| 22. | గాంధీతో ఒకవారం | .... | ,, | 1- 8-0 |
| 23. | నా జీవితము | .... | ,, | 1- 8-0 |
| 24. | ప్రపంచ చరిత్ర (1) (నెహ్రూ) | .... | ,, | 2- 0-0 |
| 25. | సామ్రాజ్యము | .... | ,, | 1- 0-0 |

* ప్రతులు లేవు.

**CULTURAL BOOKS LTD., Perambur MADRAS - 11.**

PRINTED AT THE B. N. K. PRESS, MADRAS. PAPER SUPPLIED BY PARTY